Bibliographic Record Target

మిస్-మేయో గ్రంథఖండనము / పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులవారిచే పరిష్కృతము.- మద్రాసు : జి. ఎన్. శాస్త్రి అండుకో., 1928.

iv, 105, 48, 39, 9 p. ; 18 cm.

Record no. 473

Mis-Mēyō granthakhaṇḍanamu / paṇḍita Purāṇaṃ Sūryanārāyaṇa Tīrthulavāricē pariṣkr̥tamu.- Madrāsu : Ji. En. Śāstri aṃḍukō., 1928.

iv, 105, 48, 39, 9 p. ; 18 cm.

Record no. 473

శ్రీరస్తు.



# మిస్ మేమో గ్రంథ ఖండనము






ప్రకాశకులు:

జీ. ఎస్. శాస్త్రి అండు కో,

పోష్టుబాక్సు నెం 110 మదరాసు.

శ్రీరస్తు.

# మిస్ మేయో గ్రంథఖండనము

(ఇందు మేయోగ్రంథసారము, రంగయ్యారుగారి ఖండనము, దీనబంధు, ఆండ్రూసుగారి ఖండనలేఖలును గలవు.)

---

బ్రహ్మశ్రీ

పండిత పురాణం-సూర్యనారాయణ తీర్థులవారిచే

పరిష్కృతము.

---




ప్రకాశకులు

జి-ఎస్. శాస్త్రి అండుకో

మద్రాసు.

వెల 1-0-0

1928

కేసరి ముద్రణాలయమున
ముద్రితము
మద్రాసు.

# పీఠిక.

క. శ్రీకొఱకు భారతీయులు, చేకొని పూజించుచుండు శివలింగము తా
వాకొనినయటులె యయి మే,యొకకన్యకుఁ దీర్చుఁగాత ముల్లాసంబున్.

క. శ్రీవైష్ణవుల మొగమ్ముల, పై వెలయుచునుండుపుండ్రపద్ధతి యది తా
భావించినటులెయయి మే,యొ వెలఁదుకకనులయెదుటనుండుత మెపుడున్

శా. న్యాయాన్యాయవిచారశీలమును దుష్టాదుష్టహృత్కష్టము
ద్దాయిత్వమ్మును గల్గివెలుఁగలకర్త్తా కాళి తాఁ గేవలా
న్యాయప్రక్రియ మమ్ము దూఱినయసూయామూర్తి యొక్క ధరిన్
మేయొకకన్యను జూచుఁగావుత సమున్మీలల్లలాటాక్షితోన్.

స్త్రీలు వారివారిప్రకృతిగుణములనుబట్టి ధర్మాంగనల లని యధర్మాంగన లని సామాన్యముగ రెండుతరగతులలోఁ జేరుదు రనియు, అం దధర్మాంగనలు మరల ఆసురి పైశాచి రాక్షసి యని ముత్తెఱఁగులనియు, అసురాంశసంభవ ఆసురి పిశాచాంశసంభవ పైశాచి రాక్షసాంశసంభవ రాక్షసి యనియు, వీరు తమోగుణప్రధాన లనియు, కావున నే

చ. పలుకులఁబొంకు సాహసము పంత మసూయయుఁ దృప్తిలేమి మా
యలు శుచిలేమి మోహము దయారహితత్వము లోభమత్సరం
బులు మద మెచ్చుకామము మూర్ఖత యివ్వి తమోగుణప్రధా
న లయినయాఁడువారలకు నైజగుణంబులుగా నెఱుంగుఁడీ.

అనియును భారతాదిగ్రంథములు వాకొనుచున్నవిగదా! ప్రస్తుతమున, పైమూఁడంశములను ముద్దగాఁ జేసి పుట్టింపఁబన కైథరీన్ మేయో వృద్ధకన్య యెందువలన నయిననేమి మనభారతభూమికి వచ్చి మన గుణములను కప్పిపుచ్చి యథాదిగా వచ్చుచుండెడి మన-ఆచారవ్యవహారములను దోషములక్రిందను భావించి గోరంతలు కొండంతలుగఁ జేసి తన-అపవిత్రహృదయమునకును, అయోగ్యతకును సూచకముగా "మదరిండియా" అను నొక పాడుపుస్తకమును వ్రాసి మొత్తముమీఁదను "భారతీయులు స్వరాజ్యమున కర్హులుగారు" అని ప్రతిదేశమువారును భావించుటకుఁగా ప్రకటింపించి మనపాపము మూటగట్టుకొన్నటుగా డబ్బు మూటగట్టుకొన్నది. వెనుక నొకప్పుడిదియే ఫిలిప్పైనుద్వీపములలోనివారు స్వరాజ్యసంపాదనాయత్తచిత్తులయి యుండఁగా నక్కడికిఁ బోయి వారియం దెన్నెని లేనిదోషములను మోపి "భయద్వీపము" లను పేర నొకపాడు గ్రంథమును వ్రాసి

వారిసిద్ధాన్నమును పడఁగొట్టుటకు ప్రయత్నించినదట! అట్లే మనమిపుడు స్వరాజ్యసంపాదనాయత్తచిత్తుల మగుచుండుటను సహింపఁజాలక సదరు గ్రంథమును వ్రాసిన దని పలువురువిమర్శకులు వ్రాసియేయున్నారు. స్త్రీజాతి కుండవలసిన దయాదాక్షిణ్యములయినను దీని కేకోశమునందును లేవని దీనిపాడువ్రాఁతలే వాకొనుచున్నవి. ఇది, అసురపిశాచరాక్షసాంశముల సంపూర్ణసమ్మేళనమున నవతరించిన పరమపాపాత్మురాలుగదా! ఇట్టిదీనిని "కొంపలుకాల్చుకొఱవి" అనినను అతిశయోక్తి కాఁజాలదు. గురివెంద గింజసామెతగా నిది తనదేశములో జరుగుచుండెడిదురంతములయిన అసంగతముల నెఱింగియు నెఱుంగనిదానివలెనే పెద్దల ధర్మసూత్రములకుఁ గట్టువడిన యమాయికుల మగు మనలను, ధర్మపురుషార్థప్రధానులమగు మన ధర్మములను ఆక్షేపింపవచ్చినది. దీనివ్రాఁతలను పలువురు న్యాయవిచారశీలురగు వారలే ఖండించియున్నారు. చాలమంది విమర్శకులు దీనిదేశములో జరుగుచున్న యసందర్భములను గూడ బయటఁబెట్టినారు. కొసకిది స్వపక్షపరపక్ష నిర్ధూమధామమురా లన్నయప్రతిష్ఠనుమాత్రమే సంపాదించుకొన్నది. ఇది యిట్టి దగుటచేతనే కాఁబోలును స్త్రీజాతి కెల్ల సృజించిన భర్తనుగూడ భగవంతుఁడు దీనికొఱకు సృజింపమానుకొన్నాఁడు. ఈకన్య చిన్నవయసుదిగాదు వృద్ధురాలేసుమండీ. పాతివ్రత్యమునకుఁ బట్టుఁగొమ్మలగు మనభారతరమణీరత్నములను ఇచ్చకు వచ్చినమచ్చున నిందించినందునవారి యుసురు తగిలి యిది యిహపరములలో చాలఁ గష్టములకు లోనుగాక తప్పదు. చిత్రగుప్తుఁడు దీనిపాపచరిత్ర నెన్నిపుస్తకములుగా వ్రాయునో కదా! యమధర్మరాజు దీనికెంతశిక్షచేసినను చేయనే వచ్చును. తథాస్తు.

అఱవభాషలోనికి మాఱిన దీనిపుస్తకమునుండి తెలుఁగున వ్రాసి యిచ్చిన శ్రీ. కృష్ణస్వామిశర్మగారికిని, దీనిపుస్తకమునకు ఖండనముగా శ్రీరంగయ్యరుగారు వ్రాసిన "భారతజనకుఁడు" అన్న గ్రంథముననుసరించి ఖండనభాగమును వ్రాసియిచ్చిన శ్రీజోస్యుల నారాయణమూర్తిగారికిని, లండనునుండి శ్రీదీనబంధు, ఆండ్రూస్ మహాశయుఁడు వ్రాసి ఎంగిండియాలో ప్రకటింపించిన ఖండనలేఖలను తమపత్రికలో ప్రకటింపించి మాయుద్యమమునకుఁ దోడ్పడిన శ్రీయాంధ్రపత్రికాధిపతులకును, ఈపుస్తకమునిట్లు తయారుచేయించిపెట్టిన శ్రీతీర్థులుగారికిని మాకృతజ్ఞతకు సూచకముగా వందనమాలిక లందించుచున్నాము.

ప్రకాశకులు.

శ్రీరస్తు.

వన్దే మాతరమ్.

# మిస్ మేయోగ్రంథ సారము

---

## ప్రథమాధ్యాయము.

---

కాళీఘట్టము

ఆంగ్లసామ్రాజ్యస్థ ప్రధాననగరములలో కలకత్తా నగరము ద్వితీయస్థాన మాక్రమించుచున్నది. ఈనగరము బంగాళాఖాతమున కుత్తరపువైపున హుగ్లీనది నంటి నిర్మింపఁబడియున్నది. ఈపట్టణములోని ప్రతివీథియు ఉన్నతమైన భవనములతోడను, కండ్లకు మిఱుమిట్లుగొలుపు ధవళకాంతుల నీను మహమ్మదీయుల ప్రార్థనామందిరములతోడను, విశాలారామములతోడను నిండి నేత్రానందకరమై యొప్పుచున్నది. ఎటు చూచినను అత్యున్నతములగు భవనములే కానగును. వ్యాపారస్థలము మిక్కిలి రమణీయత నొప్పును. జనసమూహముతో బజారువీథు లెల్లప్పుడును క్రిక్కిఱిసియుండును. వీథులయందు బండ్ల రాకపోక లెడతెగక జరుగుచునేయుండును. పలురకముల వస్త్రములధరించి జనులు జనాకీర్ణములైనవీథుల సంచరించుచుందురు. వీరిమధ్య శరీరసౌష్ఠవహీనులై బక్కపీచువలెఁ గనఁబడుచు ఖద్దరువస్త్రధారులైన విద్యార్థులు గానగుదురు. కలకత్తానగరము మిక్కిలి

ధనవంతమైనది. ప్రపంచమునఁగల సకలవ్యాపారములును నిక్కడ జరుగుచున్నవి. గవర్నరుగారియింటియందు విందులు జరుగునపుడు బంగాళీయులు వెడలి గవర్నరుదంపతులకు తమ విధేయతను జూపి వారితో విందులఁ గుడిచి సంతోషముగ కాలము గడపెదరు.

కాళీదేవాలయము

కాళీఘట్ట మనుట కాళీదేవికి వాసస్థాన మని యర్థము. ఈ కాళీఘట్ట మను పదమునుండియె కలకత్తా యనునది కలిగినది. కాళీ యనునది హైందవులదేవత, పరమేశ్వరుని భార్యయట. ఈ దేవత సుమారు 5000 సంవత్సరములకుఁ బూర్వము జన్మించెనట. 432 వేల సంవత్సరములవఱకును జీవించియుండునట. ఈ దేవతకు రక్తపాతము, నాశనము మున్నగు వానియందు ప్రీతి యెక్కువయట.

హిందూదేశమున లెక్కకు మిక్కిలిగ నీ కాళియాలయము లున్నవి. ఇచ్చటి కాళీదేవాలయ మొక బెంగాలీ బ్రాహ్మణునికి సర్వస్వాతంత్ర్యములతోను జెందియున్నది. మూఁడు శతాబ్దులుగ నీయాలయ మీబ్రాహ్మణ కుటుంబము యొక్క పరిపాలనయం దున్నది. ఈ కుటుంబమువా రొకరు నన్ను నీ దేవాలయమునకుఁ దీసికొనిపోయిరి. వారియింటి పేరు హాల్దార్ గాన వారిని హాల్దా రనియే పిలిచెదను. అతఁడు బెంగాలీవానివలెనే వస్త్రధారణముఁ జేసి యుండినను ఇటలీ దేశస్థునివలెఁ కాన్పించును.



ఈ దేవాలయమునకు 590 ఎకరములభూమి యాస్తి గలదు. ఈ భూమికి గవర్నమెంటునకు సిస్తు చెల్లింపనక్కఱ లేదు. మఱియు దూరదేశములనుండి యాత్రికులు దేవి దర్శనార్థ మరుదెంచి కానుకల నర్పింతురు. దేవాలయద్వారమున కిరుపార్శ్వములయందును కర్పూరము, టెంకాయలు, మున్నగు వానిని విక్రయించు విక్రయశాలలు గలవు. వీనివలనను దేవాలయమున కాదాయము వచ్చుచున్నది. హాల్దారు యాత్రికులమధ్య నన్ను ఆలయములోనికిఁ గొనిపోయిరి. మధ్యఁగల మండపము దాఁటఁగనే దేవి ఘోరరూపిణియై ముఖము సమముగఁ గనుపింపక నల్లని ముద్దవలెఁ గానుపించెను. నాలుక జాఱవిడువఁబడి రక్తములో ముంచియెత్తినటులు గనుపించుచుండెను. దేవి చతుర్బాహువులు గలిగి యొకహస్తమున ఖండింపఁబడి రక్తము కారుచున్నట్టి యొక శిరమును, మఱొకహస్తమున ఖడ్గమును, మఱిరెండు హస్తములు రక్తపుమరకలతో నెఱ్ఱనై కానిపించెను. కాళి పాదములకడ నర్చకుఁడు నిలువఁబడియుండెను. దేవి కెదురుగ జనసమూహము సాష్టాంగముగ నమస్కరించుచుండెను. ఒక మూల నొకముదుసలి ఏదో యొకగ్రంథమును అందఱికిని వినఁబడునటులు చదువుచుండెను. అది కాళికాపురాణ మని హాల్దారు నాకెఱిఁగించెను.

రక్తమును నాకుట

మే మిటు లుండఁగా నకస్మాత్తుగ నొకధ్వని వినఁబడినది. వెంటనే బయటికి వచ్చితిమి. ఒకఅర్చకుఁడు తన

చేత నొకఖడ్గమును ధరించియుండెను. వానిసమీపముననే మఱియొక అర్చకుఁడు ఒక మేఁకను గట్టిగఁ బట్టుకొని యుండెను. మేళము పెద్దధ్వని చేయుచుండెను. మేళములును, దేవాలయపుగంటలును మ్రోఁగుచుండ ఖడ్గధారియగు అర్చకుఁ డా మేఁకను ఖండించెను. రక్తము ప్రవాహముగ పాఱుచుండెను. ఆసమయమున యాత్రికులు సాష్టాంగముగ నమస్కరించుటకు మొదలిడిరి. వెనుకఁజిక్కిన యొకయువతి ముందునకుఁ బోవీలులేక జనసమూహమును త్రోసికొనిపోయి రక్తము పడినచోట దేవికి నమస్కరించి క్రిందనుండిన రక్తమును నాలుకతో నాకెను. ఈయువతికి సంతానము లేకుండుటచే నట్లుచేసిన సంతానము గలుగునని యామెభావమట! వేఱొకయువతి వెంటనే వచ్చి తనచీరయొక్క కొంగు నా రక్తములో తడుపుకొని యావలకుఁ బోయెను. ఇవన్నియు నైనపిదప కుక్కలు వచ్చి యారక్తమునే నాకుచుండెను. ఇట్లు దినమునకు వంద లేక రెండువందల మేఁకలు బలి యియ్యఁబడుచున్నవనియు, మేఁకలను యాత్రికులే తెత్తురనియు హాల్దారు చెప్పెను.

దేవతలు

ఈవేడుకలను జూచినపిదప ఆలయప్రాకారములోని స్వాములను చూచుటకొఱకు హాల్దారు మమ్ము పిలుచుకొని పోయెను. మొదట నొక దేవతను చూచితిమి. అది మశూచికము నడ్డగించు దేవతయట! ఆ వెనుక "నాగము" అను దేవుఁడు గలఁడు. సర్పవిషశమనమునకై యీస్వామిని పూజింతురట.



దానిపిదప హనుమంతుఁడను దేవుని గంటిమి. కసరత్తు చేయువారును, క్రొత్తగ వ్యాపారము మొదలుపెట్టువారును ఈ దేవుని పూజింతురట! విద్యార్థులు పరీక్షకు వెడలునపుడు ఈ దేవుని స్తుతింతురట! వీనియన్నిటిని జూచి కాళీభర్తయగు పరమేశ్వరుని జూడ వెడలితిమి. ఇచట జనులు గుంపులుగూడి పరమశివుని ఫలపుష్పతాంబూలాదు లర్పించి సేవించుచుండిరి. ఇది చూచినపిదప హాల్దారు వేఱొకయిఱుకైన ప్రాకారమునకుఁ బిలుచుకొని పోయెను. అచట అంధులు, కుంటివారు మున్నగు ననేక దీనజనులు బిచ్చమడుగుచు కూర్చుండి యుండిరి. వీరుబూడిదను శరీరమునకుఁ బూసికొనియుండిరి. ఫోటో తీయుటకచటి కెవరైనను కేమిరాతో వచ్చినయెడల బిచ్చగాండ్రు ఫోటో తీయించుకొనుటకు ముందుపడెదరు. వీరిని చూచుచుండఁగా ఒక పురుషుఁడు ఒక యువతితో నటకు వచ్చెను. వారిరువురి మణిబంధములు నొకచేతిరుమాలతో బంధింపఁబడియుండెను. వారిరువురును నూతనదంపతు లనియు సంతానము గోరి శివదర్శనార్థము వచ్చిరనియు హాల్దారు మాకెఱిఁగించెను.

ఇట్లు మే మన్నిటిని జూచుచు సమీపమునఁగల శ్మశానమున కేఁగితిమి. అచ్చట నొకచిన్న పల్లములో మంట మండుచుండెను. దాని సమీపముననే యొకయువతి మూర్ఛితయై, తలవిరియఁబోసి పడియుండెను. ఆమె ముఖము, చేతులు, కాళ్లు మున్నగునవి ఎఱుపువర్ణము గలది యేదో పూయఁబడియు నల్లనిశిరోజములయందు పుష్పములును కనఁబడెను. ఆమెబంధువులు చిన్నవోయిన ముఖముతో నట నిలువఁబడి

యుండిరి. వృద్ధస్త్రీ యొకతె యేడ్చుచుండెను. 10 సం॥ముల ప్రాయముగల యొక బాలుఁడును నిలువఁబడియుండెను. బిచ్చగాండ్రు వారిచుట్టు మూఁగుచు బిచ్చమడుగుచుండిరి.

దహన సంస్కారము

క్రిందను పడియుండిన యువతిని నలుగురు మోసికొని వచ్చి మండుచున్న చితిపై నుంచి పైన కొన్నికట్టెల నమర్చిరి. ఆయువతియొక్క కుమారుఁడగు 10 సంవత్సరముల బాలుఁడు తల్లిని చితిపై నుంచినవెంటనే చేతిలో నొక దివిటీవంటిదాని నెత్తుకొని చితికి ఏడుమాఱులు ప్రదక్షిణము చేసి దివిటీని చితిపైని పాఱవైచి యవతలికి పోయెను. దీనితో సంస్కారము సమాప్తమాయెను. మంటలును అమాంతముగ మండుచుండెను. "మఱునాఁడు అస్థులు, బూడిద మున్నగువానిని ఒకదుత్తలోఁ బెట్టి గంగలో పాఱవైతు" రని చెప్పి గంగా తీరమునకు మమ్ము తీసికొని పోయెను.

ఆమార్గము జనాకీర్ణమై యుండెను. ఒకచిన్నకాలువలో గంగ పాఱుచుండెను. అది పరిశుభ్రముగ లేక బురదగ నుండెను. కాని, యనేకు లందు స్నానము చేయుచుండిరి. "ఈకాలువ చాల పురాతనమైనది. గంగనుండి యొకభాగముగ నిందు ప్రవహించుచున్నది. ఇది చాల పుణ్యతీర్థము. రోగులు స్నానము చేసినచో తమ రోగమునుండి విముక్తు లగుదురు. కావున ననేకులు స్నానార్థము వచ్చుచుందురు. సాధారణజనులును తమ పాప పరిహారార్థ మిందు స్నానము చేయుదురు. ఈనమ్మక మందఱికిని కల" దని హాల్దారు చెప్పెను.



ప్రజలు స్నానము చేసినపిదప నియమనిష్ఠలను జేయుదురు. పిదప నీటిలోనిమట్టిని పైకిఁదీసి దానిలో నేమైన నున్న దేమో యని వెదకుచుండిరి. అస్థులను కుండలోఁ బెట్టునపుడు వానితో నొక బంగరునాణెము పెట్టి విసరుదురు. అవేమైన తమ కొకటిరెండు దొరకునేమో యని వెదకుచున్నా రని హావల్దారు చెప్పెను.

మే మక్కడ నుండఁగనే పూజారులు కొందఱు మేఁకలు కొన్నిటిని తోలుకొనివచ్చి నీటిలో ముంచుచుండిరి. చలి కోర్వలేక యవి యఱచుచుండఁగ దేవాలయమునకుఁ దోలుకొనిపోయిరి. ఆపిదప స్త్రీ పురుషులు కొందఱు బిందెలతో వచ్చి తీర్థమును తీసికొనిపోవుచుండిరి. ప్రతిమేఁకను బలి యిచ్చుటకు పూర్వము వానిని స్నానము చేయింపవలయునట. స్త్రీ పురుషులు తీసికొనిపోయిన తీర్థముతో కాళికాదేవి నభిషేకించవలయునట. ఈ సమయమున హాల్దారు మా సెలవు గైకొని యింటికిపోయెను. పిదప మేము దేవాలయముం జేరి ప్రాకారమును చుట్టి నడచుచుండఁగ నొకద్వారము కనఁబడెను. దానినుండి ముఱికినీరు వచ్చుచుండెను.

ముఱికినీరుప్రసాదమా?

ద్వారమునుండి ముఱికినీరు వచ్చుట మొదలిడినతోడనే మాదగ్గఱ నిలచియుండిన యొకస్త్రీ వేగముగ ద్వారమునుసమీపించి అందునుండి వచ్చునీటిని ఒకపాత్రలో పట్టి త్రాగెను. శుద్ధమైన గంగాతీర్థమును కాళికాదేవి కభిషేకించిన పిదప నాతీర్థమును త్రాగుటచే కడుపునొప్పి,

జ్వరము మున్నగువ్యాధులు కుదురుననియు, ఇచ్చటికి రావీలు లేనివారికి ఇంటికి తీర్థము తీసికొనిపోదు రనియు నట నున్నవారు మా కెఱింగించిరి. అప్పటికే ప్రొద్దెక్కుటచే మే మటనుండి నగరమునకు చేరుకొంటిమి.

"మీ రెందులకు కాళీఘట్టమునకు వెడలితిరి? దానిని జూచిన హిందూదేశమును చూచినట్లు కానేరదు. విద్యావిహీనులును, అజ్ఞానులునగువారే కాళీభక్తులై యున్నారు" అని మఱునాఁడు మమ్ము సంధించిన బ్రహ్మజ్ఞానసమాజసభ్యుఁడగు యూరపియ నొకఁడు మిక్కిలి విచారముతో చెప్పెను. బంగాళీయుఁడును, విద్యావంతుఁడు నగు నొకబ్రాహ్మణుని వద్ద నీవిషయముల నెఱిఁగించితిని. దాని క్రిందివిషయముల నాయన నా కెఱిఁగించెను.

"మీవద్ద బ్రహ్మజ్ఞాన సభ్యుఁడు అబద్ధములు చెప్పినాఁడు. ఉత్తమతరగతికిఁ జేరినవారు చాలమంది కాళీభక్తులుగాక విష్ణుభక్తులనుట నిజమే. విష్ణుభక్తులు మద్యపానము చేయరాదు అనుటయే కారణము. కాని యనేకులు బ్రాహ్మణులును కాళీభక్తులై యున్నారు. ఇది దేశ మంతటను జరుగుచున్నది. కాళీఘట్టములోని దేవిదర్శనార్థము హైందవులనేకులు వెడలుచున్నారు. వీరిలో జ్ఞానులును, విద్యావంతులును, ధనవంతులు నెందఱో కలరు." అని నుడివెను.

---

## ద్వితీయాధ్యాయము.

---

నాభరతఖండయాత్రకు కారణము

అనేకములు ప్రయాణసౌకర్యములుగల యీకాలమున ప్రపంచవిషయములు దెలిసికొనుట అత్యంతావశ్యకము. దీనిని మది నెంచియే నేను భరతఖండమున సంచారము చేసి ప్రజలయొక్క జీవితము నెఱుంగ నుత్సాహవంతురాల నైతిని, కాని భారతకళలను గూర్చికాని రాజకీయ, మత, సాంఘిక, సాహిత్యాది విషయముల విమర్శించుటగాని నామతముగాదు. మఱియు నాప్రయాణమునకు ఎవరియొద్దను ధనసాహాయ్యమును బొంద నిచ్ఛగింపలేదు. ఒకరిపరముగ పక్షపాతమును వహింపలేదు. ఈయభిప్రాయముతోడనే, భరతఖండమున సంచారము చేయుటకు నేను గత 1925 సం॥ము అక్టోబరునెలలో ప్రథమమున ఇంగ్లండునకువెళ్లి అటగల యిండియాకార్యాలయమునకుఁ జనితిని. అటగల యుద్యోగి యొకరు నన్నాహ్వానించఁగా నేను బయలుదేరి వచ్చినవిషయముల నాయన కెఱిఁగించితిని. దాని కాయన "మావలన మీ రెట్టిసాయమును కోరెద" రనెను. "నేను ఇండియా సందర్శనానంతరము చెప్పువిషయములను మీరు నమ్మవలెను. అంతే కాని మఱియెట్టిసాయము నాకక్కఱలే" దంటిని. "మీరచటఁ గాంచువిషయములను చాల జాగ్రత్తగ వివరింపవలయును. ఎట్టివిషయములును సామాన్యవిషయములుగ తలంపరాదు. ఏపట్టణమును గూర్చికాని మీరు నుడువువాక్యములు

జాగ్రత్తగ కూర్పఁబడవలె''నని యాయన నాకెఱిఁగించెను.

భరతఖండమునఁగల ముఖ్యస్థలముల నన్నిటిని చూచితిని. నే నేపట్టణమునకు వెళ్లినను అటగల వైద్యనిపుణులను, వారు చేయు చికిత్సావిధానములను చూచితిని. తాలూకాలకు గ్రామములకుఁగూడ వెడలి యందందుఁగల ఆసుపత్రులను చూచితిని. వ్యాధిగ్రస్తులను గుఱించినవిషయములను వైద్యులవలన నెఱింగితిని. ఉత్తరపుకోననుండి చెన్నపురివఱకుఁగల స్థలముల నన్నిటిని చూచితిని. కొన్నిమ్యునిసిపల్ సభలకును, పంచాయతీసభలకును, సెషన్సుకోర్టులకును హాజరై విచారణావిధానముల నెఱింగితిని. ఆంగ్ల మంత్రసానులతోఁడ ననేక ప్రదేశములకు వెడలితిని. ధనవంతులగృహములను జూచితిని. హిందూస్త్రీలు ప్రసవసమయమున ననుసరించువిధమును ఆహారమును గుఱించి తెలిసికొంటిని. గ్రామపరిస్థితులను గూడ నెఱిఁగితిని. కళాశాలలు, పాఠశాలలు, వానియందుఁగల బోధనాపద్ధతులు, శాసనసభలు మున్నగువానికి వెడలియుంటిని. రాజులు, మహారాజులు, యువరాజులు వీరు వారన నేల భరతఖండమునఁగల ప్రముఖు లందఱితోఁడను సంభాషించితిని. ''ఇంతకాలముగ బ్రిటిషుపరిపాలనయందు హిందూదేశ మున్నను తగినవిద్య, సంపద లేకపోవుటకు కారణమే''మని భరతఖండవాసులు ప్రశ్నించెదరు. అందుకు ''మమ్మెప్పుడును ప్రోత్సహించుచునే యుండవలయును. స్వాయముగ నేకార్యమును చేయఁజాలము. ఏదైన నొకకార్యము చేయఁదలఁచినచో దానిని పట్టుదలగఁ జేయుటలే'' దని సర్



చిమన్లాలుగారు నుడివెదరు. ''మనము స్వతంత్రముగ నేకార్యమును జేయలేకుండుట కాంగ్లేయు లడ్డుదగులుచున్నా''రని మహాత్మా గాంధిగారు నుడివెదరు. మరికొందఱు దేశసేవకులు ''మన కేల ఐకమత్యము, దీక్ష, ధైర్యము, త్యాగము లేకున్నవి? ఇవన్నియు మనపూర్వులయందు సంపూర్ణముగ నుండినవే కదా. మనకు లేకుండుటకు కారణ మేమి? పరప్రభుత్వమే కారణ మగుచున్నది. ఈనిరంకుశప్రభుత్వమువలన పలుబాధలకు లోనైతిమి. ఈప్రభుత్వము మనల వీడి చనినపిదపనే భారతమాతకుఁగల కొఱంత లన్నియు తీరఁగలవు. అప్పుడు మన కన్నిసుగుణములును అలవడు'' నందురు.

ప్రభుత్వపు జవాబుదారీ

ఇట నే నొకమాట నుడివెదను. ఈపైకారణములకు బ్రిటిషుప్రభుత్వ మెంతమాత్రము కారణము గానేరదు. బ్రిటిషుప్రభుత్వము రాకపూర్వమునుండియు భరతఖండమున నివన్నియు సామాన్యముగ వ్యాపించియుండినవి. వీనికి ప్రభుత్వమును నిందించిన లాభము లేదు. హైందవు లెప్పుడైనను తమకుఁగల గుణములకు తామే కారణ మనియు, తమకవి సహజములైనవనియు గ్రహించి వానిని పోఁగొట్టుకొనఁ బ్రయత్నింపక ప్రభుత్వమును నిందించుచుండినచో నింక ననేకశతాబ్దములు పరప్రభుత్వమునకు దాసులై యుండవలసియే యుందురు.

మాటలచే ప్రయోజనము లేదు

దీని కుదాహరణమిూక్రింద నుదాహరించెదను. పన్నెం

డువయసుగూడ లేక యొక బాలిక కల దనుకొనుఁడు. ఆమెకు
శరీరమున చర్మమును, అస్థులు తప్ప మరేమియు లేదు. విద్య
యనున దే సున్న. తనశరీరారోగ్యమును కాపాడుకొనుటకై
నను సామర్థ్యము లేదు. అట్టిస్థితిలో నామె కొకశిశువు జన్మిం
చుచున్నాఁడు. ఆశిశు వెంతదార్ఢ్యముగ నుండునో యూ
హింపుఁడు. మఱి యాశిశువునకు మంచిగాలి, శరీరపరిశ్రమ
యేమియు లేదు. శిశువు బాలుఁ డగునపుడే వృద్ధుఁడు నగు
చున్నాఁడు. దీని కేమి కారణము? ప్రభుత్వమా!

గ్రామవాసుల విచారింపుఁడు. వారలకు విద్య లేదు,
దానియం దాసక్తియు లేదు. ప్రారంభవిద్య నొసఁగఁ బ్రయ
త్నింపుఁడు. కాని స్త్రీలోపాధ్యాయినిని మాత్రము నియమింప
వలదు. అట్లు చేసిన నామెకు కీడు మూఁడును. పరిస్థితు లిటు
లుండిన విద్య యెట్లు రాఁగలదు. ఇట్లు జీవించుజను లేల చిఱు
తప్రాయమున మరణించరు? ఇవియే కారణములు. ఏప్రభుత్వ
మైనను నా కక్కఱలేదు. హైందవులు సంపూర్ణస్వాతం
త్ర్యము కోరుదురేని పై కార్యములను విడువవలయును.

ఈవిషయములను హైందవులకుఁ జెప్పువారు లే రని
యే నేను భావించుచున్నాను. తా మేయేవిషయముల వెను
కఁ బడియున్నదియు గ్రహించినట్లే కనఁబడును. కాని వానిని
పోఁగొట్టుకొని పైకిపోవుటకు వారు యోజించుట లేదు. పర
దేశస్థుఁడు హిందూదేశమున సంచరించినను నివన్నియు గ్ర
హింపనేరఁడు. హిందూదేశమునఁ గల బ్రిటిషు-ఉద్యోగు



లెవరైనను హైందవుల పురోభివృద్ధికి పాల్గొన వీలులేదా
యనినవా రిట్టి విషయములయందు పాల్గొనకుండుటయే మేలని
భావించుచున్నారు.

1919 సంస్కరణముల నాఁటనుండియు వారు తమప
నిని నిర్వహించుటయం దెన్నియో విఘ్నములు సంభవించు
చున్నవి. హిందూదేశాభిమానులు పూర్వోన్నత్యమును పు
రాణములను కీర్తింతురేకాని ప్రస్తుతకాలపు నిర్వీర్యమును
గమనించి దానిని బాపుటకుఁ బ్రయత్నింపరు.

భారతీయుల పురోవృద్ధిని గోరి పై కార్యమును జేయ
సమకట్టితిని. నన్నెందఱో నిందింప వచ్చును. కొందఱు భూషిం
పవచ్చును. నేను ప్రత్యక్షముగఁ జూచినవానిని నమ్మక పో
వచ్చును. కాని వీనికి జంకక నే నీపుస్తకముద్వారా సర్వవిష
యములను బయలు పఱుప నిశ్చయించుకొంటిని.

---

## తృతీయాధ్యాయము.

---

సేవకబుద్ధి

"ఏదేశపుప్రజలు ధైర్యవంతులును, పరిశుద్ధజీవనులు
నై యుందురో వారలకే స్వరాజ్యము తప్పక లభించును.
వారలే యర్హులు" అని మహాత్మా గాంధిగారు నుడివియు
న్నారు. దీనికి ప్రజ లెవరును చెవులొగ్గుట లేదు. భారతమాత
విడుదలనుగుఱించి పెద్దగ నుపన్యసింతురే కాని వానిని

కార్యాచరణయం దుంచువారరుదు. అయ్యో! భారతమాత పుత్రు లిటులా యుండవలసినది! భారతమాత యజ్ఞానమై యున్నది. లేకున్న ధైర్యవంతులును త్యాగయుతులు నగు పుత్రులను బడయక పరితపించునా? భారతమాత పుత్రులు వాక్శూరులే కాని కార్యశూరులు కారనుట పరితాపము!

భారతీయుల పురోవృద్ధికి బ్రిటిషువారెంతయో మేలు చేసి యున్నారు. పాఠశాలలు, కళాశాలలు, ఆస్పత్రులు, రోడ్లు, నీటిపారుదలసౌకర్యములు, మార్కెట్లు, గొడ్డుభూములను వ్యవసాయ యోగ్యముగఁ జేయుట, ప్రయాణ సౌకర్యములు అవి యివి యన నేల సకల సౌకర్యములను భారతీయులకు బ్రిటిషు ప్రభుత్వము వారు లెక్కలేనన్నిటిని చేసి యున్నారు. అట్టి సాయము నెంతమాత్రము మాఅమెరికా ప్రభుత్వము కలుగఁజేయుటలేదు.

కొందఱు దేశసేవకులు బ్రిటిషుప్రభుత్వమును ఖండించినను కొన్నిసమయములయందు ఈప్రభుత్వమువలన మహోపకారమును బొందుచున్నా మనియే ఒప్పుకొనుచున్నారు.

భరతఖండ జనసంఖ్య 319000000 అయినను బ్రిటిషుపాలకు లగువారు 67432గురే యైయున్నారు. పెద్దసంఖ్య చిన్నసంఖ్యకు లోఁబడి యుండుటచేతనే లొంగుపాటు గలవారని వారలే చెప్పుదురు. కాని బ్రిటిషువారు రాక పూర్వము హిందూదేశమున అరాజక మెక్కువగ నుండెను. బలవంతునిదే రాజ్య మయ్యెను. ఎల్లప్పుడును ప్రజలకు భయముగనే యుండెను. ఎల్లప్పుడును యుద్ధములే కలుగుచుండెను.



**సంభోగప్రీయులు**

కాని వీని కేదో సమాధానము చెప్పెదరు. హిందూమతమును, దానిమాయావాదమునే దీనికి గారణముగఁ జెప్పుదురు.

భారతీయుల లేమికిని, విద్యావిహీనతకును, ధైర్యహీనతకును లొంగుపాటునకును ఇది కారణము కానేరదు. వీని కన్నిటికిని అత్యంత సంభోగప్రీతియే కారణము. దీని కుదాహరణముగ నొకభారతయువతిని చూతము. ఆమె ఋతుమతియైన 9 నెలలకే యొకశిశువును గన వాంఛించు చున్నది. 14 వయసు రాకమునుపే పిల్లను గన నాశగొను చున్నది. ఆమెకు విద్య బలము లేదు. మగఁడు చెప్పెడు విధమున చేయుచు నతఁ డాడించినట్టు లామె యాడవలసినదే. మగఁడో తనభార్యకంటె నొకసంవత్సరము పెద్దయై యుండును లేక వాఁడు 50 వయస్సైన నిండినవాఁడై యుండును. ఈరెండు ప్రాయములందును పురుషునివద్ద పుంస్త్వము శూన్యమే. వాఁడేమిచేయఁ గలఁడు?

ఇట్టియా చిన్నది ప్రసవవేదన యెంత పడవలయునో, ప్రసవవేదనచేఁ గలిగిన శిశువెటు లుండునో యూహింపుఁడు. చర్మము ఎముక తప్ప మరేమియు నుండవు. శిశుపోషణ తల్లికిఁ దెలియనవు డామె తనశిశువు నెంత రక్షించునో దురూహము. ఇంటియందుఁగల పెద్దలకైనను శిశురక్షణాజ్ఞానము శూన్యము. పిల్ల కలుగవలె ననెదరు గాని మరేమియు

నెఱుఁగరు. ఇంటియం దెల్లప్పుడు నివే మాట లగుటచే పిల్లలు నటులే తలంతురు.

### శివలింగము పురుష చిహ్నమా?

శివుఁడనఁగా హైందవులకు ప్రధానదైవము. ఈశివుని యాకారము పురుషచిహ్నమువలె చేయఁబడి యున్నది. దీనినే దేవాలయములయందును గృహములయందును పూజించెదరు. విష్ణువును పూజించువారు ముఖమున నొకవిధమైనచిహ్నమును ధరించెదరు. ఇది స్త్రీ పురుషసంభోగచిహ్నమును సూచించుచున్నది. ఈచిహ్నముల నేర్పఱిచిన పెద్దలు భగవంతుని చేరుట కొకసాధనముగ భావించి రని చెప్పుదురు. దీనితత్త్వ మెఱుఁగకుండుటచే పలువురు పలువిధములుగఁ జెప్పెదరు.

మఱియు హిందూదేవాలయములందుఁ గల స్తంభములు రథములు మున్నగు వానిమీఁదను చిత్రింపఁబడిన చిత్రములుకూడ సంభోగచిహ్నమునే సూచించు చున్నవి. ఇంటియందును స్త్రీలు పాడుపాటలును దీనినే సూచించును.

ఇట్టి యసహ్యాపటముల వ్రాయుటను ప్రచురించుటను ఖండించుటకై 1912 సం॥ సెప్టెంబరునెల 12 తేది జినీవాసభ ననుసరించి భారతశాసనసభలో ఇం. పి. కోడ్డు సవరణ తీర్మాన ముపపాదించిరి గాని యది క్రిందివిధముగ సవరింపఁబడెను. “దేవాలయములు మున్నగు మతసంబంధములయం దిది వర్తింపదు” అనుసవరణ నెగ్గెను.



### వ్యభిచారమునకు యువకులు

హైందవబాలుఁ డొకఁడు అందముగ నుండునేని, వానిని దేవాలయమునకు వదలెదరు. దానిని హీనముగ నెవ్వరును భావించుటలేదు. ఇది భరతఖండమంతటను గలదు. ఇంటఁగల ప్రతిబాలికకును, బాలునకును సంభోగమునుగుఱించియే బోధించెదరు. పురుషుఁడును స్త్రీయు నెటులు సుఖించియుండుట యనుదానినే తల్లి పిల్లలకు బోధించును.

ఆసుపత్రి కెవఁడైనను చికిత్సకు వచ్చినయెడల సుఖరోగియై యుండు ననియే వైద్యుఁ డభిప్రాయపడును. చిఱుతప్రాయమునుండియే బాలు రిట్టి దురభ్యాసముల కలవడుటచే నిర్వీర్యు లగుచున్నారు.

వయసు రాకపూర్వమే బాలికలకు వివాహము చేయవలయు నని హైందవశాస్త్రములు బోధించుట లేదు. దీనిని గుఱించి పండితులలోనే అభిప్రాయభేదములు గలవు. కాని యిది యాచారమున బాగుగ నాటుకొనిపోయినది. ఒకఁడు వివాహితుఁడైన కొన్నిమాసములకే పుత్రవంతుఁడు గావలెనని కోరెదరు. అటులు గానిచో వారల పితృదేవతలు ముక్తు లగుట లేదని భావించెదరు. ఈ భావము బాలునకు బాగుగ నాటుటచే వాఁ డెపుడును సంభోగప్రియుఁడై యుండును.

“తాను 13-వ ప్రాయముననే తనభార్యతో కాఁపురము చేయుచుండె” ననియు, “తాను పగటిపూఁట కొన్ని

గంటలకాలము పాఠశాలకుఁ బోనిచో నాసమయము గూడ సంభోగముక్రిందనే కడపి మరణించి యుందు'' ననియు మహాత్ముఁడే వ్రాసియున్నాఁడు.

పాశ్చాత్యదేశవాసుల సంపర్కముచేత నిపుడిపుడు హైందవులు బాల్యవివాహమును ఖండించుచున్నారు. ఇది క్రియలో నంతగఁ గనఁబడుటలేదు. పురాతనాచారముల వీడ మనసు రాకున్నది.

సాధారణముగ ఇంద్రియ నిగ్రహమును గుఱించి హిందూశాస్త్రములలో నెచ్చటను బోధించి యుండలే దని స్పష్టమగుచున్నది. ''సంభోగప్రియుఁ డగునపుడు అంటు వ్యాధి రాకుండ కాపాడుకొనువిధము నాచిఱుప్రాయముననే నాతండ్రి బోధించె'' నని యొకబారిస్టరనెను. ''ఇంద్రియనిగ్రహమును బోధించియుండినచో నెంత బాగుండు'' నని నే నంటిని. ''అది సాగని పని'' యని యతఁ డనెను.

''ఇట్టి విషయములలో మంచి చెడ్డ యనునది చెప్ప సాధ్యము గాదు. సంభోగసమయమున నేను దేనిని తలఁచుట లేదు. నామనోరథము తీరినపిదప మరల దానినిగుఱించి యోజించుటయు లేదు. నాభార్యను తృప్తిఁబొందించుటకే నే నామెతోఁ గూడుచున్నాను. ఇవన్నియు సహజమే. కనుక నెవ్వరిని ఏమియు అనుటకు వీలులేదు.'' అని యొకపెద్ద నాకెఱిఁగించెను.

మఱొక ఆశ్చర్యవిషయము గలదు. ఒకహైందవుఁడు



25 ప్రాయమునుండి 30 సంవత్సరములకే మగతనమును గోల్పోవుచున్నాఁడు. దీనిని అసత్యముగ నెవ్వరును భావింప రాదు. ఇది నేను ప్రత్యక్షముగఁ జూచినవిషయమే. వ్యవసాయికంటెను కొంతసుఖజీవనముగలవాఁడు త్వరగనే మగతనమును గోల్పోవుచున్నాఁడు.

మందుల ప్రకటన

దీని కెవరైనను తగినయాధారమును కోరుచో భారతదేశమున భారతీయులచే నడుపఁబడుచున్న పత్రికలలో వెలువడు ప్రకటనలఁ జూచినచో తేటపడును.

''ధాతుపుష్టియౌషధము. బీదనుండి ధనికునివఱకు, వ్యవసాయినుండి రాజువఱకు నుపయోగింపవచ్చును. పోఁగొట్టుకొనినబలమును మరల నిచ్చును. ఇపుడే కొనుఁడు. ముసలివానిని పడుచువానిగఁ జేయును. వెల రు 1 మాత్రమే'' అని పెద్దక్షరములలోఁ గానవగును. ఇదే పైవిషయములకు సాక్షీభూత మగును.

1922 డిసంబరు 29 నుండి 1925 డిసెంబరు 4 వఱకు పంజాబునఁగల పత్రికలలో ఆభాసప్రకటనల ప్రచురించినందుకై 11 సారులు శిక్షించిరి. దానినిగుఱించి ''బ్రాహ్మణ సమాచార్'' అను పత్రిక యిటులు వ్రాసెను. ''ప్రభుత్వమువారు ఆభాసప్రకటనల ప్రచురింపరాదని ప్రకటించిరి. అదెటులో దానినిగుఱించికూడ నొకప్రకటన ప్రచురించుటముఖ్యము'' అని యాక్షేపించినది. ''మందులు, తచ్ఛాంతిని కలు

గఁ జేయునుగాని శరీరమును పాడుచేయుచున్న'' వని మహాత్మ
గాంధి వ్రాయుచున్నారు.

మఱొక ఆశ్చర్యవిషయము: ఒకహిందూప్రముఖుఁడు తనకూఁతునకు వివాహము చేయఁగోరి అల్లునికి మేహసంబంధమైనరోగ మున్నదేమో యని సందేహించి డాక్టరు సర్టిఫికేటుకై వానిని నిర్బంధించినట్లు దెలియుచున్నది. దీనికి కారణము స్పష్టము. తనకూఁతురు గొడ్రాలు కాకుండవలయుననియే. స్త్రీ గొడ్రా లగుటలేదు. పురుషుని నిర్వీర్యత్వమే స్త్రీని గొడ్రాలుగ చేయుచున్నది. ఈహిందూప్రముఖునికి తనకూఁతురు గొడ్రాలని నిందింతురని భయము.

సంతానవరము

హిందూకుటుంబమున నొకయువతి సంతానవతి కానిచో తీర్థయాత్రకు వెడలుట యాచారము. కొందఱు వివాహమైనవెంటనే తమభార్యలను దేవాలయములకును తీర్థయాత్రలకును పంపివేయుదురు. ఆమె దేవాలయమునకు పోయి దేవుని సంతానవర మడుగుట యాచారము. ప్రతిదినము దేవుని ప్రార్థించును. దేవాలయమందే కొన్నిసమయములయందు పరుండుటయుఁ గలదు. ఆరాత్రి తనకుఁ దెలియకుండనే జరిగిన విషయముల పూజారి కెఱుకచేయును. దాని కాపూజారి దేవుఁడు నీకుఁగదా ప్రసన్నుఁడైనాఁ డనును. ఆమెయు మితిమీఱిన సంతసముతో నిల్లు చేరును.

పిదప నామెకు సంతానము గలిగినచో ఒకసంవత్స



రముపిదప నాదేవళమునకు కుమారునితోఁ జని ప్రార్థన చెల్లించుట గలదు. ప్రార్థన యనఁగా వెండ్రుకలు తీయుట. మనమే దేవాలయమునకుఁ జనినను అటఁగల యొకచెట్టుక్రింద వెండ్రుకలును, చెట్టుకొమ్మలకు కట్టఁబడిన చిన్నమూటలును గాననగును. ఇది పైనిచెప్పఁబడినటువంటి స్త్రీలుచేయుప్రార్థన. దీనికనియే పూజారులు క్రొవ్వినవారిని నియమింతురు. దీనిసత్యాసత్యముల మన మిట నరయనక్కఱలేదు. ఇది బహిరంగ రహస్యమే. ఏమైననుసరే సంతానము గలిగిన చాలును.

హైందవుల ''లొంగుపాటుతనమున'' కింతకంటె నెక్కువ వ్రాయనక్కఱలేదు.

సకలము విధిఫలితము

భారతీయుఁడు తనస్థితి నేల యోజించుకొనుట లేదు. దానిని సంస్కరించుటకుఁగూడ ప్రయత్నించుట లేదు. ఇట్టి పరిస్థితుల నొకభారతీయుఁడు విచారించుకొనినచో నాతఁడు సకలము కర్మవిధి యని సమాధానపడుచున్నాఁడు.

''భారతీయుల వయఃపరిమాణము 23. దీనికి కారణము సుఖాధారము లేమియే'' యని డాక్టరు హరిప్రసాదు నుడువుచున్నాఁడు. ''భారతీయుల ఆచారవ్యవహారములే సుఖాధారములలేమికి కారణము. దీనిని బాపుటకు స్వరాజ్యము కావలె'' నని మణిలాల్ సి. పారెక్ గారు నుడివిరి. ప్రతిదానికిని స్వరాజ్య మనెదరేకాని సంస్కరింపఁ బూనుకొనరు.

బొంబాయిబ్రాహ్మణులును, సుప్రసిద్ధవైద్యులు నగు

నౌకరు నాతో నుడివినవిషయ మిట నుదాహరించెదను. "తమ దుష్టాచారవ్యవహారములవలన శరీరబలమును పోఁగొట్టుకొని దరిద్రు లగుచున్నారు. దానిచే మగతనమును క్షీణించుచున్నది. ధైర్యమును లేకపోవుచున్నది,

పైన వివరింపఁబడినవిషయములకంటె నెక్కువ వ్రాయనక్కఱలేదు. హైందవులు చిఱుతప్రాయము నుండియు విషయేచ్ఛకు లోఁబడుటచే నిటు లగుచున్నారు. దీనిని సంస్కరింపఁబూనుకొనుట లేదు.

---

## చతుర్థాధ్యాయము.

### బాల్యవివాహము—వైదికుల వాదము

బాల్యవివాహమును గుఱించి భారతప్రభుత్వమువారెట్టి యభిప్రాయమును ప్రత్యేకముగఁ గలిగియుండుట లేదు. భారతీయుల మతసంబంధ విషయములయందు ప్రభుత్వమువారెట్టి జోక్యమును గలిగించుకొనుటలేదు. అట్లు లొకవేళ నేదైన మతవిషయమై శాసనములు చేసినచో నవి నిష్ప్రయోజన మగుటయేగాక దేశమున కలహ కారణముకూడ నగును. ఆచరణము దుస్సాధమగును. ఈకష్టములచేతనే ప్రభుత్వమువా రెట్టి యభిప్రాయమును గలిగియుండుట లేదు.

భారతీయ బాలికలకు వివాహవయఃపరిమాణమును నిర్ణయించు శాసనము శాసనసభలో చర్చకుఁ దేఁబడినపుడు



శాసనసభాసభ్యులగు వైదికులును, దేశమునఁగల మిగిలిన వైదికులును నెంతయో ఖండించియుండిరి. కాని 1891 సం॥న ప్రభుత్వమువారు ఇట్టి శాసననిర్మాణమునకై ప్రయత్నించిరి. అపుడు కొందఱు విద్యావంతుల సాయమున బాలికలకు 12 సం॥ల వయసు వచ్చినపిదపనే వివాహము చేయవలెనని శాసన మొందుగావించిరి. అపుడు ఎందఱో వైదికులు మిక్కిలి యాగ్రహముతో ప్రభుత్వమును ఖండించిరి. అప్పటినుండియు ప్రతివత్సరము శాసనసభలో నీవిషయమై చర్చ జరుగుచునే యున్నది. కాని వైదికులవాదమే నెగ్గుచున్నది. వయఃపరిమాణమునకు ప్రభుత్వసానుభూతి యున్నను, శాసనము మాత్రము చేయక మౌనము సాధించిరి. అది చాల మంచిదనియే నేను భావించితిని. శాసనముచేసినచో బహుళ సంఖ్యాకులగు భారతీయులకు కోపమును, దానిఫలితమున కలహములును సంభవించుచుండును గాన యుచితమార్గమునే వా రనుసరించిరి. భారతవిద్యావంతులకు శాసనము చేయుట సుకరమే. కాని దాని నమలులోఁ బెట్టుటమాత్రము కష్టతరము. ఏపనిని జేయఁదలపెట్టినను దానిని సంపూర్ణముగ నెఱవేర్పఁజాలరు. సామాన్యశాసనములనుగూడ ప్రభుత్వమువారు చాల కష్టముమీఁద అంగీకరింపఁజేయుచున్నారు. మఱియుమతసంబంధమగు శాసనములైనచో వానికి అంతే కనుపింపదు. వైదికుల కోపమున కంతుండదు. ఎల్లప్పుడును ప్రభుత్వమును ఖండించుచునే యుందురు. దీనివలననే ప్రభుత్వ మేదియు నిర్ధారణ చేయ లేకుండెను.

“భార్యాభర్తలను ప్రత్యేకింప నీకేమి యధికారము గల”దని యొకవైదిక శాసనసభ్యుఁ డడిగెను. ‘పూర్వాచారమును నిరోధించుటకు నీ వెవఁడ’వని మఱొకసభ్యుఁడు ప్రశ్నించెను. “ఆంగ్లేయులు ప్రతివిషయమందును భారతీయుల కడ్డు దగులుచున్నా”రని మఱొకసభ్యుఁ డతికోపముతో లేచి దుముకుచున్నాఁడు. భారతశాసనసభా చర్చలను చూచినచో భారతీయుల మనఃస్థితి చక్కఁగఁ దెలియనగును.

బాలికలకు 14 సం॥ములకు పిదపనే వివాహముచేయఁబడవలెనని యొక శాసనమును జేయఁగోరి జనులందఱ ప్రతినిధి యగు రాయిబహదరు, బక్షీసోగన్లాల్ గారు శాసనమును ప్రవేశపెట్టుచు భారత శాసన సభలో నీక్రిందివిధముగ మాటాడిరి. “మనదేశమున బాలికలు చిన్నతనముననే వృద్ధురాండ్రగుటకును, వాండ్రకుఁ గలుగు సంతానము బలయుతము కాకపోవుటకును బాల్యవివాహమే కారణము. బాలికలకు యుక్తవయస్సు రాకపూర్వమే కలుగు సంతానమువలన దేశమునకెట్టి లాభమును గలుగుటలేదు. మీఁదు మిక్కిలియట్టిసంతానము బ్రదుకుటయే దుర్లభ మగుచున్నది. ఒకవేళ బ్రదికియుండినను ఎల్లప్పుడును రోగపీడిత మగుచున్నది. అట్టి సంతానమువలన దేశమున కేమియు లాభము గలుగుటలేదు. కనుక దీర్ఘాలోచనఁజేసి బాల్యవివాహములను రద్దుచేయవలెను. మఱియు బాలికల అకాలమరణములకును బాల్యవివాహములే కారణము అగుటచే దీనిని త్వరలో రద్దుచేయుట భారతీయులకు క్షేమకరము”



ఈశాసనమును ఖండించుచు చెన్నపురి ప్రతినిధి యగు ది॥ బ॥ రంగాచారిగారిట్లు మాటాడిరి. “మనదేశపు శీతోష్ణపరిస్థితులను గమనించినచో మనపూర్వుల యాచారము సుప్రసిద్ధమైనది. దానిని ఖండించి మన మిట్టిశాసనమును దెచ్చుట క్షేమకరము కాఁజాలదు. శాసనమును జేయుట సుకరమేకాని ఆచరణకుఁ దెచ్చుట చాల దుష్కరము. అన్నిటిని జక్కఁగ నాలోచించి శాసనమును జేయుట యావశ్యకము”

మఱికొందఱు సభ్యులు ఈశాసనమును ఖండించి మాటాడిరి. అందు బ్రాహ్మణులే యెక్కువగనుండిరి. ఇట్లు ఖండింపఁబడిన శాసనము అంగీకరింపఁబడలేదు. అందఱిచేతను నిరాకరింపఁబడి త్రోసివేయఁబడెను.

పిదప 1925 సం॥ము ప్రభుత్వప్రతినిధి యగు మడ్డిమెన్ గారిచే బాలికలకు 13 వయసునకు పైఁబడియు 14 లోపుగను వివాహ మాచరింపఁబడవలెనని యొక శాసనము ప్రవేశపెట్టఁబడి యంగీకరింపఁబడెను గాని వైదికులవాదము విరోధముగ నుండుటచే శాసన మంగీకరింపఁబడినను ప్రయోజనశూన్య మగుటయేకాక దేశమున కలహములుకూడ బయలుదేఱును.

అపుడు అజ్మీరుప్రతినిధియగు రా॥ సా॥ హరవిలాసశారదాగారు ఈక్రిందివిధముగ మాటాడిరి. “బాలికలకు ఆచారముపేరున 9, 10 వయసుననే వివాహమును జేసి వారితో సంభోగించుటకంటె నీచకార్యము మ రేముండును” అని నుడు

వఁగా వైదికశిఖామణియగు మదనమోహనమాలవ్యగారీక్రిందివిధముగ నుడివిరి. "ఇపుడు 12 సం॥ ములకే బాలికలకు వివాహమును జేయుచున్నా మనుట నిజమే కాని యిపుడు మన మీశాసనము నామోదించినచో నిదివఱకు జరిగినవివాహముల నేమి చేయుదుము? ఇపుడు దీని నామోదింపకున్నచో కాలక్రమమున సంస్కరింపఁబడఁగలదు. సామాన్యముగ బాల్యవివాహము విద్యలేని గ్రామములలోనే యున్నది. అందఱును విద్యావంతు లగుచో నది మాఱిపోవును."

భరద్వాజ్ వాసియగు అమరనాథదత్తుగారీక్రిందివిధముగ మాటాడిరి. "మనము గ్రామవాసుల నిందించుటవలన ప్రయోజనము లేదు. ఇప్పటికే గ్రామములందు లెక్కలేనన్ని కక్షప్రతికక్షులును, అంతఃకలహములును గలవు. ఇపుడు ఇది శాసనమైనచో పోలీసులకు మితిమీఱినపని యేర్పడఁగలదు. వంగవాసినగు నాకు ప్రజలమనోభీష్టములు తెలియును గాన నీశాసనము నుపసంహరించుకొనుట మేలు."

వైదికశిరోమణియగు ఎమ్. కే. ఆచార్యగారిట్లు నుడివిరి. "మన కీశాసనముతోఁ బనిలేదు. పూర్వాచార మటులే యుండిన చాలును. మనకొక యాటసామానువలె శాసనసభ లేర్పడినవి. అంతియకాని వీనివలన మనకుఁగాని దేశమునకుఁగాని యెట్టి ప్రయోజనమును లేదు"

---

## పంచమాధ్యాయము.

### దేవదాసీలు

పూర్వాధ్యాయమున కొందఱియభిప్రాయముల నెఱుకపఱిచితిని. మఱికొందఱి యభిప్రాయములుగూడ నిందు వివరించెదను. పశ్చిమోత్తరపరగణాల ప్రతినిధియగు నవాబ్ సర్ అబ్దుల్ కయూంగారిట్లు నుడివిరి.

"నాకింతకంటెను బాలికలవయసును హెచ్చించుట సంతోషమే యగును. మాప్రదేశమున నిపుడు 16 వత్సరముల బాలికలకే వివాహము జరుగును కాని ఈశాసనము ఒకకష్టమును దెచ్చిపెట్టును. శాసనము నతిక్రమించినవారిని శిక్షించువా రెవరు? వారిపై వ్యాజ్యెము దెచ్చువా రెవరు? విచారించి తీర్పు చెప్పువా రెవరు? ఒకవేళ ఇవన్నియు కుదిరినను దంపతులను శిక్షకు పాల్చేసినచో వారలస్థితి దుర్భరమగును. వ్యభిచార మెక్కువగును. పూర్వమునుండియు ఆచారముగనుండ నిపుడు దానిని నిలుపుచేయుట దుస్సాధమగును"

భారతీయులయభిప్రాయ మిటులే సర్వసాధారణముగనున్నది.

### బాల్యవివాహము

"బ్రాహ్మణజాతిలోనేగాక బ్రాహ్మణేతర జాతులయందును ఈబాల్యవివాహము మితిమీఱియున్నది. దీని నిపు డకస్మాత్తుగ నాఁపుట దుస్సాధ్య"మని యొకబ్రాహ్మణప్రముఖుఁడు నుడివెను. "దీనికి జనసామాన్యమునం దాందోళన కలుగవ

లెను. అది కలిగినచో త్రుటికాలములో నీయాచారము మాఱఁగలదు'' అని మఱియొక ప్రముఖుఁడు నుడివెను.

ప్రభుత్వమువారి జననమరణములరిపోర్టులో నిట్లు వ్రాసియున్నారు. ''భారత రాజకీయవాదు లేదో సంస్కరించినట్లు పలికెదరు. కాని బాల్యవివాహము మితిమీఱుచున్నది. బాలిక పక్వదశను బొందకపూర్వమే సంభోగమునకు లోఁబడుటచే నామెశరీరము పాడగుటయకాక ఆమెకుఁగలుగు సంతానమును మృతప్రాయమై యుండి అల్పాయువుగనే మరణించుచున్నది.''

సర్దార్ హీరాసింగు బిరార్‌గారు శిశుమరణములగుఱించి యుపన్యసించుచు ''మన దేశమున శిశుమరణ మధికమగుటకు బాల్యవివాహమే కారణము. పరిపక్వమును జెందని పసికూనలతో సంభోగించుటచే వారలు గర్భవతు లగుచున్నారు. పరిపక్వమును జెందనివారికిఁ గలుగుసంతానము బ్రదుకునా? బాల్యవివాహములు నశించినంగాని దేశమునకు మోక్షము చేకూర నేరదు. అప్పటికిఁగాని దృఢగాత్రులును, మేధాసంపన్నులును కలుగఁజాలరు'' అని తీవ్రముగ మాటాడిరి.

వ్యభిచారము

ఇదివఱకు బాల్యవివాహములను గుఱించి నుడివియుంటిని. భారత దేశమున మఱొకవిశేషము గలదు. అదేదన వ్యభిచారమున కని యొకజాతి ప్రత్యేకముగ నున్నది. ఇది



చెన్నరాష్ట్రమునను మఱికొన్ని స్థలములయందును దేవతలను తృప్తిని బొందించుటకై తమకుఁ గలుగు సంతానములలో నొక స్త్రీప్రజను దేవాలయమునకని వదలిపెట్టుదురు. ఇట్లు వదలఁబడిన బాలికకు నృత్యమును, సంగీతమును నేర్పెదరు. ఆ బాలికకు 5 సంవత్సరములు నిండకపూర్వమే దేవాలయమందలి అర్చకుఁ డాబాలికతో వ్యభిచరించును.

ఇట్లు క్రమముగ నామె యుక్తవయసును బొందినతోడనే దేవాలయ పూజాసమయములయందు నాట్య మాడవలయును. ఇదియే యామెకుఁగలవృత్తి. ఇట్టివారలు దేవాలయము చుట్టునుగల వీథులయందే నివసింతురు. దేవునిదర్శనార్థ మరుదెంచు పురుషులతో వ్యభిచరించి ఉదరపోషణను జేసికొనుటయే వీరిక్రియ. దేవునినగలను వీరే ధరింతురు. ఇట్లు తమ ఆయుఃకాలమునంతను వ్యభిచారమునందే కడపి వృద్ధలైన తరువాత వాంఛను కోరువా రుండకపోవుటచే పిదప భిక్షమెత్తియే జీవించవలసిన స్థితి యేర్పడుచున్నది. దేవాలయ సేవకత్వమును చేయలేని స్థితియందు అర్చకు లేదో కొంత ధనమిచ్చి యింటి కంపివేయుదురు. వీరలస్థితి భగవంతునికే యెఱుక. వీరి తలిదండ్రులును దేవాలయమునకు దత్తముచేసిన పిదప వీరిస్థితిని గమనింపరు. ఇటులు దత్తము చేయఁబడినవారలే యొక తెగ యగుదురు. వీరలకు దేవదాసీలని పేరు. వీరలకుఁ గలుగు పిల్లలును ఈవృత్తియందే జీవింతురు. వీరలను వివాహమాడుట కెవ్వరు నొప్పుకొనరు.

ఇట ప్రభుత్వమెటు లీదుర్నీతిని సహించియున్న దని

యొక ప్రశ్న గలుగవచ్చును. ఈయాచారము భారతదేశ
మున చాల పురాతనముగ వచ్చుచున్న దని నుడువుటయే
పై ప్రశ్నకు సమాధానమగును. అయినను ప్రభుత్వము దీనిని
కొంచెము గమనించుచుండుటచేతనే కొంత తగ్గినదని కూడ
చెప్పవచ్చును. కాని సంపూర్ణముగ నీయాచారమును నిర్మూ
లించుటకు చాలకాలము పట్టును.

పై శాసనము చర్చ జరిగిన కొంతకాలమునకు భారత
శాసనసభలో స్త్రీగర్భాధానవయోనిర్ణయశాసనము చర్చకుఁ
దేఁబడెను. అవుడు దీ. బ. రంగాచారిగా రిట్లు ఖండించుచు
మాటలాడిరి.

"ఇట్టి నిబంధనల మనము స్త్రీలకు విధింతుమేని దేవ
దాసీల కిది చాల కష్టములను గలిగించినవార మగుదుము.
దేవదాసీల నెవరును వివాహమాడరు. కాన వారల బాలిక
లను ఏజమీందారునకో లేక యేధనికునకో అంటఁగట్టెదరు.
వయసును నిర్ణయింతుమేని యాబాలికల నెవరును వరింపరు.
దానిచే వారల పోషణ చాల కష్టమగును" అని ఖండించిరి.

కాని యిది సమంజస మెంతమాత్రము గాఁజాలదు.
ఒక శతాబ్దికి పూర్వ మీవాదము సమంజసమై యుండ
నోపు. భారతీయులు ప్రతివిషయమునకును మతమును కార
ణముగఁ జెప్పెదురు. మతము పేరిట అనేక దుర్నీతులఁ జేయు
చున్నారు. ఎట్టి శాసనమును జేసినను క్రియారూపమును
దాల్చుట మాత్ర మసాధ్యమే."

---

## షష్ఠాధ్యాయము

### ఘోషా ఆసుపత్రి

బాల్యవివాహముయొక్క స్థితిగతులను గ్రహింపవలెన
నిన ఘోషాఆసుపత్రులకు వెడలి చూచినచో స్పష్టపడఁగలదు.
పాంచాలము మొదలు మద్రాసువఱకునుగల ఘోషాఆసుపత్రు
లనన్నిటిని దిలకించితిని. పురుషుల కిది సాధ్యము కానేరదు.
ఘోషాఆసుపత్రి స్త్రీలకని ప్రత్యేకించుటచే పురుషులకు ప్రవే
శము దొరకుట దుర్లభము. పురుష డాక్టరులుగూడ నచటికి
జన వీలులేదు.

హిందూదేశమునఁగల యొకచిన్న ఘోషా ఆసుపత్రికి
నేను వెడలియుంటిని. అటకు స్త్రీలు వైద్యచికిత్సకై బహుళ
సంఖ్యాకలుగ వచ్చెదరు. హైందవులును మహమ్మదీయు
లును ఘోషాలుగనే ముసుఁగుతో వచ్చెదరు. వీరిభర్తలు
సర్కారుద్యోగులుగ నున్నారు. ధనవంతులు పేదలు అందఱు
అటకు వచ్చెదరు. వారలజీవితమే వ్యర్థమని వారలకుఁ దోఁచి
నట్లు వారలముఖములే స్పష్టపఱచును అంతటిబాధకులోనై
యున్నారు.

### మేహరోగిణులు

ప్రతియొకగదియందును రోగిణులు నిండియున్నారు. ఒక
వైపున పర్వతప్రదేశవాసినులగు స్త్రీలును, బ్రాహ్మణయువతు
లును, పార్సీ, మహమ్మదీయ ఇది యది యననేల సకలమత
ములబాలికలు నున్నారు. ముఖము తేజోవిహీనమై శరీరము

వాడి లేచుటకైనను శక్తిలేక మూల్గుచు పడియున్నాడు. నాకు చాల పరితాపము కలిగెను.

అచట రోగిణులుగ నున్నవా రందఱును సంతానవతులగుటకై చికిత్సకు వచ్చినవారే. భారతీయులలో స్త్రీలు సంతానవతులు కానిచో తమభర్తలకు ప్రేమపాత్రులు కాంజాలరు. మఱియు తోడిస్త్రీలు హేళనచేయుదురు. దానిచే చాల భాగము సంతానేచ్ఛచే వచ్చినవారే. కాని అట్లు వచ్చినవారికి చికిత్సవలన సంతానము గలుగునుగాని యాశిశువు జీవించక మరణించును. కొందఱికి మరణించినశిశువులే జన్మించుటగలదు. వీనికన్నిటికిని, మేహసంబంధమయిన జాడ్యమే కారణ మగుచున్నది. ఈవ్యాధి గర్భాశయమును నశింపఁజేయుచున్నది. అచ్చటి లేడీడాక్టరు 100 కి 90 స్త్రీల కీవ్యాధి గలదని యెఱింగించెను. ఆమెతో నాసుపత్రి యంతయు తిరిగితిని. ఒకచో నొకస్త్రీ కానుపించెను. ఆమెను సమీపించితిని. తన కనేకులుబిడ్డలు కలిగినటులును, అందఱును కడుపునఁ జచ్చియే పుట్టినవా రనియు నీమాఱుప్రసవమున కాసుపత్రికి వచ్చితి ననియు నామె చెప్పెను.

ఆమెప్రక్కనుగల మఱియొక బాలికనుగుఱించి వైద్యురాలిని ప్రశ్నించితిని. ఆమె యొకపెద్దయుద్యోగిభార్య యనియు, నామె కింతకుక్రితము గలిగినప్రసవమున శిశువు మరణించియే కలిగె ననియు దానిచే నామెభర్త ప్రసవమున కిటకుఁ దెచ్చె ననియు, ఈమాఱును జంటశిశువులు మరణించియే కలిగి రనియు, ఇఁక నామెకు గర్భమే నిలువ దనియు నాకు



నెఱింగించెను. ఆమెవయ సేమని ప్రశ్నింప 13 దాఁటె నని బదులిడెను. ఆమెభర్త పురుషుఁడా—మృగమా?

అక్కడనే సమీపమున మఱొకబాలిక పరుండియుండెను. ఆమెను జూచినతోడనే నా కొకవిచారము గలిగెను. దానినిగుఱించి లేడీ డాక్టరును ప్రశ్నించితిని.

"ఈబాలిక ప్రారంభవిద్యాశాలయందు చదువుచుండెను. పాఠశాల మూసినవెంటనే యామెతలిదండ్రులు లామెను భర్తయింటికి పంపిరి. భర్తకు వయసు 50. వానిని చాల గొప్పవాఁడని పిల్లతలిదండ్రులు చెప్పెదరు. భర్తయింటికి పోయినతరువాత భర్త యేమిచేసియుండునో చెప్పుటకంటె ఊహించుట మేలు. బాలిక భర్తయింటికిఁ జేరినకొన్నిదినములకే వ్యాధిగ్రస్తురాలైనది. చాల జబ్బుగనున్నదని పిల్లసోదరి విని యీపె నిటకుఁ గొనివచ్చెను.

ఆసుపత్రికి వచ్చినప్పుడు శరీర మంతయు వ్రణమైయుండుటచే పడకయందే కొన్నిదినములు చికిత్స చేసితిమి. క్రమముగా ఆరోగ్యమును బొందుచున్నది. ఆమెకుఁగల భయమును తీరెను. ఇఁక "బాలిక కష్టపడుచుండఁగా భర్త భార్యను తనవశము వలె నని అత్తమామలమీఁద కోర్టులో దావా తెచ్చెను." అని యామె నా కెఱింగించెను. ఈబాలిక పెద్దకుటుంబమునకుఁ జేరినది. ఇట్టివి భారతదేశమున సర్వసాధారణమయ్యెను.

ఇది యిటు లుండ ఈఆసుపత్రికి 300 మైళ్లదూరములోఁగల యొకచోటికి నేను పోయియుండినకాలములో నాయా

రఁగల యొకబాలికకు చిఱుతప్రాయముననే వివాహము
చేసిరట. ఆమెకు10వయసు వచ్చునప్పటికే భర్త యింటికి
పంపఁబడెను. భర్త తనయిష్టముప్రకార మాబాలిక నడ
చుట లేదని నిందించుట, కొట్టుట మున్నగు దుష్కృత్యము
లను జేయుచుండెను. పాప మాపసికూన యేమి చేయును!
భర్త తుదకు విసిగి యొకదినమున తనభార్య నెత్తుకొనిపోయి
జనసంచారశూన్యమగు నొకయరణ్యమున వదలెను. ఆబా
లిక అట్లుచావవలసిన దేనా? దైవకృపవలన నొకపరిచారిక
యాసంగతులను జూచి తనయజమానురాలగు అయిరోపీయ
స్త్రీవద్దకు పోయి యెఱింగింపఁగా నామె వేగముగఁ జని
యామెను గొనివచ్చెను. ఇచ్చట చేరినతరువాత నామెశరీ
రము ఆరోగ్యముగలదై అందముగ నుండెను. అప్పటికి ఒక
సంవత్సరముగ నామె అయిరోపీయ స్త్రీవద్ద నున్నదట.
అపుడే నేను నామెను ప్రథమపర్యాయము చూచితిని.

ఇట్టివి హిందూదేశ మంతటను జూడవచ్చును. ఉత్తర
హిందూదేశమున నిట్టివి యరుదుగనే యుండును. బొంబాయి
ప్రాంతమునఁగల స్త్రీలు విద్యావతులే కాని చిఱుప్రాయము
ననే గర్భవతు లగుచున్నారు. ప్రథమప్రసవముతోనే బలహీ
న లగుచున్నారు. మరిమరిప్రసవించుటచే శిశువులును తల్లులు
ను బలహీను లయ్యెదరు. శిశువులు ఆరోగ్యముగ నుండక
సంవత్సరముననే మరణించుచున్నారు. సామాన్యముగ ఆసు
పత్రికి చికిత్సకు వచ్చువా రందఱును పాఠశాలలో విద్య
నభ్యసించుబాలికలే. వారలలో ననేకలకు మేహరోగము



గలదు. కొందఱు తలిదండ్రులతో నేను బాలికలవిషయమై
మాటాడితిని. కాని వారు యువకులకు మేహరోగము గలదని
యెఱింగియే తమపిల్లల నిచ్చి వివాహము చేయుదురని గ్రహిం
చితిని. దీనివిషయమై యెంత చెప్పినను వినరని లేడీడాక్టరు
నాతో చెప్పెను.

ఈవిషయమై చెన్నరాజధాని మిక్కిలి ప్రసిద్ధిని జెంది
నది. ఒక ఆంగ్లవైద్యురాలు నాతో నిట్లు నుడివెను. "భారత
స్త్రీలలో శరీరబలముగలవారిని జూచుట చాల అరుదు. అధి
కముగ సంభోగమునకు లోఁబడుటయే దుర్బల లగుటకు కార
ణము. పురుషులు నిర్దయులై స్త్రీలను పశుప్రాయులుగఁ జూ
తురు. పురుషులలో ననేకులకు మేహరోగము గలదు. దిన
మున కెంత తక్కువ యైనను మూఁడుసారులు స్త్రీపురుషులు
గూడుదురు. 33 సంవత్సరములకుపూర్వము వివాహవయసు
నుఎక్కువ చేయవలయునను శాసనము చర్చకు వచ్చినపుడు
మేము కొందఱము స్త్రీవైద్యులము మహజరు నొకదానిని
భారతప్రభుత్వమునకు పంపితిమి. మా అనుభవవిషయము
లగు కొన్నిటి నిట తెలియఁజేయుట యావశ్యక మగును.

9-వ వయసున వివాహితయైన బాలికకు మఱుదినమే
ఎడమకాలియెముక బెణికెను. గర్భాశయము తలక్రిందుల
య్యెను. లోపల వ్రణము.

10-సం॥ వయసు. నిలుచుటకును శక్తిలేదు. స్త్రీచిహ్న
మున వ్రణమై రక్తము కారుచుండెను.

9-సం వయసు. స్త్రీచిహ్నమున పుండు. వ్రణచికిత్స చేయుటకును వీలు లేదు. ఈమెగాక భర్తకు మరిద్దఱు భార్యలు గలరు. వారు జీవించియున్నారు. ఈమె విద్యావతి.

7-వ సం॥ వయసు:- ఈమె కామవిషయమున భర్త చేసిన బాధ కోర్వఁజాలక మరణించెను.

10-వయసు:-ఆస్పత్రికి వచ్చునపుడు నడచుటకును శక్తి లేదు. వివాహిత యైనపిదప నామెకు లేచుటకైనను శక్తి లేదు.

ఇట్టివిషయము లనేకము లామహజరునందు వివరించితిమి. ఇది 1891 సం॥ జరిగినది. మరల 1922 సం॥ కూడ నట్టిశాసనము చర్చకు వచ్చెను. అపుడును మే మటులే చేసితిమి. 1891 కంటెఁగూడ నిపుడు బాల్యవివాహములు వృద్ధియయ్యెను.”

---

## సప్తమాధ్యాయము.

---

### శిశుహత్య

పూర్వాధ్యాయమున కొన్నివిషయముల వివరించియుంటిని. మఱికొన్నివిషయముల నిట వివరించెదను. భారతశాసనసభలో ప్రభుత్వమువారిచే ప్రవేశపెట్టఁబడిన వయఃపరిమాణశాసనమును ఖండించి వైదికులు కొందఱు మాటాడిన పిదప శాసనప్రేరకుఁడగు ప్రభుత్వసభ్యుఁ డిట్లు నుడివెను.



“అనేకు లీశాసనమువలన దేశమున నాందోళనము గలుగునని వారించిరి. ఆందోళన కలుగఁజేయుట నాకు సమ్మతము కాదు. కాని వేలతరబడిగల స్త్రీలను, శిశువులను గుఱించి వచ్చినపుడు ఆందోళన చేసియేతీరవలెను. ఆందోళనను జేయుటచే మంచిఫలితము గలుగఁగలదు.”

మహాత్మగాంధిగారు యంగుయిండియాయందు బాల్యవివాహములను గుఱించి యిటులు వ్రాసిరి. “ఘనదేశ మోక్షము యువకులు యువతులపైననే కలదు. దేశములోని యువకులు యువతులు బాల్యవివాహములచే తమ శరీరబలమును బోఁగొట్టుకొనుచున్నారు. వారలకుఁ గలుగు సంతానమును నిర్వీర్యమైయున్నది. దీర్ఘాయువుగను నుండుట లేదు. శిశుమరణసంఖ్య పెరుగుచున్నది. హిందూసంఘము ధైర్యవిహీనమై పాడగుచున్నది.”

మహాత్మునకుఁ బ్రత్యుత్తరముగ నొకప్రముఖుఁ డిట్లు వ్రాసెను. “తమ బాల్యవివాహఖండనమును చదివితిని. బాల్యవివాహము నాదరించువారియందు సద్గుణములు లేవనుట సరికాదు. బాల్యవివాహము లోకశాఖలోనేకాక ప్రతిశాఖలోను ప్రతిజాతిలోను నున్నవి. బాల్యవివాహములచేతనే స్త్రీలు శిశువులు బలహీను లగుచున్నారనుట సరిగాదు. ఇపుడు స్త్రీలవివాహవయసు ఎక్కువగుచునే యున్నది. భారతీయులు సహజముగనే బలమును గోల్పోవుచున్నారు. ఏఁబది లేక నూఱువత్సరములకు పూర్వముండినవారికిని నేఁటివారికిని దృఢత్వమునందు చాల తేడా యున్నది. ఇప్పటికంటె నప్పుడు

బాల్యవివాహము లెక్కువగ నుండెను. హైందవులు బలహీనులగుటకు బాల్యవివాహములు కారణము కాఁజాలవు.''

మహాత్మునికి వంగదేశనివాసిని యగు నొక స్త్రీయిట్లు వ్రాసెను. ''తమవ్యాసము చాల సమంజసముగ నున్నది. బాల్యవివాహములను రద్దుచేయుటకు తాము చేయుచున్న సేవ మిక్కిలి కొనియాడఁదగినదే. స్త్రీలు స్వాతంత్ర్యము లేనివారగుటచే నోరెత్తి మాటాడలేకున్నారు.''

తప్పెవరిది?

పైని వ్రాయఁబడినజాబునకు మహాత్ముఁడిట్లు వ్రాసెను.

''వృద్ధు లనేకులు విద్యావంతులై యుండియుఁగూడ చిన్న బాలికలను వివాహ మాడెదరు. నాకు తెలిసిన యొక 60 ఏండ్ల వృద్ధుఁడు విద్యావంతుఁడు తొమ్మిదేండ్ల బాలికను వివాహమాడెను. ఇంతకంటె నీచమైనపని మఱేముండును? విద్యావంతులే యిట్లు చేసిన సామాన్యులగతి యేమి? ఆంగ్ల విద్యావతుల్గు స్త్రీలనేకలు రాజకీయములయందు పాల్గొని కీర్తిప్రతాపములకై దీర్ఘోపన్యాసములఁ గావించుచున్నారు గాని బాల్యవివాహములను బాప ప్రయత్నించుట లేదు. రాజకీయములకంటెను నిట్టి విషయములయందు పాల్గొనుటయే యావశ్యక మగును. కాని యన్నిటికిని పురుషుల నిందించుట వలన ప్రయోజనము లేదు. విద్యావతులగువారు వోటుస్వాతంత్ర్యము కావలయునని యఱచెదరు గాని బాల్యవివాహములచేఁ గుందుచున్న తమ సోదరీజనులను బాగుచేయ ప్రయత్నించుటలేదు. స్త్రీలు వోటుకై పోరాడఁగూడదని నే ననుట లేదు. బాల్యవివాహములు సంపూర్ణముగ పోవువఱకును విద్యావతులగు స్త్రీలు పాటుపడుట ముఖ్యము.''



మహాత్ముని యభిప్రాయము చాల శ్లాఘనీయమైనది. దీనిని కాదనువా రుండరు. హిందూదేశముయొక్క యొకభాగమగు కైబర్ అనుస్థలమున నొకరస్తా గలదు. దాని యిరుపార్శ్వములయందు కుగ్రామములు గలవు. అందున్నవారలకు దొంగతనము చేయుటయే వృత్తి, తగవులాడుటయం దత్యంతము ప్రీతి. మఱియు ఒకముస్లింసోదరునకు హైందవుఁడు తగవులాటకు దొరకినచో వారి యానందము చెప్పఁదరముగాదు. అంతయు కొండప్రదేశము. భోజనపదార్థములు దొరకుట చాల అరుదు. కాన మనుష్యుని మనుష్యుఁడు చంపి తినుటకంటె వేఱుసాధనము లేదు.

ఈమార్గముగుండా ఆసియానుండి భారతదేశమునకు వ్యాపారులు రావలయును. ఒంటెలమీఁద సామానులు వేసికొని వ్యాపారులు బహుళ సంఖ్యాకులు కైబరు మార్గముగుండా అనుదినము ప్రయాణము చేయుదురు. రెండుమైళ్ల పొడుగున ఒంటెలునడచును. ఈమార్గమున ఆంగ్లసైనికులును భారతయోధులును రస్తాను కాపాడుచున్నారు. ఇది లేనిచో నెవఁడును ఈమార్గముగుండా ప్రయాణముచేయ సాధ్యపడదు. ఇంత సైనికరక్షణ యుండినను చోరులు సమయము చూచి దొమ్మిచేసి వస్తువుల నపహరింతురు. బ్రిటిషువారు రాక పూర్వము ఈమార్గమున పురుషుఁడు స్త్రీవేషముతో

వెడలవలయునే కాని పురుషుఁడుగనే వెడలినచో వానిప్రాణ
ములు నిలువనేరవు.

జాతి భ్రష్టమా

మేము దిగియుండినచోటినుండి రాజమందిరమునకుఁ
జనుటకు ఒకరోల్స్ రాయిస్ మోటారుబండి వచ్చెను. సంస్థా
నోద్యోగియగు నొకవైదికబ్రాహ్మణుఁడు ఐరోపీయదుస్తుల
ధరించి నన్నుఁ గొనిపోవుటకు వచ్చెను. ఆయన నా కన్నివిష
యములు నెఱింగించుట కొప్పుకొనెను.

"మీరు సామాన్యముగ బాలికల కెన్నియేండ్లకు
వివాహము చేసెద?" రని నేను ప్రశ్నించితిని.

"ఐదు, లేక ఏడు. అది దాఁటినచో 9 ఏండ్లకు బాలి
కకు వివాహము తప్పకచేయవలెను."

"అట్లు చేయకున్న నేమి సంభవించును?"

"అట్లు చేయనిచో నన్ను జాతిభ్రష్టుని చేయుదురు.
స్వజాతీయు లెవరును మాయింటికి భోజనమునకు రారు. మం
మ్మెవరును పిలువరు. మాయింట నెవరును సంబంధము చేయ
రు. దానిచే సంతతి లేకపోవును. మాయింట నెవరైనఁ జచ్చి
నచో ప్రేతమును శ్మశానమునకుఁ గొనిపోవుట కెవ్వరును
సాయము చేయరు. వయసువచ్చినను వివాహము చేయనిచో
నాబాలికను మహారణ్యమున వదలివేయవలెను. పిదప దాని
గతి యేమైనను మాకు విచారములేదు. ఇదియే యాచా
రము. స్వజాతీయు లెవరును ఆబాలికకు సాయము చేయరా



దు. ఇట్లు చేయనిచో స్వజాతీయులు నిందింతురు. నిందకు
పాత్రు లగుటకంటె నిదియే యుత్తమము.

సాధారణముగ భారతీయులలో స్త్రీసంతానము గలిగె
ననినఁ దలిదండ్రులకు సంతసములేదు. ఒకకుటుంబమున 4
లేక 5 స్త్రీ ప్రజలుండినచో నాబాలికలకు వివాహము చేయు
ట, సంబంధులకు కోపము రాకుండ నడచుకొనుట చాల దుర్ఘ
టమగుకార్యము. ఆగృహస్థునిగతి మహాఘోరమైనది. వాఁ
డెంతధనవంతుఁడైనను భిక్షాపాత్రమును తీసికొనవలసినవాఁడె
యగుచున్నాఁడు."

సర్ మైకేలు ఓడ్వ్యయరుగారు భరతపురిలో కమిషన
రుగ నుండినపుడు జరిగిన యొకవింత నిట్లు తెలుపుచున్నారు.

" మహారాజకుమారికను పాంచాలములోని యొక
సర్దారున కిచ్చి వివాహమును జేయించెను. రాజకుటుంబము
వారు 30000 పవునులనుండి 40000 వఱకు ఖర్చుచేయవల
యు ననిరి. మంత్రులును దాని కొప్పుకొనిరి. నేనును సం
స్థానపు ఏజంటును వివాహమున కింత ఖర్చుపెట్టుటకొప్పుకొన
మైతిమి. పిదప దీన్నిగుఱించి దర్బారులో ఆలోచింపఁబడెను.
నేను ఇదివఱకు సంస్థానపుబాలికలకు వివాహము జరిగినపు
డెంతఖర్చు పెట్టఁబడెనో లెక్క లుండినచో చూపుమంటిని.
వారు ఇదివఱ కేబాలికకును వివాహము జరుగలే దనిరి.
దానికి నేను పట్టుదలగ 200 సంవత్సరములుగ నున్న యీ
సంస్థానపురాజులకు స్త్రీప్రజలే పుట్టలేదా, లేక వారలకు
వివాహములు చేయలేదా యని యడిగితిని. దాని కొకవృద్ధుఁడు

నన్ను తేఱిపాఱఁజూచి "దొరగారు! మా దేశాచారము మీ కెఱింగియుండు రేని మీ రిట్లు అడిగియుండరు. ఎందఱో బాలికలు గల్గిరి. కాని వారలను హత్యచేయుట వాడుక" యని యాయన చెప్పెను." అని మైకలుగారు తమరిపోర్టులో వ్రాసియుండిరి.

శిశుహత్య పూర్వము గ్రీకులలోను, రోమనులలోను జరుగుచుండె నని ప్రతీతి. కాని భారతదేశమున తగిన శాసనము లుండినను శిశుహత్యలు నేఁటికిని జరుగుచున్న వని విని ఆశ్చర్యపడుట సహజము.

శిశుహత్యలనుగుఱించి వివరముగ ఋజువుచేయుట అసాధ్యము. పైని జెప్పినవిధమున మహారాజులలో జరుగుచుండిన దాని నెట్లు కనిపెట్టనగును?

మధ్యరాష్ట్రములో జనాభాసూపరెండెం టొకరు శిశుహత్యను గుఱించి యిటులు వ్రాసియున్నారు. "స్త్రీశిశువులుపుట్టినచో మనఃక్లేశము నేల చెందవలెనో నాకు బోధపడుటలేదు. బాలికరక్షణవిషయమున తలిదండ్రు లంతగ శ్రద్ధవూనుట లేదు. "బాలుని తండ్రియు, బాలికను భగవంతుఁడును రక్షించు" నని సామెత చెప్పుదురు. బాలికకు సరియగు నాహారమును, వస్త్రమును నిచ్చుటలేదు. దీనికంతకు బాలుని ప్రేమించినట్లు బాలికను ప్రేమించకపోవుటయే కారణము. వీనిచే బాలికల మరణము బాలురకంటె నాలుగురెట్లెక్కువగ నున్నది. ఇ దెంతపరితాపము! స్త్రీప్రజ యనఁగనే దానిప్రాణ మంతచులుకన గాఁబోలు!"

## అష్టమాధ్యాయము

---

అత్తయార్భాటము–కోడలి ప్రలాపము.

హైందవయువతి తనపెనిమిటియింటికి 9, లేక 10 వయసున కాఁపురమున కేఁగుచున్నది. అంతకు పూర్వము విద్యాభ్యాసమునకుఁ దగిన బుద్ధిబలము లేకున్నది. కాఁపురమేఁగినతర్వాత బుద్ధివికాసమున్నను విద్యాభ్యాసమునకు కాలము లేదు. ఆమెవిద్యాభ్యాసమున శ్రద్ధను జూపువారు లేకున్నారు. కాని యామె కాఁపురము పైకొనినతర్వాత రెండు విషయములను గ్రహించుచున్నది. 1. భర్తకుఁ దాఁ జేయవలసిన సేవ. పోలేరమ్మ, గంగమ్మ మున్నగు తనకులదేవతల నారాధించువిషయము రెండవది.

భార్య భర్తకుఁ జేయవలసిన సేవనుగుఱించి పద్మపురాణమున నీవిధముగ వివరింపఁబడెను. "భర్తకంటెను భార్యకు దైవము లేదు. భర్త చెప్పినకార్యమును శిరసావహించి యడ్డుచెప్పక చేయుటయే భార్యవిధి.

భర్త కుంటివాఁడు, గ్రుడ్డివాఁడు, మూగవాఁడు, చెవిటివాఁడు, వృద్ధుఁడు, బలహీనుఁడు, వ్యాధిపీడితుఁడు, వ్యభిచారి, దుష్టుఁడు, ఎట్టివాఁడైననుసరే వాని నన్నిటిని గమనింపక వాఁడే తనకు దైవ మని మది నెంచి సేవసేయవలయును. అట్టిపురుషునిమనసును రంజింపఁజేసి వానితో సుఖించుటయే యామెవిధి.

భర్త భుజించినపిదపనే భార్య భుజింపవలెను. వాఁడు భుజింపనిచో భార్య భుజింపరాదు. వానికి సంభవించినకష్టము తనదిగ భావించితీరవలెను. వాఁడు మరణించినచో వానితో సహగమనము చేయవలెను.

భార్య గృహమునందు కల్లోలము కలిగింపరాదు. వ్యభిచారము చేసినచో భర్తయెడ సత్సృప్తిని బొందరాదు. గృహకల్లోలమును భరింపక పాఱిపోయినచో నామెను లోకులు నిందింతురు. భర్త భార్య నెంత హింసించినను సహించి మాఱు పలుకకుండవలెను. అవి యివి యన నేల? అన్ని విధముల భర్తను దైవముతో సమానముగ భావింపవలెను.''

తొమ్మిదియవ శతాబ్దిలో హిందూమతము భారత దేశమున నేస్థితిలో నున్నదియు శ్రీ అపిటూభాయిగా రిట్లు వ్రాసియుండిరి.

''హిందూమతమును జేరిన భార్యాభర్త లొండొరులు ప్రేమించుటలేదు. భార్య భర్తకు లోఁబడియే యుండవలె నని చెప్పుదురు కాని భార్యను భర్త గౌరవముగ నాదరించుట లేదు. భర్తకు సుఖము నిచ్చుటయును, లోఁబడి పనిచేయుటయు నే భార్యకు అవశ్యకర్తవ్యము.''

దీనిని గుఱించి రవీంద్రకవి యిట్లు నుడివి యుండెను. ''ఒక స్త్రీయు, పురుషుఁడును వివాహము చేసికొనవలయు ననిన నొకరినొకరు ప్రేమించవలయును. వివాహమగుటకుపూర్వమే యొకరినొకరు అంతరంగికముగ ప్రేమించియుండవలయును.



హిందూమతమున నిట్టిది లేకున్నది. బాలికలకు వివాహము ముగిసినప్పటినుండియు భర్తను దైవముగ భావించుచున్నది. భర్తకు లొంగియుండి సేవఁజేయుటయే తనవిధి యనిభావించి యటులే నడచుకొనుచున్నది.''

''పురాతనాగతమగు దుష్టాచారమును, మూఢవిశ్వాసమును గలిగి హైందవులు, చదువు సంధ్యలు లేనివాఁడైనను, వానిని వివాహమాడినభార్య యెంత చదువరి యైనను వానికి లొంగి యుండి సేవ చేయవలయునని భావింతురు. వాఁడెంత బాధించినను ఓర్చి యుండవలయును. వాఁడు భార్య తనకు బానిస యనియే భావించుచున్నాఁడు. వీనికి కారణము మూఢవిశ్వాసమే. అది తొలఁగవలెను'' అని గాంధిగారు మిక్కిలిఖండించియున్నారు. కాని యుగ యుగములుగ వచ్చు దురాచారము ఒకటి రెండు శతాబ్దులలో మాఱు ననుట నమ్మ వీలులేదు.

భారతీయుల వైదికశాసనము, అత్తయొద్దను కోడలు నడుచుకొనవలసిన విధులనుగూడ శాసించుచున్నది. ఒక బాలిక వివాహితయై కాఁపురమునకు వెడలునేని యామె యత్త తనకోడలిని పనికత్తెగ భావించును. అత్తచెప్పిన కార్యమును కోడలు చేసియే తీరవలయును. అత్త, తోడి కోడలు, ఆఁడుబిడ్డ వీరు చెప్పు కార్యమును అడ్డు చెప్పక చేయవలయును. కోడలి కెంతమాత్రము స్వతంత్రత లేదు. అత్తగాని, భర్త కాని యామె కెంతమాత్రము స్వేచ్ఛ నియ్యకపోవుట యటుండ స్వేచ్ఛ యనునదే యామె యెఱుఁగదు. భర్త

అత్త మున్నగువారికి సేవచేయుటే తన విధియని వివాహమయినది మొదలు భావించు స్త్రీకి స్వాతంత్ర్యమెట్లు తెలియఁగలదు? అత్త కోడలివిషయమున నించుకేని కనికరమును జూపుటలేదు. కోడలిని బాధించుటే విధి యని యామె భావించును. మఱియు కోడలు సంతానవతి కానిచో నామె యవస్థ భగవంతునికే యెఱుక. మఱియు సంతానవతియై యుండి కలిగినదంతయు స్త్రీప్రజ యైనచో నామెపడవలసినబాధ కంతుండదు. అత్తకు కోడలిని దూఱుటకంటె వేఱుపని యుండదు. కోడలిని కొట్టి బాధించుటకును వెనుదీయదు. కోడలిని వెలిచేసి మఱొక వివాహము తనకొమారునకు చేయింతు నని బెదరించును.

నేను గ్రామసంచారము చేసినపుడు అత్తల దౌష్ట్యములచే నెందఱో ఆఁడుబిడ్డలు ఆత్మహత్యలను జేసికొని రని వింటిని. హిందూమతములోని భార్యాభర్తల స్థితిని గుఱించి శ్రీమతి కార్నిలియాసొరాబ్జీ యిట్లు నుడివెను.

"భర్తసేవయే భార్యకు ముఖ్యవిధి. అత్తయొద్ద భయభక్తులతో మెలఁగవలెను. అత్తసంతోషముకొఱకు తాను బిడ్డలఁ గనవలెను. అత్త, భర్తలయెదుట తలయెత్తి తిరుగరాదు. సంతానవతియైననే సంఘమున గౌరవింతురు."

ఢిల్లికి సమీపమునఁగల యొక గ్రామమున మిరాసీదారొకఁడు తనభార్య గర్భవతియై యుండ ప్రసవమున కాసుపత్రికిఁ బంపెను. అపుడు ఆమె మరణించిన శిశువును గనెను. రెండవగర్భమునకును నటులే సంభవించెను. మూఁడవ ప్రసవమున సజీవముతోనున్న శిశువును గనెను. అప్పుడు శిశువు జన్మించినసంగతి నామె కెఱుక చేసిరి. బ్రతికిన శిశువునే కంటినా యని యామె ప్రశ్నించెను. అపుడా దంపతులును బంధువర్గమును ఆనందభరితులై యుత్సవము జరిపిరి.

సామాన్యముగ హైందవులు బిడ్డలను అత్యాదరముతోఁ జూతురు. కాని యింత ప్రేమగలిగి యుండియు తగిన విద్యబోధించుటలేదు. కాని చిన్న ప్రాయమునుండియే మూఢవిశ్వాసమును గఱపెదరు. ప్రపంచజ్ఞానము, సన్మార్గవర్తనము వీనిని బోధించుటలేదు. కాన తలిదండ్రు లెట్లు జీవితమును గడపెదరో అటులే తానును గడపవలయు ననుకోరికి వారికి కలుగుచున్నది. బాలికయైనచో వివాహిత యైనపిదప తాను భర్తకుఁ జేయవలసిన సేవను బోధించెదరు. ఆమె కాలక్రమమున పుత్రుని గని వానికి వివాహముం జేసి కోడ లింటికి వచ్చిన తా నత్తస్థాన మాక్రమించి, ఆ బిడ్డను హింసించుచున్నది. హిందూసంఘ మీవిధముగ నడచుచున్నది.

---

## నవమాధ్యాయము

---

### హైందవవిధవ

హిందూబాలిక వివాహ మన నేమియో యెఱుఁగనిదైనను, కొన్నిదినములు భర్తతోఁ గాఁపురముఁ జేసినదైనను విధవయైనచో నామె కిఁక గతి వేఱొండు లేదు. తనజీవితము నంతయు దుఃఖముతోఁ గడపవలసినదే! శ్రీమతి సొరాబ్జీ

హిందూవిధవలనుగుఱించి యిట్లు నుడివెను. "హిందూసంఘమునకుఁ జెందిన యొకవిధవ పడుకష్టములకు మేరలేదు. జన్మాంతరపాపముచే నామె విధవయైన దని యామెబంధువులనెదరు. ఈబాలికను వివాహము చేయుటచేతనే తనకుమారుఁడు మరణించె నని భావించి యత్త చాల బాధపెట్టును. సకలవిధముల నామెకు కష్టములే సంభవించును."

ఒక స్త్రీ విధవయైనచో భర్తయింటియందుఁ గలవారామెను పనికత్తెగ భావింతురు, కఠినకార్యములనెల్ల నామెచేయవలెను. ఆమెసౌకర్యము నెవ్వరును గమనింపరు. ఒకపూఁట మాత్రమే భుజింపవలయును. శుభకార్యములయం దామె పాల్గొనఁగూడదు. ఆమె యింట నుండుటయే అపశకున మని భావింతురు. ఇంట నెవరికైనను జబ్బుచేసినచో సకలపరిచర్యలును ఆమెయే చేయవలెను.

విధవలవిషయమై మిక్కిలి పరితాపముగల కార్యములు జరుగుచుండును. భర్త మరణించినపిదప తమజీవితము వ్యర్థముగాను, ఉన్నవారిబాధల భరింపలేకయు గుడ్డలకు కిరసనునూనె పోసి యంటించుకొని మరణించెదరు, సహగమన దురాచారము ప్రబలుచుండఁగా 29 సం॥లకు పూర్వము బ్రిటిషుప్రభుత్వమువారు దాని నాఁపియుండిరి. రాజారామమోహనరాయలు దీనికై చాల పాటుపడియుండిరి. సహగమనము నాఁపరా దని వంగదేశమున చాలమంది ఖండించిరి. 1926 నవంబరునెల 11 తేది యంగుయిండియాలో హిందూప్రముఖుఁ డొకఁడు వ్రాయుచు "భర్త మరణించునపుడు



పునర్వివాహమున కనుమతి యిచ్చిననేకాని మరణించినవాని భార్య పునర్వివాహము చేసికొనరాదు, కాని మరణావస్థయందున్నవాఁ డెవఁడును పునర్వివాహమున కనుమతింపఁడు. తనయనంతర మామెకూడ మరణించిన బాగుగానుండు నను నేకాని యనుమతింపఁడు" అని వ్రాసెను.

భర్త మరణానంతరము భార్య భర్తగృహముననే యుండవచ్చును గాని భర్తబంధువులు చెప్పుకార్యములను తప్పక చేయుచుండవలెను. అట్లు చేయకున్నచో వారలు ఇంటినుండి యామెను త్రోలివేయవచ్చును. అట్లు త్రోలఁబడిన విధవకు, భిక్షమెత్తి బ్రతుకుటయో లేక వ్యభిచారమో తప్ప వేఱుమార్గము లేదు.

హైందవులలో బహుళసంఖ్యాకులు వైదికులు. వారు విధవావివాహము నొప్పుకొనుటలేదు. పాశ్చాత్యసంసర్గముచే నిపుడిపుడు కొందఱు విధవావివాహసంఘముల నేర్పఱిచిరి కాని యవి వృద్ధిఁజెందుటకు వైదికు లడ్డుదగులుచున్నారు. 60 వయసుగల ముదుసలి, బాలికను వివాహ మాడవచ్చును గాని యావృద్ధు మరణించినపిదప పాపము! ఆపెకు పునర్వివాహముకూడ దనుట యెంతటి యన్యాయమో యోజింపుఁడు.

ఇట్టి నిబంధనలకు లోఁబడిన విధవలగతి యేమగుచున్నదియు కొంచె మాలోచింతము. బాలికలు చిన్నప్పటినుండియే విషయలోలలగుచున్నారని యిదివఱకే వివరించియున్నాము. అట్టిబాలికలు విధవలైనచో పైనిబంధనల భరింపలేక దుర్మార్గ

గామినులగుచున్నారు. దీనినిగుఱించి లాలా లజపతిరాయిగారు:- "హిందూవిధవలస్థితి మిక్కిలి పరితాపకరమైనది. పునర్వివాహమునకు వైదికు లొప్పుకొనక పోవుటవే ననేకబాలవితంతువులు వ్యభిచారమునకు లోఁబడుచున్నారు. దీనిచే హిందూసంఘమే పాడగుచున్నది." అని నుడివియున్నారు.

"బాల్యవివాహమే బాలవితంతువులగుటకు ముఖ్యకారణము. బాల్యవివాహముచే ప్రతివత్సరమును లెక్కలేని వితంతువు లేర్పడుచున్నారు. దీనిచే హిందూమతమున కపాయము వాటిల్లుచున్నదే" అని గాంధిగారు నుడువుచున్నారు.

భారతీయుల బాల్యవివాహములను ఖండించుచును, వితంతూద్వాహముల నాదరించుచును, ప్రముఖు లుపన్యసింతురే కాని కార్యరూపమున ముందునకురారు. ఎప్పుడో యెచటనో ఒకటిరెండు వితంతూద్వాహములు జరిగినట్లు పత్రికలలోఁ గాంతుము గాని అధికముగ లేదనియే చెప్పవచ్చును. ఆంగ్ల విద్యావంతులే యిం దెక్కుడుగ పాల్గొనువారు. బరోడావాసి ముఖర్జీగారు "పునర్వివాహమును వైదికు లొప్పుకొనేవఱకు వివాహము జరుగుట చాల దుర్ఘటమే. బ్రాహ్మణుల ననుసరించి యితరవర్ణములవారును వితంతువివాహము కూడ దందురు. ఈభావము మాఱనిదీ వితంతువులకు మోక్షములేదు" అని నుడివియున్నారు.

పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుఁడు బాలవితంతువులకు వివాహముచేయుట శాస్త్రసమ్మతమని యాందోళన



బయలుదేరఁ దీసెను. దానిని గుఱించి యొక భారతీయప్రముఖుఁడు "పండితుని యాందోళన బయలుదేరిన వెంటనే వైదికులయందు కోపము ప్రజ్వలింపసాగెను. తనకోరిక నెఱవేఱకమునుపే యాయన గతించెను. 50 సం॥పూర్వ మెటులుండెనో నేఁటికిని అటులే యున్నది. కాని పండితుని జయంతి మాత్రము ప్రతివత్సరము జరిపి ప్రముఖు లుపన్యసించెదరు. కాని కార్యమున ముందంజ వేయరు" అని నుడివెను.

"బాలవితంతువులకు వివాహము చేయక వారి నణఁచి యుంచుట చాల అన్యాయము. కాని ఎంతటి వృద్ధుఁడైనను బాలికను వివాహ మాడవచ్చునుగాని వితంతువులకు వివాహము పనికిరాదు. దీని కెట్టి శాస్త్రాధారమును లేదు. దీనిచే మతము దినదినము క్షీణతఁ జెందుచున్నది" అని గాంధి నుడివెను.

"గాంధియభిప్రాయమును మే మొప్పము" అని యొక ప్రముఖుఁడు నుడివెను. లాహోరులో వితంతువులకు సాశ్రమపాఠశాల సర్ . గంగారాంగారిచే నేర్పఱుపఁబడియున్నది. 1926 లో 40 వితంతువు లిందు వసించియుండిరి. బొంబాయిలోను నిట్టిది గలదు. వంగదేశమున నవాదిప్ అనుస్థలమున ప్రజల సాయముచే నేర్పఱుపఁబడిన యొక సాశ్రమ పాఠశాల గలదు. భారతదేశమున 26, 834, 838 వితంతువులున్నారని ప్రభుత్వపు రిపోర్టు నుడువుచున్నది.

---

# దశమాధ్యాయము

## పుత్రసంతానము

ప్రసవమును గుఱించియు, ఆసుపత్రులను గుఱించియు నిదివఱకే వివరించి యుంటిమి. మఱికొన్ని విషయముల నిట వివరించెదము. ఒక స్త్రీ ప్రసవించినపుడామెను ఇంటఁగల స్త్రీలెవరును తాఁకఁగూడదట. ఆమెయున్న పురిటిగదివైపు కూడ పోఁగూడదట! పోయినచో అంటు తగులునట! హైందవులలో ననేకులకు స్త్రీల కెట్టివిద్యయు పనికిరా దనియు స్త్రీలు విద్యావతులైనచో భర్తలకు లొంగ రనియు భావము గలదు.

విద్యావతులు కాని కారణముచేతనే స్త్రీలు స్వతంత్రలు కాకున్నారు. బాల్యమునుండియు మూఢవిశ్వాసమును బోధింతురు. దీనిచేతనే స్త్రీలిట్లు ఉండుటకు కారణము. ప్రసవమపుడు అంటనుటయు నొక మూఢనమ్మకమేయగును. దానిచేతనే మంత్రసాని నెల్లప్పుడును పురిటిగదిలో నుండ నియమింతురు. ఆమంత్రసాని హైందవులచే నంటరాని యొక జాతిని చేరినదై యుండును. మంత్రసానిని నియమించుటలోను నొక వాడుక గలదు. ఆమె మరణించిన శిశువును కనియుండరాదు. వితంతువుగ నుండరాదు.

ఇఁక మంత్రసాని యేవైద్యశాలయందైనను చికిత్సావిధానమును నేర్వవలసినపని లేదు. ఏలన, మంత్రసానిజాతి యనియే యొకవర్గమున్నది. వారు తరతరములుగ నీవృత్తిని



చేయుచుండువారు. మంత్రసానిజాతివారు గాక మఱికొందఱు గూడ నీవృత్తి నాచరింతురు. ప్రసవవేదన యన నేమియో యెఱుఁగనివారును, బిడ్డనుగననివారును ఈవృత్తిని నడపుట మిక్కిలి వింతయే. ఇది యిటులుండ, ప్రసవవేదనపడు స్త్రీస్థితి యెటులుండు ననఁగ: వేదన ప్రారంభించినవెంటనే యాగర్భవతి గాలియు వెలుతురును లేనిగదికి పోవలెను. చాల దినములుగ మూలలో పడియున్న చింపిరి గుడ్డల నామె కట్టుకొనవలయును. ప్రసవమప్పుడామెకు, పడకగాని, పరిశుద్ధవస్త్రములు గాని యియ్యఁబడుటలేదు. ఆచీకటిగదియందే ఆమె కష్టపడవలెను. వేదన గలిగినవెంటనే మొదట మంత్రసానిని పిలుతురు. వెంటనే మంత్రసానియు ముఱికినిండిన చింపిరి. వస్త్రము గట్టుకొని వచ్చి గదిలో ప్రవేశించి తలుపు మూసికొనును. గవాక్షము లేవైన నున్న వానిని గూడమూసి వేయుదురు. గాలి ప్రవేశించిన నామె కనారోగ్యము గలుగునట. ఇఁక వెలుతురుకై యొకదీపమును బెట్టుకొందురు. ఆదీపముపొగ గదియంతయు చుట్టుకొనును. సువాసనకొఱకు సాంబ్రాణిధూపము వేయుదురు. అసలే గది చీకటిగది గాలియా లేదు. దానితో దీపపుపొగ సువాసనకైన ధూపము. ప్రసవవేదన పడుచున్న స్త్రీగతి యేమి కావలెను? మంత్రసానియో అతిసమర్థురాలు! వీనినిగుఱించియూహించుటమేలు.

మంత్రసాని యొకతె ఒకయింటియందు మంత్రసానితనము చేయుచుండఁగ నే నటకు వెళ్లితిని. పైన వివరింపఁబడినవిధముననే యాగది అంధకారబంధురమై యుండెను.

ఒకకుంపటియందు నిప్పు రగులుచుండ మంత్రసాని దుర్వాసనగల పొడిని ఆనిప్పునందు చల్లుచుండెను. ప్రసవించియున్న వారిని పరాయివా రెవరైన చూచిన దృష్టిసోఁకునట! దాని పరిహారముగ నీధూపము వేయుదురట. నిప్పునందు చల్లిన వెంటనే గదియంతయు పొగ క్రమ్ముకొనెను. మంటయు మండసాగెను. ఈమంటచే కొంత వెలుతు రేర్పడెను. ఆవెలుతురులో మురికియు, దుర్గంధమును నిండినవస్త్రమును గట్టుకొనియుండిన మంత్రసానిని జూచితిని. ఆమెప్రక్కను మూర్ఛవచ్చి పడియున్నదానివలె పరుండియున్నప్రసవస్త్రీని గంటిని. దానిని జూచి చాల భయమును జెందితిని.

గర్భవతి ప్రసవించుటకు ఆలస్యమైనయెడల మంత్రసాని తనమురికి, ఉంగరము గాజులునిండినచేతులను గర్భవతి గర్భాశయములోపలికి పోనిచ్చి తల, కాళ్లు తెలియక బలవంతముగ శిశువును లాగివేయును. ఇది తనచే సాధ్యముగాని యెడల ఇతరలను పిలుచుకొనివచ్చును. ఇట్లు గర్భవతులు ప్రసవవేదనతోఁబాటు మంత్రసానుల వేదనను గూడ భరింపలేక ప్రాణాపాయస్థితికి వచ్చుచున్నారు.

ఒకప్పుడు 4, 5 దినములుగూడ ప్రసవించక గర్భవతులు వేదనపడుదురు. అపుడు మంత్రసాని యాగర్భవతి కాహార మీయఁగూడదని ఆజ్ఞచేయును. అదియే సుగ్రీవాజ్ఞ. ప్రసవము కానియెడల మంత్రసానిచేయు చికిత్సను జూచిన మనకు భయము గలుగును. గర్భవతికడుపుపైని మంత్రసాని తనచేతులతో గ్రుద్దును. అది నిష్ప్రయోజనమైనయెడల



గర్భవతిని గోడ కానుకొను మని తనతలతో కడుపుపై మోఁదును. గర్భవతిని తలక్రిందుగఁజేసి కదలించును. వ్రాయ సాధ్యముగానిపనుల నెన్నిటినో చేయును. ప్రసవవేదన ననుభవించుచున్న యువతికి ప్రాణము పోవునట్లు చేయుదురు. మఱికొన్నిచోట్ల తేలును; పాముతోలును తెచ్చి భయపెట్టుదురు. ఇట్టి అనాగరకకార్యములం జేయుదురట.

ఇట్టిచికిత్సలచే మరల ప్రసవము గలుగకుండ గర్భకోశము తలక్రిందులుగాఁ జేయుదు రని ఆంగ్లవైద్యురాండ్రు నుడువుచున్నారు. ప్రసవించిన స్త్రీకి శరీరము చల్లఁబడినయెడల బూడిదతో శరీరమంతను మర్దనచేసి యుష్ణమునుగలిగించుటే మంత్రసాని చికిత్సయగును.

బొడ్డు త్రాడును కోయుట

కాశీనగరము భరతఖండమున పుణ్యక్షేత్ర మని పొగడ్త గన్నది. వైదికు లిందే అధికముగ వసించుచున్నారు. ఇటఁగల కుప్పతీయువారలు అస్పృశ్యులు. వీరిలో ఏడు తరగతులు. వీరిలో నుత్తములే మంత్రసానిజాతివారు. వారికి తక్కువవారే బొడ్డుతీగకోయువారు. వీరల కదేవృత్తి. ఎటనైనను ప్రసవ మేర్పడిన తనతోఁగూడ నీబొడ్డుకోయు జాతి స్త్రీని వెంటఁబెట్టుకొని మంత్రసాని పోవును. ఈవృత్తి మిక్కిలి నీచమైనదని భావించి దీని కస్పృశ్యుల నియమించి యున్నారట!

బొడ్డుకోయుటకు చిన్నటిన్ను రేకో లేక పగిలిపోయిన

అర్ధపుతునుకో వాడుదురు. బొడ్డుకోసినతర్వాత దాని కేమియును మందు పెట్టుటలేదు. పేఁడయో, లేక మట్టియో దానిపైని మంత్రసాని పెట్టును. శిశువు జనించినవెంటనే మంత్రసాని యొక్క చింపిరిపేలికయందు శిశువును పరుండఁబెట్టును. స్త్రీప్రజ యైనచో దానివిషయమున నించుక సంతుష్టితఱిగియేయుండును. శిశువు జనించినవెంటనే దానిమూత్రమును కొంచెము తీసి దానిలో చక్కెర కలిపి శిశువునకు త్రాగింతురట! ఇది మధ్యరాష్ట్రమునందు వాడుకగ నున్నది. ఎచ్చటను ప్రసవించిన స్త్రీ కెట్టియాహారము నిచ్చుటలేదు.

కొన్నిజాతులలో ప్రసవించిన మూఁడుదినములవఱకు బిడ్డలకుపాలిచ్చుట దురభ్యాసమేయగును. అందులోను భారతదేశమున బాల్యవివాహముచేచిఱుతప్రాయముననేవిషయేచ్ఛలయందు బాలికలు లగ్నలగుటచే బలహీన లగుచున్నారు. దానికిఁదోడు బిడ్డలు తల్లిపాలవలననే జీవింపవలయుననుట మిక్కిలి ఘాతుకము. దీనినిగుఱించి అమెరికాదేశపు సుప్రసిద్ధవైద్యురాలగు డాక్టరు కె.ఓ. వాన్ శ్రీనగరమునఁగలఘోషాఆసుపత్రికి నేను వెడలియుండినపు డిట్లు నుడివెను.

“ప్రథమప్రసవముతో నెందఱో స్త్రీలు గర్భవతులు కాకుండుటకు ఇచ్చటి మంత్రసానులే కారణభూత లగుచున్నారు. దాని కుదాహరణముగ ఒక స్త్రీ ప్రసవింపక ప్రసవవేదనపడుచున్న దని మమ్ము ఒక చీకటిగదికిఁ బిలిచికొనిపోయిరి. అది యించుకంతయు వెలుతురులేక చాలచిన్నదిగ నుండెను. మంచిగాలి రానికారణమున నామెకు జ్వరము



తగిలియుండెను. ఆమె నులుకమంచముపైని చింపిరిగుడ్డ కట్టుకొని పరుండియుండెను. ముఱికివస్త్రములఁ గట్టుకొని మఱి ముగ్గురు స్త్రీ లట నుండిరి. వారే మంత్రసాను లని గ్రహించితిని. శిశువును బయటికి తెచ్చుటకై చేతులుకాళ్లనుపయోగింపవలె నని వా రెఱింగించిరి. మేము మైకమిచ్చి ఆయుధములచే శిశువును బయటికిఁ దెచ్చితిమి. ఇది బీదలయింటను, భాగ్యవంతులయింటను సమానముగనేజరుగుచుండును. ఆంగ్లవిద్యాధికులుగూడ తమదేశపు మంత్రసానులనే పిలిచెదరు. దేశాచారముల నెంత బి. యే. యమ్. యే. లైనను వదలఁజాలరు. బి, యే. పట్టము వడసినయొక ఉపాధ్యాయుఁడు తనభార్య ప్రసవవేదనపడుచున్నదని నన్ను పిలుచుకొనిపోయెను. నేను పోవుటకుముందే అచ్చట మంత్రసాని ప్రత్యక్షమైయుండెను. గర్భవతి ముఱికిగుడ్డలు కట్టుకొని పరుండియుండెను. మే మెంత ప్రయత్నించినను ఆమె బ్రతుకలేదు. మే మచ్చటికి పోవుటకుపూర్వము మంత్రసానిచేసిన చికిత్సయే దీనికి కారణము.

ఎం. డి. పి. హెచ్. డి. మున్నగు ఆంగ్లదేశవైద్యకళాశాలలయందు పట్టములఁ బడసి, ఆంగ్లమంత్రసానికళాశాలాప్రధానోపాధ్యాయుఁడుగనుండిన యొకనిభార్య ప్రసవసమయమున తలిదండ్రులమాటల కడ్డుచెప్పలేక అతనికి దేశీయమంత్రసానినే పిలువవలసివచ్చెను. దానిఫలితముగ నామె మరణించెను. ఇట్టివి సర్వసాధారణముగ జరుగుచున్నవి.”

### మహా ఘోరము

హిందూదేశమున స్త్రీలయభివృద్ధికై పాటుపడుచున్న
యొక క్రైస్తవయువతీమణి యిట్లు నుడివెను. "నే నొక సం
స్థానమునకు వెళ్లియుంటిని. ఆసమయమున మహారాణి ప్రస
వ వేదనపడుచున్నదని విని యక్కడకు వెళ్లితిని. రాణికి పది
సంవత్సరములే యుండును. దేశీయమంత్రసాను లటు నిటు
పరుగిడుచుండిరి. గదికిబైట నొకవృద్ధు చేత నొక పుస్తకము
పట్టుకొని ఏదో పాడుచుండెను.

"రాణిగారి శరీరమునకు చిచ్చుపెట్టుఁడు, చిచ్చుపె
ట్టుఁ"డని యాముదుసలి యఱచెను. మంత్రసానులు దానికై
ఏర్పాటు చేయుచుండిరి. నా కేమియుఁ దోఁచక దిగ్భ్రాంతిం
జెందితిని. ఒకమంత్రసాని నిదేమియని ప్రశ్నించితిని. "సుఖ
ముగ ప్రసవించి బ్రదుకునా యని చూచుటకే యిది చేయుచు
న్నాము. రాణి బ్రదుకునేని చిచ్చు ఆమెకు బాధను గలిగింపదు.
బైట నిలఁబడి యుండు కులగురు వావిధమే శాస్త్రములలో
నున్న దందురు. వారి యాజ్ఞను మేము మీఱరాదు." అని
మంత్రసాను లనిరి. అదివిని పురోహితుని సమీపించి యిదే
మిఘోరమని యడిగితిని. "ఔను. నే నేమిచేయుదును? శాస్త్ర
ప్రకారము నడవవలెను. లేనిచో నాకు పాపము సంభవించు"
నని యాయన బదులుచెప్పెను."

### హైందవుల అజ్ఞానము

హైందవులు మూఢవిశ్వాసము గలవారు. ఎవరికైన



ను జాడ్యము వచ్చినయెడల దేవుఁడే దానిని దెచ్చెనని భావిం
తురు. పురుషులకంటెను స్త్రీలే మిక్కిలి యజ్ఞానదశయం
దున్నారు. రోగము వచ్చినయెడల ఔషధచికిత్స చేయుటకు
బదులు పోలేరమ్మ, గంగమ్మ మున్నగు కులదేవతలకు పూజ
చేయుదురు. రోగనివారణకై ప్రార్థింతురు. వ్యాధినివారణమైన
చో ఇంటఁగలపాత్రలు మొదలు శరీరమునఁగల నగలవఱకు
నమ్మివేసి ప్రార్థనను చెల్లింతురు.

వ్యాధిగ్రస్తుఁడు మరణించినచో దేవునికి కండ్లు లేవు.
ఎంతయో ప్రార్థనచేసికొంటిమి. ప్రయోజనము లేకపోయిన
దని యింటఁగల స్త్రీలు రోదనముచేసి ఱొమ్ము బాదుకొనెదరు.
పిదప నంతయు విధి యని మనశ్శాంతిని జేసికొనెదరు. ఏ మ
జ్ఞానము! మఱియు స్త్రీ ప్రసవింపకయే మరణించునెడలనామె
పిశాచముగ నాయింటనే వసించునట! దానికై మరణావస్థ
యందున్నపుడే ఆమెకంటియందు మంత్రస్సాని మిరియము వే
యునట! అట్లు మరణాత్పూర్వము దృష్టిని తగ్గించినయెడల మ
రణించినతరువాత పిశాచమునకు కన్ను లగపడవట! దీనితో
తృప్తింజెందక యామెచేతులను బలవంతముగఁ బట్టి పొడ
వగు చీలలతో భూమిపైఁ గొట్టెదరు. దానితో నామె మర
ణించును. ఇట్టియుపద్రవములు స్త్రీలకు కలుగఁజేయుచున్నా
రు. ఇవన్నియు నేను ప్రత్యక్షముగఁ జూచి వ్రాసినవే.

ఇవన్నియు మంత్రసానులలోపముగాదు. పురాతనాచా
రమే కారణము. వాని ననుసరింపకున్న మంత్రసానులకు బ్రదు
కు లేదు. ప్రసవదినమునుండియు మంత్రసానులే పురిటిగది

యం దుండవలెను. ఇంటఁగల స్త్రీ లెవరును కొన్నిదినము
లవఱకును పురిటిగదికి పోరు. మంత్రసానులకు మంచి బహు
మతియే దొరకును. అందులోను పురుషప్రజయైనచో మఱియు
మంచి బహుమతుల నందఁగలరు.

ప్రభుత్వమువారు శిశుసంరక్షణకై ఆసుపత్రుల నేర్ప
రచియున్నారు. మంత్రసానులు మంత్రసానితనము నేర్చుకొను
టకై పాఠశాలల నేర్పఱచియున్నారు. కాని మంత్రసాని కుల
మువారు తా మందు నేర్చుకొనఁదగినది లేదనియు తరతరము
లుగ అనుభవము గలిగియున్నమాకు పాఠశాల లక్కఱ లేదని
యు నందురు. నేను ఆంగ్ల మంత్రసానితనము నేర్పు పాఠశా
లకు వెళ్లియుంటిని. అట ఉపాధ్యాయురాలుగ నుండిన ఆంగ్ల స్త్రీ
యిట్లు నుడివెను.

"దేశీయ మంత్రసానులకు ఆంగ్లచికిత్సాపద్ధతి నేర్పుట
కై ఇంగ్లండులో నొకనిధికలదు. వారిలో ననేకలు వృద్ధలగు
టవలనను, కొందఱి కెంత బోధించినను గ్రహించక పోవుట
వలనను, వారల కిది నిష్ప్రయోజన మగుచున్నది. వారలను
మంత్రసానితనము వీడియుండుటకై నెలకు కొంతభృతి యిచ్చి
నను వారు తృప్తినిబొందక మంత్రసానితనమును జేయుచుం
దురు. దీనిఫలితముగ శిశుమరణము లధికముగ సంభవించు
చున్నవి"

లాహోరులోఁగూడ నిట్టిపాఠశాల యొకటిగలదు. అం
దుఁగల బోధకురాలు ఇట్లు నాకెఱిఁగించెను. "నేను నావద్ద



మంత్రసానితనము నేర్చుకొనినకొందఱికి నాసాయము గోరిన
వత్తునని యెఱిఁగించియుంటిని. దానిప్రకారము గతవత్సరమున
నాకు పిలుపువచ్చెను. అది చలికాలము. వేకువను ౩ గంటలకు
నాకు వార్తవచ్చెను. ఆయిల్లు పంచములది. అది చిన్నగుడిసె.
అందు ఎనిమిదిమంది నివసించియుండిరి. మేఁకలు కోళ్లు మున్న
గునవియు నట నుండెను. ఒకమంచముపైని ప్రసవవేదనతో
నొకపడుచు పరుండియుండెను. నావద్ద నేర్చిన మంత్రసానిచికి
త్సచే అమడబిడ్డలు గలిగిరి. కొంతసేపటికి దేశీయమంత్రసాని
వచ్చి తాను వచ్చులోఁగ ప్రసవించినది విని కోపముతో నా
మెభర్తతో తగవులాడుచుండెను. అది తనకు చేరవలసిన
రాబడినిగుఱించియేగాని మఱొండుగాదు. ఇపుడిపుడు దేశీయ
మంత్రసానులం బిలచుటమాని ఆంగ్ల మంత్రసానులనె పిలు
చుటకు ప్రారంభించిరి కాని దీనిని వృద్ధు లొప్పుకొనుట లేదు."

భారత దేశమునఁగల యీదురాచారమును పోఁగొ
ట్టుట సామాన్యముగాదు. ఒకవేళ బాలికలకు విద్యను బో
ధించి దేశీయ మంత్రసాని సాయమును కోరనివిధమునఁ జేయ
వచ్చునుగాని, ఇంటఁగలపెద్దలబుద్ధి మార్ప నెవరితరముగాదు.
ఈదురాచారమును నిర్మూలించి భారతమాతకు సుపుత్రులగు
దురా? ఆదినమే సుదినము. అపుడు బాల్యవివాహములును, శి
శుమరణములును తగ్గఁగలవు. ఈమూఢవిశ్వాసము భారతీయు
లమనసులం దున్నంతవఱకు భారతదేశమునకు మోక్షము లే
దు. దీనికి స్త్రీలె ముందంజవేసి కృషిసలుపవలెను. తమ
బాలికలకు విద్య గఱపవలెను. దీనికి పురుషు లెంతమాత్ర

మును దోడ్పడఁజాలరు. స్త్రీలే పాటుపడవలెను.

### శిశుమరణములు

శిశుమరణములు చాల ఎక్కువగ నుండుటకు బాలికలకు వివాహమగుటయే కారణము. తమకు సంవత్సరములోపల శిశువు జనింపవలయు నని కోరును. భారతీయులగృహస్థ ధర్మము నదియే. సంతానవతి కానిచో నాబాలిక సంఘమున చాలనీచముగ భావింపఁబడును. భర్త,అత్త, మామ మున్నగువారు నిందింతురు. మఱియు చాల కష్టములకు లోనగును. ఇంతటిబాధల కోర్వక యాబాలిక యొకప్పుడు ఆత్మహత్యకు సిద్ధపడును. ఒకవేళ సంతానవతి యైనచో బాల్యమునసె శిశువును గనుటచే తల్లికిని, శిశువునకును శరీరదార్ఢ్యము లేకపోవుచున్నది. తల్లి దుర్బలయై యున్నప్పుడు శిశువు బ్రదుకునా? సర్వసాధారణముగ శిశువు మరణించియే గర్భమునుండి జనించుచున్నది. ఇట్టి శిశుమరణముల సంఖ్య భారతదేశమున ప్రతివత్సరము 2,000000 లని అంచనా వేయఁబడినది. ఈ మరణములకు తల్లులయందుండు రోగములును కారణ మగుచున్నవి.కాని ఈసంఖ్య మనల చాల భయపడఁజేయుచున్నది.

---

## ఏకాదశాధ్యాయము.

---

### ఘోషాదుర్నీతి

ఈయధ్యాయమున మహమ్మదీయులను గుఱించి విచారింతము. ఉత్తరదేశపు మహమ్మదీయులకును, దక్షిణదేశపు



మహమ్మదీయులకును చాల తారతమ్యము గలదు. ఉత్తరదేశవాసులలో నధిక సంఖ్యాకులు ఆఫ్గనులు,అరేబియనులు,పారసీకులు. దక్షిణదేశవాసులు మహమ్మదీయ మతావలంబకులు. ఆచారమునను చాల వ్యత్యాసము గలదు.

హైందవ స్త్రీలకంటె మహమ్మదీయ స్త్రీలకు కొంత స్వాతంత్ర్యము గలదు. బాల్యవివాహములును, విధవలును మహమ్మదీయమతమున లేరు. శరీరబలమును, ధైర్యమును, నెక్కువ. హైందవ స్త్రీలకంటె మహమ్మదీయ స్త్రీలకు కొంత స్వాతంత్ర్య ముండినను మఱొకదురభ్యాసము వారలలోఁ గలదు.జీవితాంతమువఱకు ఇంటియందే ఖైదీవలెనుండవలెను. ఇదియే ఘోషా యనఁబడును. హిందూదేశమునకు మహమ్మదీయులు దండయాత్ర వచ్చినపుడే యీఘోషా హిందూదేశమునకు వచ్చెను. హైందవులలోఁగూడ నగ్రవర్ణమువారలలో నీపద్ధతి గలదు. హైందవులు దీనిని గౌరవముగ భావించుచున్నారు.

### ఘోషా టీపార్టీ

ఒక ఆంగ్లోద్యోగి యొక్క భార్య ఢిల్లీ నగరమున ఘోషా స్త్రీల కొకవిందు చేసెను. అది స్త్రీలకుమాత్రమే కాన పురుషు లెవరికిని ప్రవేశము లేదు. స్త్రీలందఱును విందుగుడుచుటకై చుట్టును కప్పఁబడిన బండ్లలో వచ్చిదిగుచుండిరి. అందఱు వచ్చినపిదప విందుగుడిచితిమి. అపుడు కొందఱు యువకులు వచ్చుటచే కొంతకల్లోల మేర్పడెనుకాని వెంటనే చల్లారెను. అందఱును తమతమ ఆసనములఁగూర్చుండిరి. అప్పు

డు ఒక స్త్రీ యిట్లు నుడివెను "ఘోషా చాల దురాచారమనియే మీరు భావింతురు. కాని మాయిండ్లలో మేము చాల సుఖముగ కాలము గడపుచున్నాము"

మఱొకతె "నేను నాభర్తతో ఇంగ్లండు వెడలినపుడు ఘోషా అవలంబింపవలెనని నన్ను నాభర్త నిర్బంధింపలేదు. అచటఁగల విశేషముల నన్నిటిని చూచితిని. అటఁగల గౌరవనీయ స్త్రీపురుషులతో మాటలాడియుంటిని. అచట స్త్రీలకు మిక్కిలి స్వాతంత్ర్యము గలదు. ఘోషాపద్ధతి చాల దురాచారమైనది. ఇట్టివిందులకు వచ్చుటకుఁగూడ భయపడుచున్నారు." అని నుడివెను. కలకత్తా విశ్వవిద్యాలయపురిపోర్టునం దిట్లు గలదు.

"వంగదేశమున హిందూ మహమ్మదీయులలో ఘోషా పద్ధతి గలదు. ఆంగ్లవిద్యా సంపర్కముచే ఘోషాపద్ధతి నిపుడంతగ పాటించుట లేదుగాని వైదికులు మాత్రము ఘోషా పద్ధతి యుండవలెననియే వాదించుచున్నారు"

బొంబాయిరాష్ట్రమున ఘోషాపద్ధతి యంత బాధించుటలేదు. స్త్రీలు ఆంగ్లవిద్యావతు లగుటయే యిందులకు కారణము. ఇటఁగల పార్సీ స్త్రీలు నాగరకమునను, విద్యయందును అభివృద్ధిని బొందియున్నారు. చెన్నరాష్ట్రమున మహమ్మదీయులే ఘోషాపద్ధతి ననుష్ఠించుచున్నారు గాని హైందవులలో కొన్ని తెగలవారుగూడ దీని ననుష్ఠించుచున్నారు.

నేనాంగ్లదేశము వెడలి విద్య నభ్యసించివచ్చిన యిద్దఱు యువకులతో సంభాషించితిని. వారు "మేము ఘోషా



పనికిరాదని బోధించినను వారు వినరు. ఆపద్ధతి మంచిదనియే వారు భావించుచున్నారు. పూర్వము స్త్రీల కధికగౌరవముండియుండెను. మనుధర్మశాస్త్రములోఁగూడ స్త్రీలయౌన్నత్యము చాటఁబడియున్నది" అని వారు నుడివిరి.

కలకత్తానగర పారిశుద్ధ్య సంఘమువారి 1917 సం॥పు రిపోర్టులో నిట్లు గలదు. "ఈసంవత్సరము మరణసంఖ్య తక్కువగ నున్నను పురుషులకంటె స్త్రీలసంఖ్య యెక్కువగఁ గలదు. అందుకు ఘోషాపద్ధతియే కారణము. ధనవంతులగువారు పెద్దపెద్దభవనములయందు వసింతురు. తోటలయందు తిరుగుదురు. దానిచే మంచిగాలిని పీల్చుచున్నారు. బహుళ సంఖ్యాకుల కట్టిసౌకర్యము లేదు. గాలిలేకపోవుటచే క్షయరోగపీడితు లగుచున్నారు. ఇట్టిస్థితిలో బీదవారుగూడ ఘోషాపద్ధతి ననుష్ఠించుట శ్రేయస్కరము గాదు, గాన బీదలు ఘోషాపద్ధతి వీడినచో మరణసంఖ్య తగ్గఁగలదు."

హిందూదేశస్థుల ఆచారవ్యవహారములే వారికి వ్యాధిని కలుగఁజేయుచున్నవి. ఒకటేయింటియందు పలువురు వసించుటయు, ఘోషాదురాచారము నిందులకు కారణమగుచున్నది. ఇదిగాక బాల్యవివాహములుగూడ దీనికిఁ దోడ్పడుచున్నవి. ఇవన్నియుఁ జేరి క్షయరోగమును గలుగఁజేయుచున్నవి. 100 కి 99 మందికి రోగము గలదని ఇంగ్లండులోని వైద్యకళాశాలడైరక్టరు ఆండ్రూ బాల్ఫరుగారు నుడివియున్నారు.

లాలా లజపతిరాయిగారుగూడ ఘోషాపద్ధతిని తీవ్రముగ ఖండించియున్నారు. కలకత్తాలోని యొకవారపత్రిక 1926 సం॥ము ఫిబ్రవరి 20 తేదీ నిట్లు వ్రాసెను. "వంగదేశమున ఘోషాపద్ధతి ననుష్ఠించువారిగతి చాలఘోరమైనదని మేము కొన్నివత్సరములకుపూర్వమే వ్రాసియుంటిమి. దానినిగని ఆపద్ధతిని తొలఁగింతురని భావించితిమి గాని యట్లు జరుగలేదు. దానినిగుఱించి పురుషులుగూడ నెట్టిశ్రద్ధను దీసికొనలేదు. భారతీయులు మూఢవిశ్వాసము గలిగియున్నారు. అవన్నియు వీడవలెను. వ్యాధికలిగిన రక్షరేకు కట్టుటయు, కులదేవతకు పూజచేయుటయు మొదలగు పనులచేతను కాలము గడపుచున్నారు. ప్రతివత్సరము వంగయువతులెందఱో క్షయరోగపీడిత లగుచున్నారు.

ఆంగ్లవిద్యావంతు లిపుడిపుడు ఆచారముల సంస్కరింపఁబూనుచున్నారు. కాని వైదికులతో పోరాడలేకపోవుచున్నారు. స్త్రీ లెల్లప్పుడు నింటియందే యుండుటచే బయటికి పోవుటకు లజ్జించుచున్నారు. బయట పచారుచేయుటకును వారి కవకాశము లేకున్నది. ఈస్థితి మాఱవలయును. స్త్రీల నన్నివిధముల నభివృద్ధికిఁ దెచ్చుట యువకులవిధియై యున్నది. దీనికై పాటుపడవలెను.

### వంగీయులు హంతకులా ?

ఇది యిటు లుండ వంగదేశముననే రాజకీయాందోళన బయలుదేరుచున్నది. ఆందోళనకారులు బాంబులు మున్నగునవి తయారుచేయువారై యున్నారు. హంతకులును నై యున్నారు. వంగదేశముననే ఘోషాపద్ధతియు నధికము. రాజకీయాందోళనకారులకును, హత్యలుచేసిన వంగీయులకును, బాంబులువిసరిన వంగయువకులకును తమతమ యింటఁగల ఘోషాస్త్రీలసాయ మున్నదనియే భావింపనగును. దీని నెవ్వరును కాదనఁజాలరు.



---

## ద్వాదశాధ్యాయము.

---

### స్త్రీలదురవస్థ

భారతస్త్రీలు విద్యావతులు కారని యిదివఱకే వ్రాసియున్నాము. 1921 సం॥మున 1000 కి 18 మాత్రమే వ్రాయను చదువను నేర్చినవారని లెక్కింపఁబడియున్నది. దీనిని గుఱించి అపిటూబాయిగా రిట్లు నుడివియున్నారు. "బ్రాహ్మణస్త్రీలకును, ఇతరజాతులస్త్రీలకును అన్నివిషయములయందును తారతమ్యము లేదు. స్త్రీలకు విద్య కూడదనియు గ్రహణశక్తి లేదనియు నందురు. అది సమంజసముగానేరదు. బుద్ధిని వికసింపఁజేయుటకు విద్య అత్యంతావశ్యకము. స్త్రీలు విద్యావతులైనచో పురుషుల కవమానమని వైదికులు భావించుచున్నారు. అది దుర్భావనమే యగును. హైందవులలోనే యిటు లున్నదని భావింపఁగూడదు. మహమ్మదీయులయందును నిటులే యున్నది. ఇస్లాంమతము

స్త్రీవిద్య నొప్పుకొనుటలేదు. ఇట్లు హిందూమహమ్మదీయ స్త్రీలు విద్యావిహీనలై యున్నారు.''

మిగిలినరాష్ట్రములకంటె వంగరాష్ట్రము విద్యలో ముందంజవేసిన దని 1917 సం॥ పు కమిషను రిపోర్టు నుడువుచున్నది. ఆకమిషనునెదుట సాక్ష్యమిచ్చుచు హరిదాసు గోస్వామిగారు ఇట్లు నుడివిరి. ''స్త్రీలకు విద్య గఱపినచో వారి బుద్ధులు మార్పును జెందును. విద్యలేమియే వారలకు మంచిని కలుగఁజేయఁగలదు'' విశ్వవిద్యాలయపండితుఁడు రవీంద్ర మోహనదత్తుగా రిట్లు నుడివియుండిరి. ''స్త్రీలకు విద్య అత్యంతావశ్యకము. విద్యవలననే వారు వికాసమును జెందఁగలరు. కాని మూఢవిశ్వాసము పూర్వాచారపరాయణులయం దెక్కువగ నున్నది. దానికి భయపడియే బాలికలకు విద్యగఱపుటను మానుచున్నారు. శాసనసభలలోని రాజకీయవాదులు స్త్రీవిద్య నాదరించెదరు.''

భారతశాసనసభలో స్త్రీవిద్యనుగూర్చి చర్చవచ్చినపుడు డా॥గౌరుగా రాదరించి మాటాడిరి. మున్షి ఈశ్వరశరణుగారు ఖండించి మాటాడిరి. ఇంగ్లండు మున్నగు దేశములకు విద్యార్జనకై యువకులు వెడలి విద్య నభ్యసించి వచ్చినవారు కొందఱు విద్యావతులగు బాలికలనే వివాహమాడ నిచ్ఛగించుచున్నారు. అందఱు నిటులే యుండినచో స్త్రీవిద్య శీఘ్రముగ వ్యాపింపఁగలదు.

సామాన్యముగ బాలికలు విద్యావతులు గాకుండుటకు తల్లిదండ్రులే కారణభూతు లగుచున్నారు. వివాహ మగువఱకు బాలికలను పాఠశాలకుఁ బంపుదురు. వివాహితలైన పిదప పాఠశాలకుఁ బంపరు. బాల్యవివాహమును జేయుటచే బాలికలు విద్య నభ్యసింప అవకాశము లేకపోవుచున్నది.



### వరదక్షిణ

హైందవుల దురాచారములలో నిదియొకటి. ఒకనికి స్త్రీప్రజ గలిగినచో వాని కప్పటినుండియు విచారమే. పిల్లకు వరుని వెదకుటయందే వానిశక్తి యంతయు నీరసించిపోవుచున్నది. వేలసంఖ్యగ వరునకు కట్న మీయవలెను. అదిగాక మిగిలినమర్యాద లన్నియుఁ జక్కఁగఁ జేయవలయును. ఇంత చేసి పిల్లనిచ్చినను పిల్ల స్వాతంత్ర్యవిహీనయై భర్తయింట పడియుండవలసినదే. గట్టిగ మాటాడరాదు. భర్తకు కోపము వచ్చెనా పుట్టింటికి పంపివేయును. మామగారు పిల్లను పిలుచుకొని వచ్చినచో నపుడు డబ్బిచ్చినఁగాని పిల్లను స్వీకరింపనను. డబ్బియ్యనిదీ స్వీకరింపఁడు. ఇట్టి స్థితిలో నొకనికి నలుగురు స్త్రీసంతాన ముండిన నేమికావలెను? వాఁడు బిచ్చ మెత్తవలసినదే. దీనిచేతనే విద్య గఱపుటకేల ద్రవ్యము వెచ్చముచేయవలె నని తలఁచుచున్నాఁడు. ఇవియన్నియు అతిశయోక్తులు కానేరవు.

కలకత్తా విశ్వవిద్యాలయ సభ్యులు రాయి హరినాథ గోస్‌గా రిట్లు నుడివియుండిరి. ''తనకుమారుని విద్యవిషయమై యెంత ఖర్చుపెట్టినను వృథ కాదనుకొనుచున్నాఁడు. వివాహమప్పుడు వరకట్నము సంచులకొలఁది లాగవచ్చును.

ఇట్టిస్థితిలో భారతీయు లున్నంతవఱకు స్వాతంత్ర్యమును బొందనేరరు.''

తలిదండ్రులకు స్త్రీవిద్యయందుఁ గల అశ్రద్ధకును పూర్వాచారపరాయణుల వాదమునకును కారణము తెలియవచ్చినది. స్త్రీలకు విద్యలేనిచో వారలకుకలుగు బిడ్డలకు విద్యయం దెట్లు ఆసక్తి యుండఁగలదు? స్వలాభాపేక్షచేతనే తమ బాలికలకు విద్య నేర్పుటలేదు.

స్త్రీలు విద్యాభ్యాసమును జేయవలె ననిన వివాహాత్పూర్వమే అభ్యసింపవలెను. వివాహితయై భర్తయింటికిఁ జనినతర్వాత నామెకు ఇంటిపనులతోనే దినమంతయుఁ గడచిపోవును. మఱియు భర్తకు సేవచేయుటయందును అత్తకు కోపమురాకుండ కార్యముల జరుపుటయందును నిమగ్నురాలగుచున్నది. ఇం దేది తప్పినను ప్రమాదమే సంభవించును. మఱియు అతిబాల్యముననే శిశువునుగూడఁ గనుచున్నది. ఇంక విద్య నభ్యసింప అవకాశ మెక్కడిది? అట్లు విద్యను అభ్యసింప ఇచ్ఛయున్నచో స్త్రీలవద్దనే విద్య నభ్యసింపవలెను. స్త్రీలు నేర్చినవిద్య భర్త అత్తల కణఁగి నడచుకొనుట, కులదైవమునకు పూజచేయుట, ఇవియేకాన వీనినే నేర్చుకోవలెను. ధనవంతులు, ధనహీనులుగూడ స్త్రీవిద్యయం దశ్రద్ధగనే యున్నారు.

లాహోరు నగరమున మేరీరాణికలాశాలయను స్త్రీలకలాశాల గలదు. దానికి మహారాజులు జమీందారులు



ధనసాహాయ్యము చేయుదురుగాని తమ పుత్రికల విద్యావిషయమై శ్రద్ధఁబూనరు. ఈకళాశాలను స్త్రీలు చక్కఁగ నుపయోగించుకొనుటయే విధిగ భావింపవలెను. ఇప్పటి యువకులకు స్త్రీవిద్యయం దాసక్తి యున్నను ఇంటఁగల పెద్దలకు భయపడి యూరకుండవలసివచ్చుచున్నది. వారో ప్రతిదానికిని దేవుని, కులదైవమును పూజింపవలయు నందురు. ఇదియే స్త్రీలయందును వేరూనిపోవుచున్నది. ఇంత నిర్బంధముండినను ఇప్పుడిప్పుడు ధనికుల బాలికలు, రాజకీయనాయకుల బాలికలు, బ్రాహ్మణబాలికలు విద్య నభ్యసించుచున్నారు. కాని యది చాలదు. ఉన్నతవిద్యను స్త్రీలు పడయవలెను. అప్పటికిఁగాని మూఢాచారము, మూఢభక్తి, స్వాతంత్ర్యవిహీనత తొలఁగఁజాలవు. స్త్రీవిద్యవిషయమై పురుషుల సాయ మెదురుచూచిన లాభములేదు. తమకు విద్య కావలయునని స్త్రీలే ఆందోళన చేయవలెను. అప్పటికిఁగాని సార్థకము గాఁజాలదు. అంతవఱకు దివాస్వప్నమేయగును.

---

## త్రయోదశాధ్యాయము.

---

### బ్రాహ్మణపీడ

మేము వంగదేశము విడిచి చెన్నపురిం జేరితిమి. ఈ రాజధానియే బ్రాహ్మణహిందూమతస్థానము. పూర్వనివాసులగు నల్లనివర్ణముగల ద్రావిడులస్థానము నిదియే. బ్రాహ్మ

ణమతము ద్రావిడుల భగ్నముచేసి అస్పృశ్యు లనియు, వీరని వారని యేర్పఱచి విద్యావిహీనులుగఁ జేసినది. క్రమముగ వీరి దౌర్జన్యము సహింపలేక ద్రవిడులు తిరుగఁబడి బ్రాహ్మణేతరపక్షము నేర్పఱచి ఉద్యోగపదవుల నన్నిటిని తమ వశము చేసికొని రనునది చరిత్రమున వ్రాయఁబడఁదగిన దే.

చెన్నపురిలో ప్రముఖుఁడును, రాజకీయనాయకుఁడును పలుకుబడిగలవాఁడును అయిన యొక గౌరవనీయునితో మాటాడితిని. బ్రాహ్మణులవిషయ మెఱింగింపుఁ డని కోరితిని. ఆయన యిట్లు నుడివెను. "ప్రాచీనకాలమున నెవరియిష్టముప్రకారము వారు జీవించుచున్నపుడు బ్రాహ్మణులు విద్యావంతులై వేదశాస్త్రపురాణేతిహాసములను తమవశము చేసికొనిరి. వారిలో బ్రాహ్మణుఁడే సర్వజాతులలోను శ్రేష్ఠుఁడు. వాఁడే అందఱికి గురుఁడు. అందఱు వానిసేవకులై యుండవలెను, అని వ్రాసియుంచెను. బ్రాహ్మణులు మిక్కిలి తంత్రశాలులు. మఱియు ననేకసంవత్సరములు గడచినవి. బ్రాహ్మణులుతప్ప మిగిలినవా రెవ్వరును విద్య నార్జింపలేదు. దానిచే బ్రాహ్మణులు శాస్త్రములు పురాణములు చదువుటకు బ్రాహ్మణుఁడుతప్ప మిగిలినవా రర్హులు గారనికూడ వ్రాసియుంచిరి. దానిని మిగిలినజాతివారు నమ్మి బ్రాహ్మణుఁడు భూదేవుఁడని నమ్మి పూజించుచుండిరి. ఈతంత్రముల చేత నందఱికంటెను బ్రాహ్మణుఁడు గొప్పవాఁ డయ్యెను. మఱియు బ్రాహ్మణునిమాటను జవదాఁటుట కెవ్వరికిని ధైర్యము లేకపోయెను. అందఱు సేవకులైరి. బ్రిటిషుప్రభుత్వ



ము వచ్చి విద్య యందఱికి సమాన మనువఱకును బ్రాహ్మణేతరులకుఁ దెలిసినదిగాదు.

ఇపుడు మేము బ్రాహ్మణుల నెదిరించి పోరాడుచున్నాము. కాని బ్రాహ్మణుని జయించుట సామాన్యము గాదు. తంత్రజ్ఞుఁడు. ప్రభుత్వాధికారము లన్నియు 100కి 80 వారివశముననున్నవి. వీనిచేతనే బ్రాహ్మణేతర ప్రజలను స్త్రీలను భయపఱచుచున్నాఁడు. మేము నమ్మితిమి. ఇపుడు మమ్మేమి చేయుటకును బ్రిటిషుప్రభుత్వ మడ్డుపడుచున్నది. లేకున్న మమ్ము స్వాహా చేసియుందురు. పత్రికలు వారివశమున నున్నవి. తమపనుల కడ్డుగనున్న ప్రభుత్వమును పాఱఁదోలుటకు స్వరాజ్యము కోరుచున్నారు. స్వరాజ్యము వచ్చిన బ్రాహ్మణుని కత్యంతానందము గలుగును. మమ్ములను స్వారి కుపయోగించును. బ్రిటిషువారు రాకపూర్వ మెట్టులుండెనో అటులే స్వరాజ్యము వచ్చినను ఉండఁగలదు. అపుడు పురోహిత ప్రభుత్వము తాండవమాడఁగలదు. అపుడు మా కధోగతియే సంభవింపఁగలదు. మఱియు విశేషముల గమనింపుఁడు."

ధనార్జనము

"ప్రభుత్వమునకు చెల్లించుకప్పమువిధముననే బ్రాహ్మణేతరుఁడు బ్రాహ్మణునికి పుట్టిననాఁటినుండి చచ్చుదనుక కప్పము చెల్లింపవలయును. దానికి దక్షిణ లని పేరు. శిశువు జన్మించినపిదప 16 వ దినము అంటుపోవుదినము. ఆనాఁడు బ్రాహ్మణునికి దక్షిణ యీయవలయును. లేకున్న శిశువు

క్రమముగ పెరుగ నేరదట. పిదప నామకరణ మని, అన్నప్రాశన మని వీనికంతయు దక్షిణ యీయవలెను. జన్మదినమునకును దక్షిణ. అక్షరాభ్యాసమునకు దక్షిణ. అక్షరాభ్యాసమపుడు బాలుఁడు ధనవంతునిబిడ్డయైనచో బ్రాహ్మణునికి మరింతసంతసము. బంగారుతో కలముచేయించి దానము చేయవలెను. స్త్రీప్రజయైనచో 16 వయసున వివాహము చేయవలెను. అపుడు మంచి గొప్పదక్షిణలు లభింపఁగలవు. గ్రహణదినములలో దక్షిణ. ఇది యది యననేల? యేదైనను బ్రాహ్మణునికి దక్షిణయీయక తప్పదు. చచ్చిపోయినవానినిగూడ బ్రాహ్మణపిశాచము వదలుటలేదు. దక్షిణ యిచ్చినపిదపనే ప్రేతసంస్కారము చేయవలెను. ప్రతిమాసము మాసిక మని దక్షిణ వంటసామగ్రి లాగును. ఇట్లు బ్రాహ్మణుని కిచ్చిన చచ్చినవారు ప్రీతు లగుదురట! మతాచారము ప్రకారము వీనికి బ్రాహ్మణునికే హక్కుగలదట! బ్రాహ్మణునికి దక్షిణ యీయకున్న నరకమునఁ బడుదు రని బ్రాహ్మణుఁడు పలుకును. ఈక్రియలు జరుగునపుడెల్లను బ్రాహ్మణునిపాదములఁ గడిగి యానీటిని త్రాగవలయునట! బీదజనుల నిట్టి మూఢవిశ్వాసమునకు లోనుజేసి వారివద్ద ధనము లాగి సోమరిగ బ్రాహ్మణుఁడు కాలక్షేపము చేయుచున్నాఁడు. గవర్నమెంటుద్యోగము వకీలువృత్తి తప్ప మిగిలిన వానికి బ్రాహ్మణుఁడు పోవుటలేదు. ఈరాష్ట్రమున 15 లక్షల బ్రాహ్మణు లున్నారు. వీరలకు బానిసలై సేవఁజేయుచు 4 కోట్ల 15 లక్షల బ్రాహ్మణేతరు లున్నారు. మాకు సరి



యగు స్వాతంత్ర్యము గలుగువఱకును బ్రాహ్మణదౌర్జన్యము నుండి మేము బయటపడువఱకును మాకు స్వరాజ్య మక్కఱలేదు. బ్రిటిషువారు పాలించుటయే ఉత్తమము.”

---

## చతుర్దశాధ్యాయము.

---

### పంచములకష్టములు

అనేకసంవత్సరములకు పూర్వము ఇప్పటి హైందవుల పూర్వీకులు భారతదేశమునకు వచ్చినపుడు అపుడుండిన కొందఱు కొంతనలుపువర్ణముగలిగి యుండిరి. వచ్చినవారు కొంత తెలుపువర్ణముగ నుండుటచే వారితోఁ జేరఁగూడదనియు, అశుద్ధులనియు వేఱుపఱిచిరి. వారలు అస్పృశ్యు లనిరి. అందఱకంటె నుత్తముఁడు బ్రాహ్మణుఁ డనియు, క్షాత్రముగలవాఁడు క్షత్రియుఁడనియు వీరిర్వురకు క్రిందివాఁడుగను వ్యవసాయము వ్యాపారము చేయుటకై యొకతెగ నేర్పఱిచి వారలకు వైశ్యు లనియు, ఈముువ్వురికిని క్రిందిజాతివారుగను సేవకులుగను నుండుట కొకతెగ నేర్పాటు చేసి శూద్రు లనిరి. వారికి నీచజాతులుగ పంచములు లేక అస్పృశ్యు లని యొకవర్గము నేర్పఱిచిరి.

భాగవతమున ఒక బ్రహ్మహత్యకు నీక్రిందివిధముగ పాపమును వివరించియున్నది. బ్రహ్మహత్యఁ జేయువాఁడు

మరణించినపిదప మఱుజన్మమున క్రిమిగ జన్మించును. అనేక పర్యాయములు క్రిమిగ జన్మించి పిదప మనుష్యజన్మ మెత్తును. మనుష్యుఁడై జన్మించునపుడు ప్రథమమున పంచముఁడుగ గ్రుడ్డివాఁడై జన్మించును. వానిపాపము దొలఁగవలె ననిన 40,000 బ్రాహ్మణులకు అన్నము పెట్టవలెను. ఇట్లు జన్మించినవారే పంచములని భావింపఁబడుచున్నారు. వీరిని పై జాతివారు ఇంతింతయని చెప్పరాని హింసలకు లోను జేయుచున్నారు.

బ్రాహ్మణుఁ డొకశూద్రుని హత్యచేసినయెడల ఆపాపమును బోఁగొట్టుకొనుటకు గాయత్రి జపముఁజేసిన చాలునని శాస్త్రములలో వ్రాయఁబడియున్నది. ప్రాచీనకాలమునుగుఱించి కాక యిప్పటి పంచములస్థితి విచారింతము.

ఈ యస్పృశ్యులలో ననేకులు తోటపనిని జేయువారై యున్నారు. వీరు బహిరంగములైన రస్తాలలో నడువఁగూడదు. దేవాలయము, తటాకము, నూతులు, పాఠశాలలు వీనిని సమీపించుటకును వీ రర్హులుకారు. వీరిని పురాణముల కన్నెత్తియైన హైందవులు చూడనీయరు. త్రాగుటకు నీ రిచ్చుటలే దన వీరిస్థితి నూహింపుఁడు. ఆసుపత్రులకు వచ్చి చికిత్సను పొందఁగూడదు. దక్షిణహిందూదేశమున నిది మిక్కిలి ఘోరము. వ్యవసాయమునను వీరికి లాభించుట లేదు. పై జాతివారు వీరికి సరిగ భాగమిచ్చుటలేదు. ప్రతివిషయమునను వీరిస్థితి చాల దుస్థితిగ నున్నది. భిక్ష మెత్తుకొనుటకును వీరి కవకాశము లేదు. బిచ్చమీయఁ దలంచిన



హైందవుఁడు క్రింద వేసి పాఱిపోవును. వాని నా పంచముఁ డేఱుకొనవలెను. బ్రాహ్మణవీథులలోనికి రాఁగూడదు. బ్రాహ్మణుఁడు వీథిని బోవునపుడు పంచముని జూచినచో ఉగ్రుఁడగును.

మఱియు మలబారులో పులయాలని పంచములకుఁ బేరు. వీరికి గుడిసె వేసికొని యందు నివసించుటకును హక్కు లేదు. చెట్టునీడయందే వసింపవలయును. ఒక నాయరుజాతీయునికి పులయా కంటఁబడినచో వానిని వధించుటకును హక్కు గల దని శ్రీపిటుబాయిగారే వ్రాసియున్నారు. ఇపు డట్లు జరుగుట లేదుగాని యంతనీచముగఁ జూడఁబడుచున్నారు.

హైందవులు వీరిని బహిష్కరించుటచే వీరి బ్రదుకుఁదెరువులకు మార్గాంతరము లేక దోపిళ్లు, హత్యలు, వ్యభిచారము వీనినిచేపట్టిరి. ఇట్టివారు 4½ లక్షలమంది యున్నారు.

వీని కన్నిటికిని మూఢవిశ్వాసమే కారణము. ప్రతిదానికిని మతమును, దైవమును బేర్కొనెదరు.

ఇపుడిపుడు అస్పృశ్యులు స్వాతంత్ర్యమును బొందుచున్నారు. పలుచోట్ల వారలకు పాఠశాలలేర్పఱుపఁబడియున్నవి. సహకారసంఘములుగూడ ఏర్పఱుపఁబడియున్నవి. ప్రభుత్వమువారు సహాయులై యున్నను సంపూర్ణ స్వాతంత్ర్యమును బొందలేకున్నారు. చెన్నరాష్ట్రమునఁగల 8157 పాఠశాలలలో 609 పాఠశాలలలోమాత్రమే అస్పృశ్యులకు ప్రవేశము గలదని లెక్కలవలన తేలుచున్నది. ఇది సంతసింపఁదగిన

విషయమే. ఇంత తీవ్రముగ నీరాష్ట్రమున నస్పృశ్యత తాండవ
మాడుటకుఁగల కారణము వైదిక బ్రాహ్మణులే యగుచు
న్నారు.

1926 సం॥ న బొంబాయి శాసనసభలో అస్పృశ్యు
లకు సకల పాఠశాలా ప్రవేశమును బాటలు, బావులు, ము
న్నగువానియందు హైందవులకుఁగల సంపూర్ణబాధ్యత వీరికిని
ఉండవలె నని యొకతీర్మాన మాలోచనకుఁ దేఁబడినది.
అపుడు సభ్యులలో బహుళసంఖ్యాకులు దానికి సానుభూతి
చూపినను క్రియకు వచ్చునపుడు చాల గందరగోళ మగునని
చెప్పిరి. రాజకీయనాయకులు మాటాడుదురేగాని క్రియలో
కనుపింపరు. మాటలలోనే కాలమును గడపుచున్నారు. పైస
భాసభ్యులగు జనాబ్ నూర్మహమ్మదుగా రిట్లు నుడివిరి.
"మనదేశమున జన్మించి మనకు సోదరులై సహాయులై యు
న్నయొక తెగను అస్పృశ్యులుగ భావించి వెలివేసి వారిని
బాధించుచున్నాము. దీని కర్థము నాకు బోధపడుటలేదు.
మన మిట్లు చేయుటచే బాధల కోర్వక క్రీస్తుమతమునో మ
హమ్మదీయ మతమునో స్వీకరించుచున్నారు. దీనికి హైందవు
లే బాధ్యు లగుదురు. మన మిట్లు అస్పృశ్యుల బాధించుచు
స్వరాజ్యమును కోరుచున్నాము. ఇదేటిన్యాయము? రస్తాలకును
నీళ్లగుంటలకును వచ్చుటకు అస్పృశ్యులకు స్వాతంత్ర్యమును
మన మీయనపుడు మనకు స్వరాజ్యమెట్లు రాఁగలదు? స్వరా
జ్యము మనకు కావలసినచో అస్పృశ్యు లనువారిని స్పృశ్యు



లుగఁజేసి సర్వస్వాతంత్ర్య మీయవలయును. అట్లుచేసిన నే
స్వరాజ్యమును బొందవచ్చును.''

అస్పృశ్యులస్థితిని నేను ప్రత్యక్షముగఁ జూచుట తట
స్థించినది. ఉత్తర హిందూస్థానమున నొకయూరిలో శిశుసం
రక్షణాలయ మొకటి గలదు. దాని నిర్వాహకురాలు ఒకయై
రోపియ స్త్రీవైద్యురాలు. ప్రతిదినము తల్లులు తమబిడ్డలతో
బహుళసంఖ్యాక లటకు వచ్చుచుండిరి. వైద్యురా లాపిల్లలను
రోగ మంటకుండఁ జూచి రక్షించుచున్నది. నే నంతయు తిరిగి
చూచితిని. అపు డొకతల్లి తనశిశువుతో కొంతదూరమున
నిలిచియుండెను. నే నామె యెందుల కట నిలిచియున్న దని
ప్రశ్నించితిని. డాక్ట రామె లోపలికివచ్చిన వీరందఱును పాఱి
పోవుదురు. ఆమె అస్పృశ్యురాలు, వారెంత పరిశుద్ధులుగ
నుండినను హైందవులను సమీపింపరా దనియెను. ఇట్టివారల
బాధలు చాల ఘోరమైనవి. చాల విచారకరము.

బ్రిటిషు ప్రభుత్వము వచ్చినపిదప అస్పృశ్యులకుఁగల
బాధలు కొంచెము కొంచెముగ తీరుచున్నవి. తమసోదరు
లను బహిష్కరించి వారలస్వాతంత్ర్య మపహరించిన హైంద
వులకు పరప్రభుత్వమునుండి స్వాతంత్ర్య మెట్లులభింపఁగలదు?
హైందవులు తమసోదరులను అస్పృశ్యులుగ పరిగణించుట
యొక్క ఫలితముగ క్రైస్తవమతము వృద్ధిం జెందుచున్నది.
క్రీస్తుమతావలంబులగు పంచముల కస్పృశ్యతాదోషము లేక
పోవుచున్నది. దీనికి హైందవులే బాధ్యులు.

అస్పృశ్యతను మాన్పవలెనని రాజకీయ నాయకులు బిగ్గరగ మాటాడుదురే కాని ఆచరణశూన్యు లగుచున్నారు. బ్రహ్మసమాజ మనునది అస్పృశ్యుల సంకటముల నివారింపఁజేయుచున్నది. బ్రిటిషు ప్రభుత్వమునుదీనికి సహాయభూతముగ నున్నది.

భారతీయుల యభివృద్ధికి అస్పృశ్యత తప్పక యుండవలెనని యొక వైదికప్రముఖుఁడు నుడివెను.

అస్పృశ్యులు హైందవులా? దీనిని గుఱించి సర్ హోల్డర్నస్‌గా రిట్లు నుడివియున్నారు. "పదివత్సరములకు పూర్వము పైప్రశ్న కలిగియుండిన పైజాతివా రనఁబడువారు అస్పృశ్యులు హైందవులు కారనియే చెప్పియుందురు. కాని యిపు డట్లు గాక కొందఱు పై తరగతులవారు అస్పృశ్యుల హైందవు లనియె చెప్పుచున్నారు గాని, తమకుఁగల స్వతంత్రతవారి కీయ నిరాకరించుచున్నారు. ఈవట్టిమాటలతో ప్రయోజనము లేదు. అస్పృశ్యులు హైందవులే యగునెడల సమస్వాతంత్ర్య మీయఁబడవలెను." వీరివాక్యము లెంతయు సత్యములు.

ఇట్లు పీడింపఁబడు పంచములను ఇస్లాంమతే మాహ్వానించుచున్నది. విద్యను, నేర్పించుటకును, మిగిలిన సౌకర్యములను గలుగఁజేయుటకును ఏర్పాటుచేయుచున్నది. ఎవ్వఁడైననొకపంచముఁడు మతాంతరుఁ డగునేని నాఁటితో హైందవులపీడ వానిని వదలినట్టే.



1917 లో ఇండియామంత్రి మాంటేగు ఢిల్లిలో విడిసియున్నపుడును, చెన్నపురిలో నున్నపుడును పంచములు రాయబారము వెళ్ళి తమస్థితిగతుల నెఱిఁగించుకొనుటలో, రాజకీయ సంస్కరణములను ఎక్కువగ ప్రసాదింపరాదనియు, అట్లుచేసినచో తమ్మింకను నడుగునకు త్రొక్కివేయుదురనియు విన్నవించుకొనిరి.

మఱియు ఆదిద్రావిడసభవారు మాంటేగుగారివద్దకు రాయబారము వెళ్ళి యిట్లు విన్నవించుకొనిరి. "పై జాతిహైందవులు మమ్ముల నధికముగ పీడించుచున్నారు. మేము లేకున్నవారు బ్రదుకఁజాలరు. వారిపొలములలోఁ బనులు చేసివారికెట్టికష్టములు లేకుండ పంటలఁ దెచ్చియిచ్చుచున్నాము. పండినవానిలో ఎన్నోవంతో మాకిచ్చుచున్నారు. అది, ఒకపూటగంజికైనను చాలుట లేదు. బ్రిటిషుప్రభుత్వము వచ్చిననాఁటినుండియు మాస్థితి కొంచెము పురోవృద్ధిని బొందుచున్నది. పాదిరీలు మాయెడ అపారప్రేమనుజూపుచున్నారు. కాని, హైందవులు అడ్డుదగులుచున్నారు. అగ్రవర్ణులు స్వరాజ్యమును కోరుచున్నారు. దానిని మే మాక్షేపించుచున్నాము. స్వరాజ్యము వచ్చిన మాస్థితి చాల హీనదశకు వచ్చును. మాకు విద్య, జాతీయస్వాతంత్ర్యము కలుగువఱకు బ్రిటిషువారు, ఈదేశమును వదలఁగూడదు. స్వరాజ్య మీయకుండుటకై యెంతైనను మేము ప్రయత్నించెదము."

1921 సం॥ము యువరాజు వచ్చినపుడును హైందవులు

గాంధియాజ్ఞ చొప్పున యువరాజును బహిష్కరించినను పంచములు వెళ్లి యువరాజును దర్శించి సంతోషించిరి.

---

## పంచదశాధ్యాయము.

---

**బ్రాహ్మణుల వంచన :—**

హైందవుల కేల నిర్బంధవిద్య నేర్పఁబడఁగూడదు ? అట్లు చేసినఁగాని హైందవులు విద్యావంతులు కాఁజాలరు. ఇంగ్లండుదేశమున చాలకాలమునకు పూర్వమే నిర్బంధవిద్య నేర్పాటుచేసిరి గాన నక్కడ జనసామాన్యము విద్యావంతులుగనే యున్నారు. హిందూదేశమున నిర్బంధవిద్యను ప్రవేశపెట్టినచో బ్రిటిషువారి కిబ్బంది గలుగు నని రాజకీయవాదులు నుడివెదరు.

నేను చెన్నపురి కేఁగినపుడు బ్రాహ్మణేతరనాయకుఁడగు పనగలు రాజుగారితో నీవిషయము చెప్పఁగా నాయన కోపముతో నిటు లనెను.

"ఇట్లు మీతో నుడివిన దెవరు ? పూర్వకాలమున విద్యయంతయు బ్రాహ్మణులే వశపఱచుకొనియుండిరి. ఎవరైన బ్రాహ్మణేతరుఁడు చదివినచో వానిచెవిలో సీసము కాఁచి పోయుట కధికారము గల దనుచుండిరి. విద్యను గడింప నర్హులు బ్రాహ్మణులే యనుచువచ్చిరి. కొన్నిదినములకు నవాబుప్రభుత్వము వచ్చెను. అప్పటికి వీరియాధిక్యము కొంత తగ్గెను. బ్రిటిషుప్రభుత్వము వచ్చినపిదప విద్య అందఱికిని సమానమాయెను."

"ఇతరులు విద్యావంతులైనచో తనయాధిక్యము తగ్గిపోవునని బ్రాహ్మణుఁడు భావించి యెవ్వరికిని విద్య చెప్పింపకుండె" నని శ్రీ దూఁభాయి నుడివిరి.

బ్రిటిషుప్రభుత్వము వచ్చినపిదప అర్ధశతాబ్దికి ఇంగ్లీషు పాఠశాలలు హిందూదేశమున రాజా రామమోహనరాయలును, డేవిడ్ హేర్ అనువారును ప్రథమమున స్థాపించిరి. 1887 సంవత్సరమున నీ పాఠశాల లన్నిరాష్ట్రములందును వ్యాపించినవి. 1923-24 లో బి. ఏ. పట్టములఁ బడసినవారు 11222 అని లెక్క తేలెను.

ఆంగ్లభాషాకోవిదులు, పలువురు భారతయువకులు పనిలేక కష్టపడుచున్నారు. అందులకు ప్రభుత్వమే కారణ మని రాజకీయనాయకులు నుడివెదరు. సర్వకళాశాలలను సర్కారువారు నడపుచున్నారు కాన నుద్యోగములనుగూడ వారే యీయవలెను. అట్లు లేనిచో ప్రభుత్వము నప్పగించి పోవలెనని యందురు.

ప్రారంభవిద్యను ప్రవేశపెట్టినను అన్నిరాష్ట్రముల యందును సమముగ సాగుటలేదు. కొన్నిస్థలములలో క్రమముగ సాగుచున్నది. ద్వంద్వప్రభుత్వమున హైందవులే మంత్రులుగ నేర్పఱుపఁబడిరి. స్థానికసభలును భారతీయులకే యొప్పగింపఁబడెనుకాని పరిపాలన క్రమముగ సాగ లేదు. దానిచే పరిపాలనక్రమ మెఱుఁగ లేదని స్పష్టపడుచున్నది.

నిర్బంధవిద్యాశాసనము ప్రవేశపెట్టఁబడినపుడు పాంచాలురు, అస్పృశ్యులు తప్ప మిగిలినహైందవులకే వర్తింపఁజేయవలె నని కోరియుండిరి. వీరికోరిక యెంత పారమార్థికమైనది! తుదకు ప్రభుత్వ మాకోరిక నంగీకరింపలేదు.

ఫిలిపైను-ఇండియా:—

మన అమెరికనులు ఫిలిపైనులో విద్య వ్యాపింపఁజేయ నెంతయో పని చేయుచున్నారని తలఁచుచున్నారు గాని బ్రిటిషువారు మనకంటె నెన్నోమడుంగులు ఇండియాలో విద్యాభివృద్ధికై పాటుపడుచున్నారు. ఫిలిపైనులో 87 విధభాషలే యెక్కువ యనుచుండ ఇండియాలో 222 భాషలు కలవు. 50 విధలిపులు గలవు. కాని హిందూదేశమున చక్కనిజ్ఞానము నియ్యఁగలగ్రంథములు లేవు. దీనిచేతనే పాఠశాలలలో విద్య వ్యాపించుటలేదు. ఫిలిపైనులో జాతివ్యత్యాసము లేదు. ఇండియాలో 3000 జాతులు గలవు.

హైందవులు జ్ఞానమును వాంఛించుటలేదు. పాఠశాల వదలినవెంటనే ఉద్యోగమునకుఁ బ్రయత్నించెదరు. ఈభావముతోనే విద్యాభ్యాసమునకుఁ గడంగుచున్నారు. ప్రభుత్వమువారు రాజకీయజ్ఞానమువకై విద్య నేర్పాటు చేయఁబ్రయత్నించినను ఉద్యోగమునే హైందవులు వాంఛించుచున్నారు.

హిందూదేశములో విద్య వ్యాపింపకుండుటకుఁగల కారణము దారిద్ర్యమనియే సాధారణముగ భావించుచున్నారు. మఱియు రాజకీయవాదులు దీనికి ప్రభుత్వమువారే



కారణ మనుచున్నారు. నేను విద్యావిహీనతయే దారిద్ర్యమునకు కారణ మనుచున్నాను. మఱియు నిర్బంధవిద్యను ప్రచారమునకు తేకున్నారు. దానికి ప్రభుత్వము కారణము కాఁజాలదు.

మఱియొక విషయము గలదు. హిందూదేశజనసంఖ్యలో 100కి 90 మంది గ్రామవాసులు. విద్య నార్జింపఁగల సాధనము గ్రామవాసులకు తక్కువ. వారలకు విద్యాసౌకర్యములను గలుగఁజేయువఱకును హిందూదేశమున విద్యాభివృద్ధి కానేరదు. దానికిఁ దగినప్రయత్నము లాచరించి గ్రామములలోని స్త్రీపురుషులను విద్యావంతులనుగఁ జేయవలెను. స్త్రీలకు విద్య నేర్పుటకు స్త్రీఉపాధ్యాయినులు దొరకు టరుదు. ఇదే స్త్రీవిద్య కాటంకము. స్త్రీలలో విద్యావతులు లేకుండుటకు కారణము బాల్యవివాహమును, శీఘ్రగర్భధారణమునే. పలురాష్ట్రములలోఁ గల విద్యాశాఖాధికారులగు హిందూమహమ్మదీయు లీయభిప్రాయమునే నాతో వెల్లడించిరి.

హిందూదేశమునఁగల స్త్రీబోధకురాండ్రు సామాన్యముగ క్రీస్తుమతస్థులై యున్నారు. వీరు గ్రామములలోని పాఠశాలలకుఁగూడ విద్యాబోధనకై వెడలుచున్నారు. కాని వీరు ఊరిలోఁగల గొప్పవారి స్త్రీల కాశింతు రేని వారి కడ్డు చెప్పఁగూడదు. అటు లుండిననే బ్రదుకఁగలరు. లేనిచో నాదినమే ఆయూరు వదలి పోవలసినదే. అట్లుగాక కొందఱు తమపోషణను కోరియో లేక మఱేకారణములచేతనో అట్టివారికోరిక

లకు లోఁబడి ప్రవర్తించుచున్నారు. ఇటులే మంత్రసానులగతియు సంభవించుచున్నది.

తన కష్టములఁగూర్చి పైయధికారుల నొకతె యెఱుకపఱచునేని దానికష్టమెక్కు వగునేకాని తగ్గనేరదు.

ఇట్లు గ్రామములకు వెడలు స్త్రీబోధకురాండ్రను గ్రామవాసులు పీడింతురేని విద్య యెట్లుగ్రామవాసులకుఁ బ్రాకఁగలదు? ఇట్టిస్థితిలో స్వరాజ్యమును గోరుచున్నారు. ఇది యెట్లు సంభవమో దురూహము.

వివాహితలగుస్త్రీలు ఉపాధ్యాయినులుగ పోవుట కేఁ జంకుచున్నారని యడుగవచ్చును. కాని యట్టిస్త్రీకి భర్తకు సేవచేయుటకే కాలము చాలకుండ నున్నదనఁగా నామె బోధకురాలుగ నెట్లు పనిని జేయఁగలదు? అదిగాక అవివాహితలగు స్త్రీలు బోధకురాండ్రుగ పోయినచో మానభంగము గలుగటతో అంత మగుచున్నది.

బాలవితంతువు లేల బోధకురాండ్రుగ పోఁగూడదని యడుగవచ్చును. వారు సామాన్యముగ గ్రామములకుఁ జనుట కిష్టపడరు. మరియు మానభంగమున కొప్పుకొనరు.

ఇట్టి కారణములు స్పష్టముగఁ గనుపించుచుండ దారిద్ర్యమును, ప్రభుత్వమును కారణము లని లాలాజీ, జిన్నా మున్నగునాయకులు నుడువుట పరిహాసాస్పదము గాదా?

గ్రామసీమలయందు తమబిడ్డలను పాఠశాల కంపునపుడే యేకలెక్టరుకచ్చేరిలోనో తాలూకా కచ్చేరిలోనో గ



మాస్తా పని కావలెననుభావముతోనే పంపుచున్నారు. ఈభావమే వానికి బాగుగ నాటిపోవుచున్నది. దీనిచే వానిబుద్ధి మందమై గుమాస్తాపనికితప్ప మరిదేనికిని వానివిద్య పనికిరాకపోవుచున్నది.

ఆంగ్లవిద్య నభ్యసించి ఉన్నతోద్యోగములయందున్నవారు మరల తమజీవితకాలములో తమగ్రామములకు వెడలుటలేదు. విద్యాభ్యాసమునకై నగరమునకు వచ్చినవారు తమ గ్రామములనే మఱచిపోవుచున్నారు.

గ్రామస్థులవిద్యయందు వీరికి శ్రద్ధ యుండినచో నెంతయో బాగుగానుండును. కాని గ్రామప్రజలు విద్యావంతులైనచో వీరికి పలుకుబడి యుండదని వీరు భావించుచున్నారు. వ్యవసాయకులు విద్యావంతులైనచో తమభూములవ్యవసాయముచేయువా రుండ రనియు వీరిభీతి. గ్రామవాసులకు విద్యలేనందు కిదియు నొక కారణమే. మఱియు గ్రామోపాధ్యాయులు ఎక్కువవిద్యావంతులు కారు. అందుచే గ్రామప్రజల పురోవృద్ధికి వీరు తోడ్పడఁజాలకున్నారు. గ్రామవాసులు తమవిద్యావిషయమై తామే శ్రద్ధ తీసికొనినఁగాని ప్రయోజనమును బొందఁజాలరు. ప్రభుత్వ మెంతయో ప్రయత్నించుచున్నను, వారలకే శ్రద్ధ లేకున్న ప్రయోజనము లేదు.

యువకులు రాజకీయాందోళన చేయుటకంటె గ్రామప్రజలవిద్యావిషయమై పాటుపడిన బాగుగానుండును గదా యని మహాత్మ గాంధిగారితో నంటిని. స్వరాజ్యము వచ్చినం

గాని విద్య, ఆరోగ్యము మున్నగువానియం దభివృద్ధి గలుగ
నేర దని వారు నుడివిరి. పై ప్రశ్ననే వంగయువకులతో నంటి
ని వారు నిజమే, ప్రజలు నిద్రించుచున్నారు. వారిని మేల్కొ
ల్పుటకు ప్రసంగము లత్యావశ్యకములు. అట్లు క్రమముగ
వారికి రాజకీయవిషయములను తెలియఁజేయుట యువకులవిధి
గదా! అని వా రనిరి.

గ్రామస్థులకు రాజకీయములకంటెను విద్య అత్యంతా
వశ్యకము. విద్య యుండిన నేదైనను జేయవచ్చు నని విద్యా
ధికారు లనేకులు నా కెఱింగించిరి.

---

## షోడశాధ్యాయము.

---

**మహాత్మగాంధి-గోమాత:—**

సుందరోద్యానమునఁగల యొకఱాతి కట్టడమునందు
ఏకైకవసనధారియై రాటము వడుకుచు నొకముసలి కూర్చుం
డియుండెను. ఆయనయే గాంధి. ఇర్వురు ఆయన యేదో చెప్ప
చుండ వ్రాయుచుండిరి. నే నక్కడకు వెళ్లి అమెరికా కేమి
సందేశ మని యడిగితిని. రాటము-రాటపుధ్వని యని చెప్పి
యూరకుండెను. ఆయనయుపదేశ మేమిటో యని చూడ
మొదలిడితిని. అది యీక్రిందివిధమున నుండెను.

"బ్రిటిషుప్రభుత్వ మింతకాలమునుండి యున్నను ప్రజ
ల కేల దారిద్ర్యము వదలలే దని కొందఱు ప్రశ్నించుచు



న్నారు. దీనినిగుఱించి దీర్ఘాలోచన చేయుదురేని మన దేశ
మునఁ గల పశువులే కారణ మని తెలియఁగలదు. పశువు
లకు చాలినంత యాహారము దొరకకుండుటయు మఱియొక
కారణము కాఁగలదు.

పూర్వకాలమున పశువులను గోమాత యని భక్తితో
కాపాడుచువచ్చిరి. గోవుకంటె నుత్తమమృగము మరే
దియు లేదనియు, గోహత్య మహాపాతక మనియు భావించు
చువచ్చిరి.

ఒకపుడు సింధియామహారాజు ఇనుపదారిని తనరా
జ్యమున ప్రవేశపెట్టినదినములలో ఇంజనుక్రింద నొకగోవు
చిక్కి మరణించెను. దాని కామహారాజు పరితపించి జీవి
తాంతమువఱకు పాపపరిహారార్థము లెక్కలేనన్ని దానములఁ
జేసెను. రాజైనను కూలివాఁడైనను పశువును గోమాతగ
భావించుచున్నారు. మరణావస్థయందున్న హైందవుఁ డొకఁ
డు పశువుతోఁకను పట్టుకొనునేని స్వర్గమును బొందు నని
శాస్త్రము. వీని నన్నిటి ననుసరించియే గోవు నింటియందే
కాపాడుచున్నారు. ఇంటియందు గో వుండునేని యా గృహ
ము పరిశుద్ధమైనదనికూడ భావింతురు.

అశుద్ధులైనవారు గోక్షీరము, గోదధి, గోమయము,
గోఘృతము, గోమూత్రము వీనిని ప్రత్యేక ప్రత్యేకముగ
పాత్రలయం దుంచి ఒకటిగఁ జేర్చి త్రాగినచో పరిశుద్ధ
లగుదు రని శాస్త్రము. దీనినే పంచగవ్య మందురు"
శ్రీ అపిటూభాయిగా రిట్లు నుడివిరి.

“ గోవును పరిశుద్ధప్రాణిగ భారతీయులు భావించుచున్నారు. పశువులు మందగ నేఁగుచున్నపుడు పాత్రలతో వెంట నడిచి గోమూత్రమును గొని తెత్తురు. పరిశుద్ధికొఱకింటియందు చల్లుదురు. మఱియు త్రాగుదురు. యూరపుఖండమునఁగల గోమాంసభక్షకులను హైందవు లంటుటకును జంకుదురు. లండనునగరమునకుఁ జనియుండిన మహారాజొకఁడు చేతికి ముసుఁగు వేసికొనియే యటఁగల ప్రభువులతో కరస్పర్శను చేసెను. ఒకనాఁడొక యువతితో కరస్పర్శను చేసి పిదప నాముసుఁగును తీసివేసెను. అపుడు చేతివ్రేళ్లలోఁగల ఘొకరాళ్లయుంగరము మెఱపుతో కనఁబడెను. ఆ యుంగరమును నేను జూడవచ్చునా యని యాయువతి యడుగ నారాజు దానినిదీసి యెదురుగనున్న పళ్లెమునందుంచెను. ఆమె చూచిన పిదప నతఁడు దానిని కడిగించి మరలఁ దొడిగికొనెను. ఇట్లు హైందవులకు గోవనఁగా నంతభక్తి యనుటకే యివన్నియు వివరించితిని. ”

ఈ యభిప్రాయమునే మహాత్ముని శిష్యుఁడగు మహాదేవదేశాయిగారును వివరించియున్నారు.

మఱియు వీరు బ్రిటిషువారీదేశమునకు వచ్చినపిదప గోవృద్ధి తగ్గిపోయెను. ఈప్రభుత్వ మెంతమాత్రము గోవృద్ధికి తగినప్రయత్నమును జేయుటలేదు. హిందూరాజుల కాలమున నీపశువృద్ధి ఉచ్ఛదశయం దుండెను.

అక్కడక్కడ నిప్పుడిప్పుడు గోశాల లేర్పడియుండినను అవి ఈదేశమున కెంతమాత్రము చాలవు. హైందవు



లకు గోవు లత్యంతావశ్యకము. పెరుగు, నెయ్యి, పాలు మున్నగునవి యెక్కువగ నుపయోగించుచున్నారు. వ్యవసాయకులకు పశువు లుండనిదే వ్యవసాయము జరుగనేరదు. పట్టణములలో పాలవ్యాపారముం జేయు గొల్లలు పాలిచ్చువఱకు వానిని క్రమముగ రక్షించి పిదపను వానిని గమనింపక వదలివేయుదురు. అవి శుష్కించి లేచుటకును శక్తి లేని వగుచున్నవి.

గోవధ.

ముస్లిములు గోవధ చేయుటమూలమున భారతదేశమున హిందూ మహమ్మదీయులకు కలహము లేర్పడుచున్నవి. ఎక్కడఁజూచినను రక్తపాతములే. యుద్ధములే. వీనిని శాంతింపఁజేయుటకు ప్రభుత్వమునకు చాల శ్రమ కలుగుచున్నది. దీనికై ప్రత్యేకముగ పోలీసుల నేర్పఱుపవలసి వచ్చుచున్నది.

1925 వ సం॥ము నవంబరు 5 వ తేదీ యంగుయిండియాలో మహాత్ముఁ డిట్లు వ్రాసెను. “ప్రతి సంవత్సరము కుర్బానిపండుగనాఁడు వేలకొలఁది గోవులను వధచేయుచున్నారు. ఈ గోవు లన్నియు హైందవులకే చెందియున్నవి. వీరు తమపశువులను విక్రయింపకపోయినచో నింతవధ జరుగనేరదు. ”

ముస్లిములు పశువధ చేయుటకు హైందవులే కారణభూతు లగుచున్నారు. తమపశువులను హైందవులు విక్రయిం

పనిచో మహమ్మదీయుల కిది అసాధ్యమే. భారతీయులు జీవకారుణ్యముతోఁ గూడినవారని మే మనేక పర్యాయములు వినియుంటిమిగాని వారే యిట్లు చేయుచున్నా రని వినినపుడు నాకు చాల ఆశ్చర్యమును కలుగఁజేసెను. కొన్నిస్థలములలో ఎద్దులకు తోఁకలు కోయఁబడి యుండెను. అదేమి యట్లు కోయఁబడియున్న దే యని బెంగుళూరిలో నే నుండినపుడు ఒకరిని ప్రశ్నించితిని. అట్లు చేయకున్న బండిని త్వరగ లాగఁజాల వని యాయన బదులిడెను. హౌరాలోఁగల యెద్దు లన్నియు తోఁక కత్తిరింపఁ బడియే యుండును. నడువనిచో తోఁకను పెన వేయుదురు. మర్మస్థానమున కాలితో తన్నుదురు.

చెన్నరాష్ట్రమునఁగల యెద్దులకు వాఁత వేయుదురు. అది చాల క్రూరమే. బండినిండుగ సామానులను వేసి లాగఁజేయుదురు. ఇది చాల అన్యాయము. ప్రభుత్వమువారు దీనిని జాగ్రత్తగ పరిశీలించి హింసను మాన్పుటకై కొంతసిబ్బంది నేర్పాటు చేసియున్నారు. జీవదయగల హైందవులే యిట్లు చేయుచుండ మిగిలినవారిమాట లెక్కయేమి?

సామాన్యముగ ఆవు పాఁడి మానుటతోడనే కసాయి వానికి దాని నమ్మివేయుదురు.

దూడలు చనిపోయిన పశువులకు చనిపోయిన దూడల యొక్క తోలులోపల గడ్డినో లేక మరి దేనినో తూర్చి పాఁడి యావుముందుగ నిలిపి పాలను పిండుచున్నారు. చాల నీచకార్యమగు దీనిని హైందవులు చేయుచుండుట పాడిగాదు. దూడలకు సరిగ పాలియ్యని కారణమున నవి చనిపోవుచున్నవి.



గోవునొద్ద పాలు అయిపోవుటచే దానిని సరిగ గమనింపక తోలివేయుచున్నారు. అట్లు తోలివేయఁబడిన పశువులను కుక్కలు వీథులలో కఱచి చంపుచుండుటవలన నాకుక్కలను చంపుటకు మొదలిడిరి. ఇది యలహాబాదులో జరిగినది. మహాత్ముఁడు దీనిని గుఱించి వ్రాయుచు, "జీవహింస పాపమని హిందూమత మొప్పుకొనుచున్నది. కాని సాధారణ ప్రజలను హింసించు ప్రాణులను చంపుట మాత్రము జీవహింసకానేరదు" దీని కక్కడి వైదికులు మిక్కిలిగ కోపోద్రిక్తులైరి.

గోమాతకును హిందూమతమునకును సంబంధము గలదని హైందవులు చెప్పుచు మహమ్మదీయులతో కలహము పెట్టుకొందురు. కాని సామాన్య దృష్టి కివన్నియు నిజముగఁ దోఁచుట లేదు. జీవకారుణ్యమని చెప్పుచు పశువులకు మేఁత కూడ సరిగఁ బెట్టక వానిని జంపుచున్నారు. ఒకేదఫా చంపినను, అపుడపుడు హింసించి చంపినను హింసయే యగును గాని మరొకటి కాఁజాలదు.

ప్రభుత్వముచే హింసను మాన్పుటకై యనేక శాసనములు చేయఁబడియున్నవి. కాని యవి ప్రయోజనకారులగుట లేదు. ప్రజలుఅహింస యని పలుకుదురే కాని, అది క్రియలోఁ గన్పింపకున్నది. శాసనముల నమలు జరుపు ఉద్యోగులు హైందవులే యగుటచే నొకఁడు బండ్ల యెద్దును హింసించినను కనుపించుకొనుట లేదు. కనిపించుకొనినను వానివద్ద నొకటో రెండో రూపాయలతో ఉద్యోగికడుపు నిండుచున్నది

వంగదేశమున నీళ్లతొట్టెను బండ్లనింపి యెద్దులచే లాగింతురు. లాగకపోయినచో వానిని సూదులతో పొడుతురు. దీనిని నిషేధించుటకై 1926 సం॥ మార్చి 16 తేదీని శాసనము చేయఁబడినది.

గోవులు తగినపోషణ లేక వీథులయందు తిరుగుచున్నవని యిదివఱకే వివరించియుంటిని. అట్లు బాధపడు గోవులను అట్టిబాధలనుండి మాన్పుటకై వానిని చంపివేయుటకై పోలీసువారి కధికార మీయవలయు నని యొక చట్టము బొంబాయి శాసనసభలో 1926 సంవత్సరమున తేఁబడినపుడు దేవరనుసభ్యుఁడు ఇది శాసనమైనచో చాల కలఁతలు గలుగుననియు, కొంచెము వ్యాధితోనున్న వానిని చంపుటవంటి దిదియనియు ఖండించి మాటాడిరి.

దీనికి ప్రత్యుత్తరముగ ప్రభుత్వము తరపున మాంటుగోమరిగా రిట్లు నుడివియుండిరి. ''బొంబాయి వీథులలో నెన్నో గోవులు కాలువిఱిగియు, కృశించియు, రక్తము కారుచును పడియున్నవి. అవి యట్లు బాధపడుటకంటెను వానిని చంపివేయుట ఉత్తమము. అది హింస కానేరదు'' అనఁగా హిందూసభ్యు లందఱును దానిని తీవ్రముగ ఖండించిరి. అది హింసయే యగు ననిరి. అది యంతటితో నంత మొందెను.

పిదప మూఁడుమాసములకు వెనుక నట్టిశాసనమే మరల చర్చకు వచ్చెను. అపుడు ప్రభుత్వకార్యదర్శి యిట్లు నుడివెను. ''వీథులయం దనాదరముగ బాధపడుచుండు పశువులను



రక్షించుటకొఱకే యీ శాసనము తేఁబడినది. అట్టి పశువులకు ఖామందు లున్నచో వానిని రక్షింపవచ్చును. లేనిచో గోశాలల కంపవచ్చును. పోషించువారు లేక వీథులయందుఁగలయెంగిలాకులఁ దినుచు దారి కడ్డముగ పరుండి బండ్లరాకపోకల కడ్డుదగులుచున్న వానిని గుఱించి యిది తయారు చేయఁబడినది.''

ఇట్లు దానిపై వాదోపవాదములు జరిగినపిదప నదియొక కమిటీయోచనకు వదలఁబడినది.

ఇఁక దీని విషయమై హైందవుల కెంత శ్రద్ధ గలదో స్పష్టపడినదిగదా!

గోశాలలు :—

పై పేరుతో నచ్చటచ్చట కొన్నిశాలలు గలవు. అవి హైందవులచేతనే పరిపాలింపఁ బడుచున్నవి. ధనవంతులు పశువులను కొని గోశాల కిత్తురు. శాలాపరిపాలకులు వానివలన క్షీరము దొరకువఱకు వానిని రక్షించి పిదప కసాయివాని కమ్ముదురు. క్షీరము దొరకినపు డాక్షీరము నమ్ముదురు. దాన మిచ్చినవారు మరల దానిస్థితిగతుల విచారింపరు. క్షీర మిచ్చుకాలమువను వానికి సమముగ మేఁత వేయుట లేదు. ఇట్టిగోశాలల ననేకము చూచితిని. అందున్నపశువులు వాడి వత్తలై యున్నవి. జీవహింసకు వెఱచు హైందవులేల యిట్లు గోమాతను హింసించుచున్నా రని చింతించితిని. మేడలమీఁద ప్రసంగము లహింసను గుఱించి, పత్రికలనిం

వుట జీవకారుణ్యమును గుఱించి బోధించు హైందవులే యట్లు చేయుచుండుట నా కాశ్చర్యమును గలిగించినది. హైందవులు ప్రతిదానికిని మతమును దెత్తురు. నేను జూచివచ్చినగోశాల లన్నియు నిట్టిస్థితియందే యున్నవి. కొన్నిపశువులు ఆహారమును గని నాలుగు అయిదు దినములు గడచినట్లు గానవచ్చెను. కొన్నిదూడలు లేచుటకును శక్తిలేక పడియుండెను. గోసంరక్షణ లేకపోవుటచేతనే హైందవులకు చాలినన్ని పాలు దొరకకున్నవి.

ఇట్టిస్థితిలో హైందవులు మహమ్మదీయులు చేయుగోహత్యను గుఱించి హాహాకారిగ పోరుదురు. కాని హైందవులు మతము పేరుతో చేయు దుష్కృత్యముల కంతు లేదు.

---

## సప్తదశాధ్యాయము.

---

భరతఖండ పూర్వచరిత్ర:—

భరతఖండముయొక్క పూర్వచరిత్రనుగుఱించియును, ఆకాలమునాటి వైభవములను గుఱించియును హైందవులు నుడువుదంభోక్తుల మనము విని యేయుందుము. ఆకాలమున సర్వసస్యసమృద్ధమై, సర్వజనసుఖదాయకమైయుండె ననియు వచింతురు. ఇక్కాలమున బ్రిటిషుప్రభుత్వము వచ్చుటచేనవన్నియు మాఱి క్షామదేవత తాండవించుచున్న దనియు నందురు.



మఱియు తమ దేశములోఁగల సకలపీడలకును కారణభూతముగ బ్రిటిషుప్రభుత్వమునే చెప్పుదురు. ఇవన్నియు నాధారశూన్యమైన నిందావాక్యములే.

చరిత్రకారు లెందఱో ప్రాచీన హిందూదేశమున శాంతియనునదియే సున్నయని వ్రాసియున్నారు. బలవంతునికే అది కాలముగ నుండెను. మహారాజు రాజును, రాజు జమీందారును, జమీందారు జాగీరుదారుని పీడించుచుండిరి. ఎల్లకాలమును యుద్ధమే. క్రీ. శ 800 సం॥న అరేబియనులు హిందూదేశముపై దండెత్తిరి. క్రమముగ మహమ్మదీయులు కొన్ని వత్సరముల పిదప పూర్తిగ హిందూదేశము నాక్రమించిరి. 200 సం॥లు వారి యధీనమున నుండెను. మహమ్మదీయమత ప్రచారము తలయెత్తి తిరిగినది. అపుడు దక్షిణదేశమున, విజయనగరమహారాజు దాని నెదుర్కొని వారిచేమరణించెను. మొగలాయీచక్రవర్తులలో సాధువుగ నుండినవాఁడు అక్బరు చక్రవర్తియే. ఆయన రాజపుత్రకన్యకల నెందఱినో పరిణయమాడెను. హైందవుల కెట్టిహింసయు కలిగింపనివాఁ డీతఁడే. పిదపను కొందఱు మహమ్మదీయులు రాజ్యపాలన చేసిరి.

1761 సం॥వఱకు భారతదేశమున నెక్కడఁ జూచినను క్షామము, వ్యాధి, కలహము వీనితోనే నిండియుండెను.

మఱియు, నాకాలమున సామాన్య వ్యవసాయదారుని కష్టములను వివరించుట చాల కష్టము. వానికిఁగల ధనమును, స్త్రీలను దోచుకొనుచుండిరి.

ఆకాలమున సంచారముచేసిన ఫ్రెంచివారును, డచ్చివారును నిట్టి యభిప్రాయమునే తెలిపియున్నారు.

ఒకయూరినుండి మఱియొక యూరికి వెడలవలయు నన్నచో రస్తాలు లేవు. రాత్రిపడిన దొంగలభయమే. తమకుఁగల వస్తువులను భూమిలో పాతిపెట్టుచువచ్చిరి. ప్రయాణము చేయవలసివచ్చినచో నది యొక్కగండమనియే ప్రయాణికుఁడు భావించుచువచ్చెను. శాసనము లేదు. రాజులవద్ద దొంగలను శిక్షింపఁగల సామర్థ్యము లేకుండెను. ఇట్టి రాజుల పాలనలో భరతఖండ మాకాలమున పరితపించుచుండెను.

---

## అష్టాదశాధ్యాయము

---

### ద్వంద్వ ప్రభుత్వము:—

ఇట్లు పరితపించుచుండిన హిందూదేశమునకు బ్రిటిషువారును, ఫ్రెంచివారును వ్యాపారార్థమై వచ్చిరి. కాని యిరువురికిని పోటీ వర్తకమున పడినది. ఆకారణమున ఒకరిపై నొకరు నిందలు మోప మొదలిడిరి. తుదకు బ్రిటిషువారికే జయము గలిగెను.

పిదప హిందూదేశ క్షేమముకొఱకు బ్రిటిషు ప్రభుత్వ మెంతయో శ్రమపడెను. కాని వానిని వివరింప నక్కఱలేదు. ప్రస్తుతమెట్టి స్థితియందున్నదియు వివరించెదను. ప్రస్తుతము ప్రజాప్రతినిధులచేతనే బ్రిటిషుప్రభుత్వము జరుగుచున్నది. శాసనసభలు, కేంద్రశాసనసభలు వీనియందు హిందూదేశప్ర



జాప్రతినిధులే నిండియున్నారు. ఆదాయవ్యయములను తయారుచేసి శాసనసభకు ప్రభుత్వ మర్పించును. వా రంగీకరింపనిచో నది నిలువనేరదు.

ద్వంద్వప్రభుత్వ మిచ్చినప్పుడు గాంధిగా రడ్డుదగిలిరి. అనేకులు గాంధిపలుకుల విని శాసనసభలను బహిష్కరించిరి. పరిపాలనయందు నిర్వాహకశక్తిని గలిగించుటకే ద్వంద్వప్రభుత్వ మీయఁబడెను. కాని దానిని భారతీయులు గ్రహింపలేదు. పిదప కొన్నిదినములకు ఆఉద్యమ మడుగంటి శాసనసభాప్రవేశోద్యమము బయలుదేరెను. ప్రభుత్వకార్యముల కడ్డుదగులుటయే యీయుద్యమముద్దేశము. ఈప్రభుత్వమున ననేకములైనగొప్ప ఉద్యోగములు భారతీయుల కీయఁబడినవి. ఈఉద్యోగములకు నేను నే నని పోటీ వచ్చిరి. దీనిచే మతకలహములు ప్రారంభమైనవి.

ఇపుడు హిందూమహమ్మదీయకలహ మేర్పడినది. కొన్నిసంవత్సరములుగ భారతప్రభుత్వమును నిర్వహించుటే బ్రిటిషువారికి చాల దుర్ఘట మయినది. అయినను ఈపరిస్థితులలో ఐరోపీయులు రాజ్యపాలనమును నిర్వహించినట్లు భారతీయులు నిర్వహింపలేరు. అయినను ద్వంద్వప్రభుత్వము కొనసాగుచునేయున్నది.

ద్వంద్వప్రభుత్వమువిషయమై ప్రజాభిప్రాయ మెట్లున్నదని విచారించితిని. ఇది సామాన్యజనులకుఁగూడ చాల తృప్తికరముగ నున్న దనియే గ్రహింపఁగలిగితిని.

---

# ఏ కో న వి ం శా ధ్యా య ము.

---

స్వదేశప్రభువులు :—

హిందూ దేశమున స్వదేశసంస్థానము లనేకములున్నవి. ప్రతియొకసంస్థానమును ఒకహిందూప్రభువు పాలించును. విక్టోరియారాణి 18౫8 సం॥న నొక ప్రకటన వెలువఱించినది. దానికి స్వదేశప్రభువు లందఱును చాల సంతృప్తులైరి. దానియందు గౌరవముతోను, మర్యాదతోను స్వదేశప్రభువులు చూడఁబడుదు రని ప్రకటింపఁబడెను. తమయిష్టముచొప్పున తమ రాజ్యమును పాలించుకొనవచ్చును. వానియందు బ్రిటిషువారు జోక్యము గలిగించుకొనరు. ప్రతిసంస్థానమునకును రెసిడెంటు నియమింపఁబడియున్నాఁడు. స్వదేశప్రభువులు వైస్రాయితో నప్పుడప్పుడు సమాలోచన చేయుచుందురు. సామాన్యముగ ప్రతిసంస్థానాధిపతియు సత్పరిపాలనను చేయుచున్నాఁ డనియే వక్కాణింపవచ్చును. తమప్రజలక్షేమము నే యెక్కువగ వాంఛించుచున్నారు. కొందఱు దాంభికముగను, దుర్మార్గవర్తనముచేతను తమజీవితమును గడపుచున్నారు.

స్వదేశప్రభువులపై కొన్నినిందలు మోపఁబడుచున్నవి. అవి నమ్మఁదగినవి గావు. స్వదేశప్రభువులకు విరోధముగ దొరకు విషయములను పత్రికలు ప్రకటించి యొకవిధముగ అసహనమును ప్రజలయందుఁ గలుగఁజేయుచున్నవి. కాని యవి నిరాధారములు.

బ్రిటిషుప్రభుత్వమువిషయమై స్వదేశప్రభువుల యభిప్రాయ మెటు లున్నదియు నిట వివరించుట ముఖ్యము. బ్రిటిషుపాలన యుండినంగాని హిందూదేశము శాంతియుతముగ నుండనేర దని యొకసంస్థాన ప్రముఖుఁడు నా అమెరికా స్నేహితుని కెఱిఁగించె నని నుడివెను. మఱియు స్వదేశప్రభువులు తమ సైనిక బలమును వృద్ధిచేసికొనుచున్నారు. బ్రిటిషువారొకవేళ స్వయముగ దేశమును వీడి చనుదురేని స్వదేశప్రభువులు ఒకటిగ చేరి ప్రజలను ఇక్కట్టులకు లోను జేయుదురు. దీనిని దేశీయవాదులు గ్రహింపవలెను. పూర్వ మెట్లు హిందూదేశము స్వదేశప్రభువులచేతులలోచిక్కి కష్టపడినదో అట్టిస్థితియే మరల సంభవింపఁగలదు. ప్రభుత్వసేనలును స్వదేశప్రభువుల నెదిరించి యుద్ధము చేయఁజాలవు. దేశీయవాదులు శాసనసభలలో మునిఁగి తేలవలెనే కాని మఱొక గతిలేదు.

హిందూముస్లింవిచారము :—

బ్రిటిషువారు రాకపూర్వము మహమ్మదీయుల యాధిక్య మెక్కువగ నుండెనని యిదివఱకే యెఱిఁగించితిని. ప్రభుత్వముబాధ్యతవహించిన పిదప ఐరోపీయులకే ఉద్యోగము లన్నియు నీయఁబడుచుండెను. మింటోమార్లే సంస్కరణానంతరము హిందూమహమ్మదీయులకు సమముగ ఉద్యోగము లీయఁబడుచుండెను. అపుడు మహమ్మదీయులు తమ కెక్కువ అధికారము లీయవలయు నని ప్రయత్నించిరి. కాని స్వాంద వు లొప్పుకొనలేదు. దీనికి కారణము వివరించెదను. మహమ్మదీయులు ప్రథమమున తమ మతప్రచ్చారముకొఱకే హిం



దూదేశమునకు వచ్చిరి. రాజ్యపాలనమును చేకొని 200 ఏండ్లు నిరభ్యంతరముగ దేశమును పాలించిరి. అపుడు పారసీకమే ప్రధానభాషగ నుండెను. ఒక బ్రాహ్మణుఁడు పారసీకభాషలో పాండిత్యము సంపాదించునేని వానికి పెద్దపదవి లభించుచుండెను. అపుడును బ్రాహ్మణులే పెద్ద పెద్ద యుద్యోగముల వహించియుండిరి. బ్రిటిషువారు వచ్చిన పిదప రాజభాష ఆంగ్ల మయ్యెను. అపుడు మహమ్మదీయులు పెద్ద ఉద్యోగముల వహించుటకు వీలు లేకపోయెను. పారసీకము తప్ప మిగిలిన భాషను నేర్వఁగూడ దనికూడ మతము విధించుచున్నదను పట్టుదల గలవారు. మిగిలినమతమువారు పెద్ద ఉద్యోగముల వహించుట వీరు సహింపలేకపోయిరి.

పిదప 1919 సం॥ న సంస్కరణము లీయఁబడెను. అపుడును మహమ్మదీయులు ప్రత్యేకస్వాతంత్ర్యములకు ప్రయత్నించిరి. అపుడే యిరువురికినిగల ఐకమత్యము చెడినది. అప్పటినుండియు ఇరువురిమధ్య కలహములు పెరుగుచునేయున్నవి. కాని మరల ఐక్యము కలిగినదిగాని దీర్ఘకాలముండ లేదు.

మాపిళాలకలహము:—

కేరళమున మాపిళా అని యొకజాతి గలదు. వీరు అరేబియనులకును మలయాళస్త్రీలకును బుట్టినవా రని ప్రతీతి. వీరు ఒకలక్షమంది యున్నారు. వీరు వీర్యవంతులును బుద్ధిశాలులు నైనవారు. తమయింటిని మిగుల పరిశుద్ధముగ నుంచుకొనెదరు. వీరికి మతముపట్టుదల యధికము. మతదూషకులను చంపుటవలన వీరికి మోక్షము రాఁగల దని వీరినమ్మిక.



1921 సం॥ కేరళదేశమున రాజకీయప్రచార మెక్కువగ జరుగుచుండెను. ప్రభుత్వవిరోధమును వీరియందు ప్రచారకులు కలుగఁజేసిరి. “బ్రిటిషువారు ఇస్లాంమతవిరోధులుగ నడచుకొనుచున్నారు. వారిని వెంటనే దేశమునుండి వెడలనడఁచి స్వరాజ్యమును స్థాపింపవలయు” నని ప్రచారకులు బోధించిరి. ఇది తీవ్రముగ వ్యాపించినది. హిందూస్వరాజ్యమునకును, మహమ్మదీయస్వరాజ్యమునకును నెంతో వ్యత్యాసము గలదు. విగ్రహారాధకులఁ జంపుటయే మహమ్మదీయస్వరాజ్యమని వారు భావించిరి. 1921 సం॥ ఆగస్టు 20 తేదీ నిది బైటికి వచ్చెను. ప్రథమమున నొకయూరోపీయుఁడు ఈయుద్యమమున కాహుతి యయ్యెను. రస్తాలను కట్టివేసిరి. తంతులను నఱికివేసిరి. హైందవులసంఖ్య మహమ్మదీయులకంటె నెక్కువగ నుండినను వీరి నెదిరించుట కష్టమయ్యెను. హిందూస్త్రీలను బలాత్కారముగ మహమ్మదీయమతమునఁ జేర్చుకొనిరి. పురుషులను ఇటులే బలవంతపెట్టిరి. ఎర్నాడుతాలూకాలో హైందవులు 900 మహమ్మదీయమతావలంబు లైరి. మరల హిందూమతము నవలంబింపఁగోరినవారు ఎక్కువగ దక్షిణల పురోహితుల కీయవలసిన వారైరి.

1921 సం॥ము ఫిబ్రవరి 4 తేదీని దేశీయబాలభటులు చౌరీచౌరాలో పోలీసుస్టేషనులను వశపఱచుకొని యనేకులను

కాల్చిరి. కొందఱిపై నూనె పోసి యంటించిరి. ఎల్లప్పుడు ఏదో కలహము జరుగుచునేయున్నది. ఇటు లుండ హిందూదేశమునకు స్వరాజ్యమును వాంఛించుచున్నారు.

ఒకటి రెండు విషయములతో నీపుస్తకమును ముగించుచున్నాను. హిందూదేశక్షామమునకు కొన్ని కారణములనిదివఱకే వివరించితిని. హిందూదేశమున పండుప్రత్తి ఇంగ్లండునకుఁ గొనిపోఁబడి బట్టలుగ తయారై వచ్చుటయే క్షామకారణ మనికూడ చెప్పుచున్నారు. ఇది నిరాధారము. ఇండియాప్రత్తి ఉత్తమమైనది గాఁజాలదు. లంకాషైరుకు కావలసిన ప్రత్తి అమెరికానుండియే వచ్చుచున్నది. ఇండియాప్రత్తి దీపపువత్తివంటి మోటువస్తువులు తయారుచేయుటకే యుపయోగించుచున్నది. కాన నిది నిరాధారము.

మఱియు, రైల్వేలకై ఇండియాలో విశేషధనము వెచ్చింపవలసియున్నది. వారిసాహాయ్యమును గమనింపక నిందించుట న్యాయముగాదు. క్షామమునకు హైందవులడాంబికపు ఖర్చె కారణము. వివాహకాలమునను, మిగిలినసమయమందును నెక్కువగ ఖర్చుచేయుటయే ఇందులకు కారణమనవచ్చును. వ్యాపారులును ధాన్యమును జాగ్రత్తచేసి యెక్కువ ఖరీదునకమ్ముచున్నారు. ఇట్లు చేయుటచే దినదినము క్షామ మెక్కువగుచున్నది.

ముగింపు.

భారతదేశస్థితి యున్న దున్నట్లు వివరించితిని. దీనిని



పఠించు హిందూసోదరులు ఇవన్నియు నబద్ధ మనవచ్చును. అట్లు ఋజువుచేయుట కెవ్వరును ముందునకు రానేరరు.

కొన్ని విషయములు వ్రాయకయే వదలితిని. ఇచట వ్రాసినవానిలో కొన్ని పాశ్చాత్యదేశములోనను గలవనుట నిశ్చయము. అయినను హైందవులు చాల వెనుకఁబడియున్నారనుటయే నాయుద్దేశము.

భారతీయులు సావకాశముగ నాలోచింతురేని నివన్నియు నిజమని వారికే బోధపడఁగలదు. నిజము చెప్పుటలో దోషములేదని విజ్ఞులు నుడువుదురు. అదియే నాధైర్యము.



# మిస్ మేయో గ్రంథఖండనము.

# మిస్ మేయో గ్రంథఖండనము.

## 1 అధ్యాయము.

### జా తి దూ ష ణ ము.

కేధరైను మిస్ మేయో అను అమెరికాదేశపు అబలాశిరోమణి ? భారతదేశమున ఒకసంవత్సరమున శీతకాలమునందు మూఁడునాలుగు మాసములు ముచ్చటగ ప్రచారము సలిపి భారత స్వాతంత్ర్య విద్వేషుల వలనను, ప్రభుత్వోద్యోగుల వలనను, ఆసుపత్రుల యందలి వైద్యుల వలనను కొంత తెలిసికొని అందుండు రోగులసంఖ్య, రోగముల వివరములు మున్నగుని వేదికలలో తన కుపచరించువిషయములను పరిగ్రహించి తద్విషయములనే యాధారములుగఁ జేసికొని ‘భారతమాత’ యను పవిత్రనామ మిడి జగద్విద్వేషపూరితమగు నొక మహాగ్రంథమును రచియించి ప్రకటించినది. ఆగ్రంథమును చదివినతోడనే ప్రతిదేశమందును సంక్షోభ ముదయించెను. ముప్పదికోట్ల భారతీయులును క్రోధావేశ పరవశు లైరి. భారత నాయకులు వెంటనే ఖండన వ్యాసములను రచియించి పత్రికలలోనింగ్లండునందును, హిందూదేశమునందును మేయోకన్యగారి గ్రంథమునందుఁ గల అసందర్భములను అసత్యములను అన్యాయములయిన దోషారోపణములను ప్రకటించిరి. శ్రీయుత సి. ఎస్. రంగయ్యరు

ఎమ్. ఎల్. ఏ. గారు, ఈగ్రంథ ప్రచురణకాలమున నింగ్లండులో నుండుట తటస్థించెను. వీరు 'కుక్కకాటునకు చెప్పుదెబ్బ' యనునట్లు 'భారతజనకుఁడు' అను నొక యుద్గ్రంథమును రచించి మేయోకన్యయొక్క 'భారతమాత'కు ప్రత్యుత్తర మొసంగి దేశమున కెంతయు సేవ నొనర్చిరి. 'భారతమాత' యను మేయోకన్యగారి గ్రంథమునకు 'భారతజనకుఁడు' అను రంగయ్యరుగారి గ్రంథము నిజముగ భర్తవంటిదే యని చెప్పనగును. భారతమాత అను గ్రంథమునందుఁ గల మేయోకన్యయొక్క అసత్యములను, బూటకములను, పక్షపాతబుద్ధితోఁ గావించిన ప్రకటనముల నెట్లు శ్రీయుత రంగయ్యరుగారు ఖండించిరో వివరించుచున్నాము.

1925–26సం॥న. పశ్చిమదేశవాసు లిరువురు హిందూదేశమును చూడవచ్చిరి. అందు విద్యావివేకములు గల ఆంగ్లేయుఁ డొకఁడు. మాయావినియగు అమెరికా కన్య రెండవది. ఈతఁడు "జెస్టింగ్ పైలేట్" అను గ్రంథమును వ్రాసెను. ఈగ్రంథము నతఁడు సదుద్దేశముతోడనే వ్రాసెను.

అమెరికా ప్రచారిణియగు మేయోకన్య అపహసించు రీతిని తనగ్రంథమునకు 'భారతమాత' యని నామకరణ మొనర్చెను. ఈభారతమాత యనుపవిత్ర నామమువలననే భారతీయనాయకులు తమప్రజలలో దేశభక్తిని, రాజకీయ ప్రబోధమును గలిగించుచున్నారు. దీనినే భారతవిద్వేషులు విషతుల్యముగాఁ జూచుచున్నారు. అటువంటివారిలో మేయోకన్యగా రగ్రగణ్యులైరి. మహోత్కృష్టమును, అమాయిక



మునునై విలసిల్లునీ హైందవజాతిని మేయోకన్య ఈగ్రంథముమూలముననే దూషించినది.

పూర్వము న్యూయార్కు పట్టణమందు దూషణ మనునది యొకగొప్ప నేరముగా పరిగణింపఁ బడుచుండెను. జాక్ అడమ్సాను అనునాతఁడు గౌరవనీయులను కొందఱిని దూషించినందులకు న్యూయార్కు ప్రభుత్వ మాతని నాలుకను కాల్చిన యినుపకడ్డీతో కాల్చి ఆరాష్ట్రమునుండి తఱిమివేసెను. ఇవి పూర్వకాలపు పుక్కిటి పురాణము లయ్యెను. నూతనన్యూయార్కు పట్టణమున దూషణ యొనర్చువారి కే విధమగు భయమును హానియు నీకాలమున లేవు. అందును ప్రాచీనజాతులను దూషించినతఱిని బొత్తుగా లేవు.

మేయోకన్య లండనులోనుండు ఇండియాఆఫీసునకును, హిందూదేశములోని ప్రభుత్వ మందిరములకును బోయి తన ఉద్దేశములను వారి కెఱింగించెను. ఈమె అవివేకురాలు కాదు. ఈమె రంగుప్రజలు స్వాతంత్ర్యమున కనర్హు లని చాటుటకు నడుముకట్టుకొన్నది.

ఒకజాతి యంతటిమీఁదను దోషారోపణ మెవరైనను చేయఁగలరా యని బర్కుగారు ఆశ్చర్యపడిరి. కాని; అతఁడు 18వ శతాబ్దిలోనున్న బ్రిటీషుపూర్వికుఁడు. మేయోకన్య యన్ననో ముందడుగు వేయుచున్న అమెరికా దేశస్థురాలు. ఈమె 21వ శతాబ్దిలో నుండవలసినకన్య యని పిలిపించుకొనుటకు కోరికగలదై యున్నట్లున్నది.

పూర్వ మేది యెట్లున్నను ప్రస్తుతమున వంగరాష్ట్రమున విప్లవోద్యమము లేదు. నిజమగు ఆంగ్లేయులుకూడ దీని నొప్పుకొందురు. రష్యను కరపత్రములను కలకత్తావీథులందు పంచిపెట్టెద రని అమెరికనుకన్య దెలిపినది. అందుచే వీరికేసులను కోర్టులందు విచారింపకయే, ఖైదీలుగ తీసికొని పోవుచున్నారట! అవును. భారతప్రభుత్వము, వంగరాష్ట్రప్రభుత్వము, సంబంధములేని అమెరికా కన్యయును వంగరాష్ట్రమున విప్లవము కల దని చెప్పినపిమ్మన కేసులను బహిరంగముగ విచారణ ఏల సలుపవలెను? అద్దానిని ఖండించుట కెవరికి శక్తి గలదు? వారు మితవాదులే కానిండు, రాజభక్తులే కానిండు, భారతీయు లందఱును అసత్యవాదులే. వారిమతమే వారి నట్లు చేసె నని మనకన్యగారు తెలుపుచున్నారు.

విప్లవకారుల కేసులను విచారణచేయుటకు తగినసాక్ష్యము లేకకా దనియు, బహిరంగముగ కోర్టులందు విచారణ మొనర్చిన యెడల జడ్జీలను తుపాకులతోఁ గాల్చి చంపుదు రనియు, సాక్షులను బాధించెద రనియు సాకు చెప్పిరి. నిజముగ నట్టి పరిస్థితులే కలిగినయెడల బ్రిటీషు ప్రభుత్వమువారు లండనులోనుండు శ్వేతభవనము (వైటుహాల్) నకు చాలకాలముక్రిందనే దయచేసి యుందురు. ఇందు సత్య మే మనిన? పోలీసువారి రికార్డుల నాధారముగఁ జేసికొని ప్రభుత్వమువారు కొందఱిని విప్లవకారు లని ఖైదీలుగఁ జేకొనిరి. అట్టిరికార్డులు న్యాయస్థానములందు విచారణలో నెగ్గఁజాలవు కావున నే బహిరంగ విచారణమును సలుప ప్రభుత్వమువా రంగీకరింపలేదు. ఇఁక సీపోలీసువా రెట్టివారనిన? మిస్ మేయోగారినే చెప్పనిండు. 'వారి జేబులను నింపుకొనునవకాశముల యందే వారి గొప్పధర్మము గలదు.'' అని ఆమె చెప్పినది. కీ॥ శే॥ దేశబంధు దాసుగారు మేయరుగాను, శ్రీయుత సుభాస్ చంద్రబోసుగారు కార్యనిర్వాహ కోద్యోగిగాను కలకత్తానగరమున నుండుతఱి సీపోలీసు ఉద్యోగుల కెట్లు డబ్బు చేకూరఁగలదు? సుభాస్‌బోసుగారు వీరికి లంచము లిచ్చునట్టివారు కారు. అట్టితఱిని వీరిని జైలులోఁ బెట్టి రన్న నాశ్చర్య మేమిగలదు? వీరి నేల జైలున కిడ్చిరో వీరికే తెలియదు. ఒకనాఁటి యుదయమున వీరిని చెఱసాల కకస్మాత్తుగాఁ గొనిపోయిరి. వీరితోఁగూడ మరికొందఱిని వంగరాష్ట్ర యువకుల నట్లే చేసిరి. జైలునందు బోసుగారి ఆరోగ్యము చెడి జీర్ణదేహులై యుండుతఱిని వీరిని ప్రభుత్వమువారు విడిచిపెట్టిరి. తక్కినవారిలో కొందఱింకను జైలునందే యున్నారు.



ప్రతిఖైదీని రహస్యముగనైనను విచారణ సలుపవలె నని హైకోర్టున్యాయమూర్తులను కోరిరి. కాని ప్రభుత్వమువా రట్లు చేయ నంగీకరింపలేదు. కాని మేయోకన్య హైందవ న్యాయమూర్తులు లంచగొట్టులని వారిని నిందించినది. న్యాయబుద్ధిగల న్యాయమూర్తు లెట్లు రహస్యముగ విచారణ మొనర్చుట కంగీకరింపఁ గలరు?

''అచ్చట విప్లవోద్యమము గలదు. దానికి కారణము అపరిమితమగు సంభోగవాంఛయు, తన్మూలమున సంభవించు వ్యాధులును'' అని మేయోకన్య వ్రాసినది. తమదేశము నెఱిం

గిన ప్రతి భారతీయుఁడును ఇదంతయు వట్టి కల్ల యని చె
ప్పును. ఇటువంటి వ్యాధిగ్రస్తులు, బలహీనులు, పిఱికిపందలు,
ఎట్లు విప్లవోద్యమమును లేవనెత్తి ప్రభుత్వమునకు భయ
మును కలుగఁజేయు చున్నారో గ్రహింప శక్యము కాదు.

మేయోకన్య పోలీసు అధికారియా? కాదు. సాధార
ణమైన అమెరికా దేశపు స్త్రీ యని యామెయే చెప్పుకొను
చున్నది. కాని యామెఒక యసాధారణవ్యక్తి యని చెప్పఁదగు
ను. ఆమెయొక్క వ్రాఁతలు అంతకంటె నసాధారణమైనవి.
అటువంటివాని నేల ప్రచురించినది? ఈమె నెవరైన నియో
గించిరా? లేదు, అని ఈమెయే చెప్పుచున్నది.

---

## 3 అధ్యాయము.

---

### బాలికలే తల్లులగుట.

“హిందూదేశమున బాలికలు 8 ఏండ్లు మొదలు 14 ఏం
డ్లవయసు లోపుననే పిల్లలను కనుట ప్రారంభింతురు. రజ
స్వల అయిన 9వ మాసములోనే శిశుజననము గలుగును.
8 ఏండ్ల లోపున బిడ్డలను గనుట అరుదైనను లేకపోలేదు.”
అని మేయోకన్య వ్రాసినది.

భారతదేశమున 8 ఏండ్ల వయసు బాలికలే సంతాన
వతు లగుట యనునది శుద్ధఅబద్ధము. 14 ఏండ్లకు గర్భవతు
లగుకన్య లున్నారు.



అతిబాల్య వివాహములను జేయుట భారతీయులసంప్ర
దాయము కాదు. వేదములు వీని కనుమతి నొసంగలేదు.
వేదము లన్నిటికంటెను పూర్వమునుండి వచ్చుచున్న శాస్త్ర
ములు. క్రైస్తవులకు బైబిలు ఎటువంటిదో హైందవులకు
వేదము లటువంటివే. మేయోకన్య వేదసంప్రదాయమును
తనగ్రంథమునం దెచ్చటను తెలియఁ బఱుచుటలేదు. ఏమన
వేదములవలన హిందూజాతి యెన్నివేలేండ్లనుండి పండితసంప్ర
దాయములతో విలసిల్లుచున్నదో తెలియును. హైందవులు
అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడును అడవిమనుష్యు లని నిరూపించు
టయే యీకన్యయొక్క ముఖ్యాభిప్రాయము. ప్రొఫెసర్
మేక్సిముల్లర్ గారివంటి పాశ్చాత్యపండితులు ప్రపంచోదయ
కాలమందే హైందవులకుఁ గలిగియుండిన నాగరకతను పాండి
త్యమును ఒప్పుకొనినారు. స్త్రీలు తమభర్తల నెన్నుకొను
చుండిరి. దమయంతి, సీత, మున్నగువారికి స్వయంవరవివా
హములే జరిగినవి.తరువాత గాంధర్వవివాహమున అర్జునుఁడు
సుభద్రను పెండ్లియాడెను.

ఈ కాలమునుండి స్త్రీల స్వాతంత్ర్య మెట్లు రానురా
ను తగ్గిపోయెనో కనుఁగొనుటకు మనకు తగినయాధారము
లు లేవు. స్త్రీ పురుషులమధ్య కొన్ని తగాదాలు పుట్టుచు,
క్రమేపి పురుషులు స్త్రీలపై నధికారము వహించి యుండ
వచ్చును. మహమ్మదీయుల రాకతో హైందవస్త్రీల స్వాతం
త్ర్యము పూర్తిగా నడుగంటినది. 19వ శతాబ్దిలో ఋషి, ద
యానంద సరస్వతిగారు స్త్రీలయభివృద్ధికి పాటుపడిరి. ఆర్య

సమాజమువారిలో 11, 12 ఏండ్ల బాలికలకు వివాహములు జరుపుట లేదు. రాజా రామమోహన రాయలు బాల్యవివాహము లొప్పలేదు. సిక్కులు 17 మొదలు 21 ఏండ్ల లోపున తమ బాలికలకు పెండ్లి గావించెదరు. బాల్య వివాహములను తఱచుగా చేయువారు మదరాసు రాజధానియందుఁగల బ్రాహ్మణులే. వీరైనను కొంతకాలమునుండి యీ మూఢాచారమును నిర్మూలింపఁ బ్రయత్నించుచునే యున్నారు. శ్రీనివాస శాస్త్రిగారు రజస్వలానంతరవివాహములను గూర్చి యొక చట్టమును శాసనసభయందు ప్రవేశపెట్టిరి.

రజస్వల యగుటకు పూర్వము జరుగునవి వివాహములు కావు. అవి ప్రధానమువంటివి. ఆపిల్లను రజస్వలయైన యనంతరముననే అత్తవారింటికి గర్భాదానమైన పిమ్మట పంపెదరు. అదియే నిజమైన వివాహము అనిపించుకొనును. ఇప్పుడమలులోనున్న వివాహము అయినతరువాత పెండ్లికుమార్తెయు, పెండ్లికొమరుఁడును కలిసికొనరు. గర్భాధానమునాఁడే కలిసికొందురు.

ఇఁక మేయోకన్యగారి దేశమగు అమెరికాలో నీ బాల బాలికల వ్యవహారము లెట్లున్నవో యించుక గమనించెదముగాక. లిండ్సే యనునొక యమెరికా జడ్జిగారే యిట్లు దెలుపుచున్నారు. అతఁడు మిస్ మేయోవలె పక్షపాతబుద్ధి గలిగి యిట్లు వ్రాసెనని తలంప నవకాశము లేదు. తనదేశస్థుల దుష్టాచారములను ఖండించి సంఘసంస్కరణ చేయుటకే తానిట్టి స్థితులను ఉన్నవి యున్నట్లుగఁ దెలిపెను. "పాఠశాల



కుఁ బోయెడు బాలబాలికా విద్యార్థులలో నూటికి తొంబది మంది నాట్యముల [డాన్సు] చేయుట, కౌఁగిలింతలు, ముద్దుపెట్టుకొనుటలు మున్నగునవి చేయుచుందురు. వారికి సరియగు వయసు రాకమునుపే యిట్టి యకార్యములు గావించినయెడల వారిమనోబలము మాయమైపోవును. నీచకుటుంబములలోని పిల్లలే యిట్లు గావించుట లేదు. ధనగౌరవములు గల కుటుంబములందుఁ గల పిల్లలును ఇదేరీతిని తమతలిదండ్రులకుఁగాని సంరక్షకులకుఁ గాని తెలియకుండ సంచరించుచున్నారు." అని లిండ్సేగారు వ్రాసిరి. మేయోకన్య నాట్యమును జేసి ముద్దుపెట్టుకొన్నంతమాత్రమున నేమి మునిఁగిపోయె నని అనవచ్చును. కాని అంతతో నవి కుమరలేదు. జడ్జీ లిండ్సేగారు; "ఈ బాల బాలికలు రహస్యముగ నాట్యములు సల్పుటయే కాక యాపై చర్యలను గూడ వీరిలో నూటికి తొంబది మంది జరుపుచున్నా"రని స్పష్టముగఁ దెలిపెను. "ఇట్టి క్రూర కృత్యములు సలుపుటవలన అమెరికా బాలబాలికల యొక్క దేహారోగ్యము, నీతి మార్గమును గూడ నీటఁ గలియుచున్నవి. రెండేండ్లలోపుగ నావద్దకు 500 మంది బాలికలైనను వచ్చిరి. వీరు ఏదో ఒక అవసరము గలిగియె వచ్చిరి. ఊరక నాదరి కెవ్వరును రారు, అట్లు వచ్చినవారిలో చాలమంది గర్భమును దాల్చి సలహాకు వచ్చియుండిరి. అవివాహితలై యెవని సంపర్కముననో వీరు గర్భిణులైరి. ఇట్టివారిలో చాలమంది వైద్యులవద్దకుఁ బోయి గర్భోత్పాతమును కలుగఁజేసి కొందురు. ఇటువంటి గర్భిణుల కేసులు నావద్దకు చాల

వచ్చుచుండెడివి. నేను నాకుఁ దోఁచినరీతిగా నీబాలికలకు సా
హాయ్య మొనర్చుచుంటిని'' అని జడ్జీ లిండ్సేగారు వ్రాసిరి.
లిండ్సేగారు 25 ఏండ్ల కాలము అమెరికాలో జువనైలు (బా
ల్యసం.) కోర్టులో జడ్జీగా నుండిరి. అందుచే వీరికి ఆదేశమున
వ్యభిచారము లెంత హెచ్చుగానున్నవో నిజముగ తెలియును.
ఆతనివ్రాఁతలు మేయోకన్య వ్రాఁతలవలె నిరాధారములైన
వియు, కపటబుద్ధితో వ్రాసినవియుఁ గావు. అమెరికాయందు
వివాహములు కాక పూర్వమే యిట్టిఘోరపాపముల నాచరిం
చుచు, తమ కిష్టమగువారితో సంభోగించుచు, గర్భిణులగుచు,
న్యాయసమ్మతములు కాని సంతానములను గనుచు, భ్రూణ
హత్యలను గావించుచు, సిగ్గుమాలి, నీతిమార్గమును నీటఁ
గలిపి, యిహపరంబులకు దూరమయి, విచ్చలవిడిగ సంచ
రించు బాలికలు వేనవేలు గలుగ, ఆదేశపు కన్యయేయగు
మేయోకాంత హిందూదేశమున బాలికలే సంతానములను
కని, తల్లు లగుచున్నా రని తన గ్రంథమున వ్రాసి వారల
దూషించుట యెంత ఆశ్చర్యమో యెంత యసందర్భమో,
చదువరులే గ్రహింతురుగాక. హిందూదేశమున బాలికలే
తల్లు లగుచున్నను వారు అమెరికాదేశపు అవివాహితలగు
బాలికలవలె వ్యభిచరించి, రహస్యముగ గర్భములను దాల్చి,
న్యాయవిరుద్ధములగు సంతానములను గనుటలేదే. హైందవ
బాలికలు వివాహితలయి రజస్వలానంతరమున తమభర్త
లతో రతిక్రీడలందుఁ దేలియాడి, న్యాయసమ్మతమగు శిశు
వులను కనుచున్నారు. అమెరికాతల్లిని గురించి జడ్జీలిండ్సేగారు



వ్రాసిన సత్యములు భారతజనకుని గుఱించి మేయోకాంత
వ్రాసిన అసత్యారోపణములకంటె వేయిరెట్లధికసంక్షోభ
మును కలిగింపకమానవు.

---

## 4 అధ్యాయము.

---

### బాలురే తండ్రు లగుట.

హిందూదేశమున బాలురే తండ్రు లగుచున్నారనియు
అందుచేత వారిజీవితకాలములో శీఘ్రముగనే నిర్వీర్యు లగు
చున్నారనియు, హిందూమతాచారముల ప్రకారము న్యాయ
సమ్మతమైన యొక పుత్రుఁడు ప్రతి మనుజునికిని తమ ఉత్తర
క్రియలు జరుపుటకు నుండవలెనని తండ్రి మరణించిన పిమ్మట
ఆతనితల నీపుత్రుఁడు చితిమీఁద పెట్టి చిదుకఁగొట్టుననియు,
నిటువంటి యబద్ధముల నెన్నియో మేయోకాంత తనగ్రంథ
మునందు వ్రాసియున్నది.

'అపుత్రస్య గతిర్నాస్తి' యనుసూత్రము ప్రకారము
ప్రతిహైందవునకును ఒకపుత్రుఁ డుండవలెనని యున్నది.
కాని తండ్రిమరణానంతర మతనితలను చితిమీఁదను పెట్టి
పుత్రుఁడు చిదుకఁగొట్టునను ఆచార మెచ్చటను లేదే.
ఈఆచారము ఆమేయోకన్యబుఱ్ఱలో పుట్టినది కాని వేఱొండు
చోట నుద్భవింపలేదు. ఈకన్య హైందవులయొక్క దహన
సంస్కారమున కోర్వఁజాలక తనలో తాను దహించుకొని
పోవుచున్నట్లు కనఁబడుచున్నది. ఈదహన సంస్కారము

ఆరోగ్యవిషయమున పాతిపెట్టుటకంటె మిక్కిలి శ్రేష్ఠమైన పద్ధతి యని పాశ్చాత్య విద్వాంసులుకూడ పలువురు పలుకుచున్నారు. ఈమె కీవృత్తాంత మెవరు దెల్పినదియు నీమె తన గ్రంథమునఁ బేర్కొనుటలేదు.

ఆవృత్తాంత మటుండనిండు. ఇఁక బ్రదికియున్నవారి సంగతి నాలోచింతము. ఒక హైందవబాలుఁడు వీర్యోత్పత్తికి పూర్వమే తాను సంభోగమును మొదలిడునట! గాంధిగారికి బాల్యమున సంభోగవాంఛ అపరిమితముగ నుండెనట! అతఁడొకసారి లంజెయింటికి కూడ పోయి యచ్చట తన సొంత భార్యను జ్ఞాపకము తెచ్చికొని, తిరిగీ వెంటనే వచ్చెననిఈమె వ్రాసినది. గాంధీమహాత్ముని శక్తి తన్నుతాను జయించుకొనుటలోనే కల దన్నసంగతి జగద్విఖ్యాతము.అతఁడు మహాతపశ్శక్తిచేతనే కామక్రోధాదులను జయించెను. ఆత్మశక్తి, ఆత్మజ్ఞానము, ఆత్మస్వాధీనత అనునవి మూఁడును జీవితమును మహాశక్తివంతములుగఁ జేయు నని యొక ఆంగ్లేయ మహాకవి చెప్పెను. ఇటువంటి దాని కుదాహరణము గాంధిమహాత్ముఁడే. అట్టి మహాత్ముని గుఱించియైనను మేయోకాంత నిజమును వెల్లడించి యుండవలసినది.

ఇంక భార్యలను గుఱించి యోజింతము.ఇస్లాంమతము వలెనే హిందూమతమును అనేకభార్యలను వివాహ మాడ వచ్చునని చెప్పుచున్నది. మహమ్మదీయులు నలుగురు భార్యలకంటె సధికముగ వివాహ మాడఁగూడదు. కాని, హిందూ మతమున అట్టిసంఖ్య నియమింపఁబడలేదు. ఈమతములు ఒక



భార్యకంటె హెచ్చుమందిని పెండ్లియాడవచ్చు నని చెప్పుచున్నవి గాని అట్లు చేయక తప్పదని నిర్బంధము నేర్పఱుచుట లేదు. ఒకభార్యకంటె నెక్కుడు భార్యలను పెండ్లియాడుట కూడదని చెప్పు పాశ్చాత్యదేశస్థులు అధికముగ రహస్యపు భార్యలను గలిగియున్నారు. పెక్కుమంది భార్యలను పెండ్లియాడవచ్చునని చెప్పు హిందూమతస్థులొక్కభార్యనే యగ్నిసాక్షిగఁ బెండ్లియాడి యామెతో కాఁపురము చేయుచు సుఖించుచున్నారు. విడాకులిచ్చు పాశ్చాత్యుల న్యాయస్థానములే యిందులకు సాక్ష్యము. పాశ్చాత్యదేశములలో బాలికలే ముందుగా బాలుర కీవ్యభిచారదుర్వ్యవహారమునందు పాఠములను గఱపెదరు. అమెరికాదేశమందు హైస్కూళ్లలో నూటికి ఏఁబదిమంది బాలురు సంభోగ సాగరంబున రహస్యముగ మునుఁగుచున్నారు. హిందూదేశమున, బాలురు బహిరంగముగ నొకకాంతను పరిణయమాడి ఆమెతో సుఖించుచున్నారు.

---

## 5 అధ్యాయము.

---

### ఈపటము - ఆపటము.

మేయోకాంత దేవదాసీలను గుఱించి యేమి వ్రాసినదో చూడుఁడు. దేవదాసీ లనఁగా దేవునియొక్క లంజెలని ఆంగ్లమునకు తర్జుమా గావించినది. ఈదేవదాసీలందఱును

కోవెలపూజారులకును, యాత్రికులకును, ఉపయోగింపఁబడు చున్నారట!

దేవదాసీలను నొకజాతివారు హిందూదేశమునఁగలరు. వారలను దేవుని కోవెలలో నుంచుటకు కారణమేమన? వారిని ఎప్పటికైనను బాగుచేయుటకే. నిరతమును దేవుని సన్నిధానమున నుండుటచే కొన్నాళ్లకైనను వారికి బుద్ధివచ్చి, దేవుని యందు భక్తిశ్రద్ధలు, పాపభీతియుఁ గలిగి అవినీతిమార్గమును బోనాడిసన్మార్గవర్తినులయి, యొకనినే పెండ్లియాడెద రనుతలంపుననే ఈజాతివారి నట్లు దేవదాసీలుగ భావించి నియోగించిరి. ఈదేవదాసీలజాతి నంతరింపఁజేయుటకు స్టేటుకౌన్సిలునందు సభ్యుఁడగు గా॥ వి. రామదాసుపంతులుగారు ఒక తీర్మానము నుపపాదించిరిగాని ప్రభుత్వమువారు విక్టోరియామహారాజ్ఞియనుజ్ఞప్రకారము సంఘ, మత, సంస్కరణలందు జోక్యమును కలుగఁజేసికొనలేదు. ఇండియాలో కార్యనిర్వాహకశాఖవారు శాసనశాఖవారికి జవాబుదారులు కారు. అందుచేతనే చాల మట్టునకు సంఘసంస్కరణములు గావించుట కవకాశము అచ్చట లేకపోవుచుండెను.

హిందూదేశమున దేవదాసీ లున్నారనుట నిజమే. అమెరికాయందు న్యూయార్కు పట్టణమున 50 వేలమంది బాలికలు తమ భర్తలతోఁ గాక తదితరులతో సంభోగించుచున్నారు. హిందూదేశపటమును చూడుఁడు. అమెరికాపటమును జూడుఁడు.



సాధారణముగా హిందూదేశమున బాలికలు 14 వ ఏఁట రజస్వల లగుదురనియు, నంత వేగముగా నగుటకు వారి సంభోగవాంఛయే కారణ మనియు చెప్పుచున్నది. కాని అమెరికాయందు 313 బాలికలలోను 265 మంది 11 లేక 12 ఏండ్లకే రజస్వల లగుచున్నా రని జడ్జీ లిండ్సేగారు చెప్పుచున్నారు.

ఇఁక హైందవవితంతువులను గూర్చి గమనించుఁడు. 'హిందూవితంతువులు సంఘమును పాడుచేయుటకును, వ్యాధులను వ్యాపింపఁజేయుటకును ఆధారభూత లగుచున్నా' రని మేయోకన్య దెలిపినది. అమెరికా సంయుక్తరాష్ట్రములలో సన్న్యాసినులలో కొందఱు చెడుమార్గము నవలంబించుచో వారందఱును సంఘమును చెఱుచుచున్నారని చెప్పుటమిక్కిలి యవివేకముకాదా? హిందూదేశమున వితంతువివాహములను ప్రోత్సాహపఱుచుట కనేకప్రయత్నములు జరుగుచునే యున్నవి. వితంతువివాహములును జరుగుచునే యున్నవి.

---

## 6 అధ్యాయము.

---

## స్త్రీలు – పరదాపద్ధతి.

అమెరికాకాంత మనలను దూషించుటకు వచ్చెనుగాని ఆశీర్వదించుటకు రాలేదు. మనదేశస్త్రీలను చూచి నవ్వును. పురుషులను చూచి మొఱపెట్టును. 'అందఱు స్త్రీలను బందిఖానాలలో నుంచినట్లు పరదాపద్ధతి యందుంచి వారిని బాని

సలఁగాఁ జూచుచున్నారు' అని వ్రాసినది. పరదాపద్ధతి నిశ్చయముగ మంచిదిగాదు. కాని, అది లేదని చెప్పుటకును వీలులేదు. పరదా స్త్రీలు బానిసలకంటె నన్యాయమని చెప్పుటమాత్రము నిజముకాదు. పరదా స్త్రీలు తమయింటి వ్యవహారములను చక్కఁబెట్టుచు ఇండ్లలో రాణీలవలెనేయుందురు. అదియును గాక హైందవ స్త్రీలందఱును పరదాపద్ధతి నాచరణలోఁ బెట్టలేదు. మేయోకాంత భారత స్త్రీలందఱును పరదాపద్ధతికి లోనైరనియే వ్రాసినది. పట్టణములలో నీపద్ధతి హెచ్చుగా నున్నది. అందు హిందూ స్త్రీలకంటెను మహమ్మదీయ స్త్రీలు ఉత్తరహిందూదేశమున ఎక్కువగానీ పద్ధతి నవలంబింతురు. దక్షిణమున నీపద్ధతి హిందూ స్త్రీలకు తెలియనే తెలియదు. మలబారులో మగవారికంటెను పాశ్చాత్య స్త్రీలకంటెను ఎక్కుడగు హక్కులు స్త్రీలకుఁ గలవు. హైందవ స్త్రీయొక తెపట్టణమునుండి పల్లెటూరి కేఁగినచో నామెను అచ్చట బలవంతమున చెఱఁబట్టుదు రని మేయోకాంత వ్రాసినది.

ఆహా! భారతీయు లందఱును మనుష్యరూపమును దాల్చిన మహాపిశాచము లని ఈమె భావించినది కాఁబోలు! వేలు, లక్షలు స్త్రీలు పొలములలో పనిచేయుచుందురు, అడవుల కేఁగి వంటచెఱకును తెచ్చుచుందురు. పాశ్చాత్యపురుషులకంటె భారతజాతిపురుషులు ఎక్కువ దుండగీండ్రుగారు. ఎక్కువ మర్యాదస్థులునుగారు. ఉభయులును సమానులేయని గ్రహింపవలెను. అమెరికా సంయుక్తరాష్ట్రములలో పది పండ్రెండుగురు వ్యభిచరించుట చూచి, అమెరికా దేశీయు



లందఱును వ్యభిచారులే యని చెప్పుట న్యాయమా? మేయోకన్య వ్రాసినట్లు భారతీయు లందఱును వ్యభిచారులేయైనచో ఆదేశమున బందిఖానాలలో చోటే లేకుండెడిది.

మహమ్మదీయ పరిపాలనమున నీపరదాపద్ధతి హిందూదేశమున నవలంబింపఁబడెను. కాని అది ఇంకను ఉత్తరహిందూదేశమున నుండుటకు కారణ మాప్రజలు కారు. ఇటువంటి పద్ధతిని పోనాడుటకు తగినవిద్య గఱపినచో బాగుండెడిది. కాని ఈదేశమున, స్త్రీపురుషుల విద్యాభివృద్ధికి వినియోగింపవలసిన ధనమంతయును సైన్యములక్రిందనే వ్యర్థము చేయఁబడుచుండెను. భారతశాసనసభకు ఆర్థికవ్యవహారములందు అధికార మేమియు లేదు. ప్రభుత్వమువారు ఆదేశమున విద్యావ్యాప్తికి వలయునంతటి ధనము నొసంగరు.

---

## 7 అధ్యాయము.

---

### భారత స్త్రీలు - నిజస్థితి.

"కాళికాదేవికి మేఁకలను బలియిచ్చునపుడా మేఁకలరక్తమును స్త్రీలు నేల సాష్టాంగపడి నాకెదరు. అందువలన సంతానము కలుగు నని వారినమ్మకము'' అని మేయోకన్య వ్రాసినది. దీనికి తగిన జవాబు కలకత్తా మేయరగు జె.ఎమ్. సేనుగుప్తగారు కలకత్తాలో నొక బహిరంగసభయం దొసఁగిరి. 'మేఁకలను బలియిచ్చువాడుక ఈదేశమున కలదు. కాని మేఁకరక్తమును స్త్రీలు సంతానకాంక్షచే నాకుదు రనుట

చట్టి అబద్ధము. మేఁకలను బలియిచ్చుట మంచిదికాదని వైష్ణవులు చెప్పెదరు. వీరు దీనినంగీకరింపరు. బ్రిటీషుఇండియాలో ఆంగ్లప్రభుత్వమువారీయాచారమును తొలఁగింపకపోయినను తిరువాన్కూరు స్వదేశసంస్థానమున మహారాణీగారు ఈ యాచారమును నిర్మూలింప శాసించిరి. నిర్బంధవిద్యనుగుఱించియు నిటువంటి యాచారములను గుఱించియు నెపుడైనను శాసనసభలలో తీర్మానమును ఉపపాదించినయెడల ప్రభుత్వమువారాటంకపఱచుచుందురు. మాంసభక్షకులగు ప్రభువులు పరిపాలించుచుండ నిట్టి జీవహింస నెట్లు తొలఁగింపఁగలము?'

హైందవవితంతువులబాధలనుగుఱించి ఒకక్రైస్తవకాంత మిస్ కార్నిలియాసొరాబ్జీ యనునామె వ్రాసినగ్రంథమును మేయోకన్య ప్రమాణముగఁ గైకొనినది. మేయోకాంత ఇటువంటి గ్రంథముల నాధారము చేసికొనుటకంటె కొలఁదిహిందూగృహములకుఁ బోయి చూచినచో బాగుగా నుండియుండును. దానివలననిజము స్పష్టపడియుండును. పూర్వాచార పరాయణులగు హైందవుల యిండ్లలోని వితంతువులకు తిరిగీ వివాహమొనర్పరు. కాని వారిని అమెరికాయందువృద్ధస్త్రీలనెంత గౌరవముగాను ఎంత యాదరముగాను చూచెదరో అట్లే వీరిని గూడ తమ వారు చూచెదరు.

---

## 8 అధ్యాయము.

### అపరాధములు – అతిశయోక్తులు.

మేయోకాంత హిందూదేశమున నేకొలఁదిమాసములో ఏ కొలఁది పట్టనములలోనో తిరిగి జాతి నంతను వారి యాచారములను దూషించుచు నొకగ్రంథము వ్రాసినది. పూర్వాచార పరాయణ యగునొక భారతస్త్రీ లండనుపట్టణమున కేఁగి, వార్తాపత్రికలయందు సంక్షోభమును గలిగించు వార్తలును, ప్రకటనములు, బయస్కోపున కేఁగి అచ్చటి నీతి విరుద్ధములగు సీనులను, దొరలు దొరసానులు కలిసి నాట్యమాడుటయు, చూచి వెంటనే పాశ్చాత్యు లందఱును నీతిబాహ్యు లని చెప్పను. అది సత్యమా అసత్యమా యని జ్ఞాను లూహింపవలెను. మేయోకాంత భారతదేశమునకు వచ్చి చూచినది వ్రాసినదియు నిట్టులే యున్నది.

పాశ్చాత్య పట్టణములందు వీధులందు లంజెలు సంచరించుచుందురు. భారతదేశమున పడుపుకత్తెలు ఇండ్లలోనే యుందురు. వారలకు సుఖరోగములు కలుగుచుండుట తఱచు. కాని భారతజాతి యంతయు సుఖవ్యాధుల వలన బాధపడుచున్నదని ప్రపంచమునఁ జాటుట ఏటిన్యాయమో తెలియదు. దక్షిణఇండియాలో చిట్లఫిరంగియను వ్యాధిని తెచ్చిపెట్టినది వాస్కోడిగామాదేశస్థు లని ప్రజలు నమ్ముచున్నారు. ఈసుఖవ్యాధు లదృష్టవశమున పల్లెలయందెచ్చటనోకాని కానరావు. పట్టణములందైనను అమెరికా దేశపు పట్టణములందుకంటె నివి హెచ్చుగా లేవు.

## 9వ అధ్యాయము.

### భూదేవులు.

"భారతదేశమున బ్రాహ్మణులు భూదేవులని పిలువఁబడుచున్నారు. వీరే జాతిభేదమును గల్పించిరి" అని మేయోకన్య వ్రాసినది. బ్రాహ్మణులు భూదేవులని పిలువఁబడుట నిజముగా న్యాయము కాదు. కాని పజయముందన ప్రతి జాతివారును భూదేవులవలెనే సంచరించుచున్నారు. వివిధదేశములను జయించి వశపఱుచుకొని పరిపాలించుచున్న బ్రిటిషువారికి మాత్ర మిట్టి అహంభావము లేదని యెవరు చెప్పఁగలరు? పూర్వపు బ్రాహ్మణులకు పరిపాలనాధికారము గలిగియున్నను వారు ఇరువదియవ శతాబ్దినాఁటి శ్వేతబ్రాహ్మణులవలె ప్రజానురాగపరిపాలకుల మని డాంబికములు చెప్పియుండుట లేదు.

బ్రాహ్మణులయాధిపత్యమును మహమ్మదీయ పరిపాలన మడుగంటఁ జేసినది. బ్రిటిషుప్రభుత్వమున నున్నది కూడ ఊడిపోయెను. కాని బ్రాహ్మణులును క్షత్రియులును కొరడాలతోను, మరఫిరంగులతోను గాక తమ ఆత్మగౌరవాధిక్యముచే ప్రజలను పాలించుచుండిరి.

బ్రాహ్మణులు గౌరవాధికమగు జీవితమును గడపుచుండిరి. వీరు ఈదేశమునకు వచ్చి వారిపవిత్రతమములగు జీవితములు, గుణములు, ఆదర్శములు వీనిచేతనే యీదేశపు



అడవిమనుష్యులను వశపఱుచుకొని వారిని పరిపాలించుచు వచ్చిరి. వారిఆత్మశక్తివలననే వారు పరిపాలకులైరి. కాని, ఇప్పటి శ్వేతబ్రాహ్మణులపరిపాలనమో పశుబలము మీఁదనే కదా ఆధారపడియున్నది.

పూర్వము వర్ణాశ్రమాచారపద్ధతివలనఁ గలిగిన చెడుగు లెట్లున్నను ఈవర్ణములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని వారివారి వృత్తుల సౌకర్యముకొఱ కేర్పడినవి. పంచములు అను అయిదవ జాతికూడ నింకొకటి గలదు. ఈబ్రాహ్మణులు దక్షిణ హిందూదేశమున ఏమిచేసినను, చేయకున్నను మద్యపానమును, మాంసాహారమును, ఇప్పటివఱకును జేయకుండ పవిత్రజీవితములను గడపుచున్నారు. ఉత్తర హిందూదేశమున బ్రాహ్మణులు మాంసమును, వంగరాష్ట్రబ్రాహ్మణులు మత్స్యములను, గైకొనుచున్నను మద్యపానము మాత్రము, వారిచేఁగూడ నిషేధింపఁబడెను. ఇట్లు చేయఁగూడదని యొకప్రభుత్వశాసనము లేదు. మేయోకన్య మాతృదేశమగు అమెరికాయందు ఈమద్యపాననిషేధము కొఱకు ఒక శాసనము గావింప వలసి వచ్చెను. ఆమెదూషణలకు పాత్రమైన యీభరతఖండమునందు సంఘనియమమే నిన్నమొన్నపుట్టి అభివృద్ధి గాంచుచున్న అమెరికాదేశమునందు శాసనములుగూడ చేయలేని మహాకార్యమును చేయఁగలిగెను.

## 10 అధ్యాయము.

---

### వ్యవసాయదారులు – అస్పృశ్యులు.

సంఘసంస్కర్తలును, రాజకీయ వేత్తలును బ్రిటిషు దేశమున గుడిసెలయందు నివసించువారి భయంకరములగు కథలను తఱచుగా చెప్పుచునే యున్నారు. అట్టియెడ మేయో కాంత భారతవ్యవసాయదారులును, అస్పృశ్యులును, పడుచున్న కష్టముల కంతు లేదని వ్రాయుట వింతకాదు. ఇంగ్లండుతో నిండియాను పోల్చిచూచినయెడల ఇంగ్లండు స్వర్గతుల్యమనియే చెప్పవలెను. వ్యవసాయదారులు, కార్మికులు మున్నగువారి యభివృద్ధికి ప్రభుత్వమువారు తోడ్పడుచు తగిన చర్యను దీసికొనరు. వారిచర్యలను తీవ్రముగ విమర్శించినయెడల అట్టివారిని శ్రీకృష్ణజన్మస్థానమునకుఁ బంపెదరు.

ఆర్నాల్డు లప్టను అను ఆంగ్లేయుఁడు ఇండియా దేశమంతయుఁ దిరిగి అందు నిజమగు పరిస్థితులను కనుఁగొని నిష్పాక్షికముగ నిట్లువ్రాసెను. "నేను భారత దేశపు ఆర్థికపరిస్థితులను కనుఁగొనుటకే ముఖ్యముగా అచటి కేఁగితిని. అచ్చట వేలకొలఁది ప్రజలు క్షుద్బాధచే పీడింపఁబడుచుండుట బ్రిటీషుసామ్రాజ్యమున కంతటికిని సిగ్గును కలుగఁ జేయుచున్నది. అప్పుడప్పుడు కలుగు క్షామములకు నేను ప్రభుత్వమును దూషింపను. కాని భారతీయులలో అయిదు కోట్లప్రజలు అన్నములేక, నిరంతరమును పరితపించుచున్నా రనినచో



నాదోష మెవరిది? ఇట్టి దుఃస్థితులను తొలఁగింప దయాళువులగు ప్రభుత్వమువారు ప్రయత్నింప వలదా? అట్లు చేయుట వారికి ముఖ్యవిధి కాదా? కడుపునిండ తిండియును, కట్టుటకు బట్టయును, ఆరోగ్యసంరక్షణమును ప్రజలకు కలుగఁజేయుట ప్రభుత్వమువారు చేయవలసినముఖ్యవిధికాదా? ఒకజాతి క్షేమమునకు మొట్టమొదటను కావలసినవియు చేయవలసినవియు ముఖ్యముగా నివియేకదా ?

నేనే ఇండియాదేశమునకు రాజప్రతినిధి నైనచో, ఆఫ్ఘనిస్థానమునుండి కలుగవచ్చు ననుకొనెడి సంగ్రామభయమును, ప్రష్యాను గుఱించిన యాలోచనములు మున్నగు వ్యర్థములగు సమస్యలను ఆవలనుంచి బ్రిటీషుసామ్రాజ్యమునందుఁగల తక్కిన శ్వేతజాతులతో పరిసమానముగ భారతీయులకు ఆర్థికపరిస్థితులన్ను కలుగఁజేసి వారిని తత్తుల్యులుగఁ జేయఁ బ్రయత్నించి యుండెడివాఁడను. భారత దేశప్రభువులు కష్టము లన నెట్టివియో యెఱుంగనివారు. పనివాండ్ర వేతనములనుగుఱించికాని, వారికి లభించువేతనములు వారి దేహారోగ్యమును కాపాడుకొనుటకు సరిపోవు నాహారము నొసంగునా యనికాని వీరికి ఆలోచింప నవసరము లేదు. వీ రెంతసేపును వినోదములయందును, స్వాగతోత్సవములందును, విందులందును తమ కాలమును గడపుచుందురు. ఇట్టివారికి బదులుగ, ఇంగ్లండునుండి కార్మికపక్షమునుండి యొకనిని రాజప్రతినిధినిగా భారత దేశమునకు పంపినచో నాతఁడు మొట్టమొదటను కార్మికుల ఆర్థికపరిస్థితుల నెట్లు

అభివృద్ధిచేయవలెనో యనువిషయమును గుఱించియే విచా
రించి అందులకు తగినచర్య గావించియుండును.

ఇదివఱకే కాలమందును, ఏయుగమునందును 4 కోట్ల
7 లక్షల ప్రజలుగల యొకజాతివారు, వేలకొలఁది సంవత్సర
ములనుండి నాగరకతచే నొప్పుచు పేరు ప్రఖ్యాతులు వడసిన
319 కోట్ల జనసంఖ్యగల వేఱొక జాతివారిని, ఏడు వేల మైళ్ల
దూరముననుండి పరిపాలించుట లేదు.'' అనిఆతఁడు వ్రాసెను.
మేయోకాంతవ్రాఁతలకును ఈతని వ్రాఁతలకును మధ్యఁగల
తారతమ్యమును చదువరులే గ్రహింపవచ్చును.

'' భారతదేశమున అస్పృశ్యులను నొకజాతివా
రున్నారు. అందుచేత నా దేశమునకు స్వపరిపాలనార్హత
లేదు '' అని మేయోకాంత వ్రాసినది. బానిసవర్తకమును
నిషేధింపవలె నని బ్రిటీషుపార్లమెంటునం దొక చట్టమును
ప్రవేశపెట్టినపుడు, టోరీపక్షమువారు దాని నెదిరించిరి.
అటువంటిటోరీలు ఇంగ్లండునం దుండుటచే ఇంగ్లండు దేశము
స్వపరిపాలనమున కర్హత వహించియుండలేదని చెప్పుట
యెంత అసందర్భమో అస్పృశ్యులు గలరని యొకకుంటి
సాకును చెప్పి, భారతదేశ మంతయు స్వపరిపాలనమునకు
అనర్హమైన దని చెప్పుటకూడ నట్టిదే. అయినను ఈ యస్పృ
శ్యతను ప్రభుత్వమువారేల తొలఁగింపఁగూడదు ? వారి
కధికారము లేదా ? సామర్థ్యము లేదా ? గత 150 ఏండ్ల
బ్రిటీషుపరిపాలనములో నీ ప్రభువులు అస్పృశ్యతను నిర్మూ
లించుటకుఁ గావించినకార్య మేమి ? ఈయస్పృశ్యుల అధో



గతికి మేయోకన్య మిక్కిలి వగచినదే. ఈమెకు నిజముగ దయా
దాక్షిణ్యములు వారియందు కలిగియున్నయెడల భారతదేశ
ప్రభుత్వముతో వీరియభివృద్ధినిగుఱించి ఆమె యేల మాటా
డుట లేదు ?

---

## 11. అధ్యాయము.

---

### బానిస మనోభావము.

ఇండియాదేశము స్వపరిపాలనమునకు అర్హతను
వహించి యుండలేదని ఋజువుచేయుటకై మేయమ్మ భారత
జాతిని గుఱించియే కాక, ఆజాతి స్త్రీలను, పిల్లలనుకూడ
దూషించుచు వ్రాసినది. వీరు తమబాలుర సౌందర్యవిలాస
ములచే నొప్పుచుండెడుపక్షమున వారిని అచ్చువిడిచిన ఆఁబో
తులవలె వ్యభిచరించుటకై దేవాలయములందు విడిచిపెట్టెద
రని యీ కన్యామణిగారు వ్రాసినారు.

ప్రపంచమున ప్రసిద్ధిని గాంచిన భారతజాతియందు,
పసివాండ్రను దైవసమానులుగఁ జూచు భారతజాతియం
దిట్టి నిరాధారములును, అసత్యములును, అక్రమములు నగు
దోషారోపణములను చేయుట దైవదూషణమే యగును.
భారతస్త్రీలు పతివ్రతాతిలకములు. వారి పుత్రికలు, భార్య
లు, తల్లులు అనువారు వారిధర్మముల నెల్ల నిర్వర్తించుచుండు

రు. ఈస్త్రీలయందు అధర్మములు మూర్తీభవించియుండు నను టకు సందియము లేదు.

హిందూదేవుఁడైన శివునిగుఱించి యీపాశ్చాత్యకన్య "శివలింగము పురుషునియంగముయొక్క రూపమును దాల్చి దేవాలయములందును, రహదారులందును, గృహములందును గూడ నుండును. దానిని హైందవులు పూజింతు"రని వ్రాసినది. శివపూజను సలిపెడు హైందవులకు నీదేవుఁ డెపుడును పురుషునియంగము యొక్క రూపమును దాల్చి మేయో కాంత కగపడినట్లు కనుపడుట లేదు. పురుషుని యంగరూపమును దాల్చి శివుఁడు ప్రత్యక్షమైన యీమేయోకన్య యెంత ధన్యురాలో కదా!

"దక్షిణదేశమందు వైష్ణవమతస్థులు స్త్రీలయొక్క గోప్యాంగమును బోలు పట్టెనామములను నుదుటిపైని ధరింతురు" అని మేయోకాంతామణి వ్రాసినది. ఇటువంటి యసందర్భపు అర్థములను కల్పించి యీమెకు ఎవరు చెప్పిరో తెలియదు. బహుశః క్రైస్తవమిషనరీలు చెప్పియుందురు.

దయానందసరస్వతి యిండియాదేశమునకు మార్టిన్ లూథరు వంటివాఁడు. పౌరాణికగాథల నెల్ల నమ్మక వేదకాలమునాఁటి అసలు హిందూమతమునే స్వీకరింపుఁడని యీతఁడు హైందవులను కోరెను. ఆర్యసమాజమువారు జాతి, మత భేదములనే పాటింపరు. నిమ్నజాతులవారలతో వీరు నివసించుచు వారి యభివృద్ధికై పాటుపడుచున్నారు. బాల్యవివాహముల నీసామాజికులు పాఱఁదోలిరి. పర్దాపద్ధ



తిని రూపుమాపిరి. వీరి పాఠశాలలు ప్రభుత్వమువారిచేఁ గాక ప్రజలచే పోషింపఁ బడుచున్నవి. వీరిప్రచారకులు వందలు, వేలును, దేశమున సంచరించుచు సంఘసంస్కరణములను చేయుచున్నారు. పిచ్చినమ్మకములకు ఆర్యసమాజమునందు తావు లేదు. వీరు జాతిగుఱుతులను నుదుటియందు ధరింపరు. వీరు నిజమగు వేదాచారములనే అనుసరించియున్నారు. ఈ మన అమెరికా దేశస్థురాలు వీరిమహాకార్యముల నుగుర్తింపక యుండఁజాలదు. కాని ఆమె యీవిషయమును గుఱించి యేమియు వ్రాయుట మానివేసినది.

పంజాబు, రాజపుటానా, సంయుక్త రాష్ట్రములయందు ఆర్యసామాజికుల వలెనే వంగరాష్ట్రమునందును, బ్రహ్మసమాజమువారు సంఘసంస్కరణములను గావించుచున్నారు. బాల్యవివాహములు వంగరాష్ట్రమునం దతిశీఘ్రముగనే తగ్గుచున్నవి. వితంతువివాహములు విశేషముగ జరుగుచున్నవి. వివిధజాతులును కలిసిమెలసి భుజించుటకూడ చాలవఱకు జరుగుచున్నది.

ప్రజలు సంఘసంస్కరణముల నెంత వాంఛించినను, వానికొఱ కెంత శ్రమపడినను ప్రభుత్వమువారు సాహాయ్యమొసఁగకున్నచో ఫలితము కలుగనేరదు. విదేశీయ ప్రభుత్వమువారు ఇట్టి సాహాయ్యమును గావించుటకు వెనుదీయుదురు. ఇంగ్లండులో శీఘ్రముగ సంఘసంస్కరణములు జరుగుట కేమి కారణము? స్వతంత్రపరిపాలనము కలుగఁబట్టియే కదా! స్వపరిపాలనమే ఇంగ్లండునందు లేకున్నచో,

ఇండియావలె నీదేశముగూడ ఇట్టి యిక్కట్టులపాలఁ బడుట నిక్కవము. ఇండియాకు ఇప్పుడు అధికారము కావలసియున్నది. అదిలేనితఱి, జాతీయాభివృద్ధి గాని సంఘసంస్కరణములుగాని జరుగనేరవు.

---

## 12 అధ్యాయము.

---

### రాజకీయ, సాంఘిక, అల్లరులు.

మేయమ్మగ్రంథమును చదివినవారికి నిజమగు సంగ్రామము భారతదేశమున జరుగుచున్నట్లే తోఁచును. కొంచెము జాగరూకతతో గమనించినవారికి మాత్రము సంఘదుర్మార్గములు అచ్చటచ్చట జరుగుచున్నను మొత్తముమీఁద దేశమంతయును శాంతముగా నున్నదని తోఁచును.

"మింటో-మార్లేసంస్కరణములు మహమ్మదీయులకు భయమును కలిగించినవి. హైందవులే యధికారము నంతను చెలాయింతు రని వీరు భయమొందుట న్యాయమే" అని మేయమ్మ వ్రాసినది. ఈసంస్కరణములు ప్రజాసామాన్యమున కెట్టిలాభములను కలుగఁజేయ లేదు. నియోజకవర్గము బహుస్వల్పముగా నుండెను. శాసనసభలకు నిజమగు అధికార మేమియు కలుగలేదు. మేయమ్మవ్రాసినట్లు ఈసంస్కరణములు నిజముగా మహమ్మదీయులకు భయమునే కలిగించియున్నయెడల వీరు ఈసంస్కరణములకు పిమ్మట హైందవులతో కలిసి ఒకవిధానము నేర్పాటు చేసియేయుండరు.



1919 వ సంవత్సరమున మాంటుఫర్డు సంస్కరణములు వచ్చెను. వీనితో సంఘపరిస్థితులకు చాలవఱకు సంబంధము కలిగియున్నది. ఈసంస్కరణములవునాదియే సంఘవిభేదములపై నాధారపడి ప్రత్యేకనియోజకవర్గములను నియోగించుట జరిగెను. నియోజకవర్గము విస్తరించెను గాని ఇంగ్లండులో నుండునట్లు జాయంటునియోజకవర్గ ముండినయెడల చాల నుపయోగకరముగ నుండెడిది. ఇంగ్లండులో యూదులకు నూఱువత్సరములకు పూర్వము ఓటు-అధికారము లేకుండెను గాని వారి కీయధికారమును పార్లమెంటువారి శాసనము ప్రకార మొసగఁబడినప్పుడు వీరికి ప్రత్యేకనియోజకవర్గ మేర్పఱుపఁబడుటలేదు. అట్లే నియోజకవర్గమును ఇండియాయందు విస్తరింపఁజేయుతఱుణమందును ప్రభుత్వమువారు గావించియుండినచో లాభకారిగ నుండెడిది.

ఇందులకు కాంగ్రెసు - ముస్లిములీగుల నాయకులు కొంతవఱకు బాధ్యులైయున్నారు. వీరు తయారుచేసిన పరిపాలనావిధానమునందు చెడుగునే గ్రహించి మాంటేగుగారు ప్రత్యేక నియోజకవర్గముల నేర్పాటుచేసిరి. 1929 వ సంవత్సరపుస్టాట్యుటరీ కమీషనువారు ఈప్రాఁత తప్పులను దిద్దుఁబాటు చేయవలసియున్నది. అతివాదులు సంస్కరణము లున్నను లేకున్నను ప్రత్యేకనియోజకవర్గమును పాతిపెట్టుఁగని యందురు. మితవాదులు సంస్కరణముల నుపయోగించుచు జాయంటు

నియోజకవర్గ మేర్పాటు చేయుఁడని కోరుచున్నారు. మాంటు ఫర్డుసంస్కరణములు ప్రసాదింపఁబడిన తరువాతనే దేశమున సంఘకలహములు, అల్లరులు, కొట్లాటలు ఎక్కువైనవి.

శాసనసభలు రాజకీయసంస్థలు కాని సంఘసంస్థలు కావు. కాని యీప్రత్యేకపు నియోజకవర్గములు నెలకొల్పఁబడిన పిమ్మట నీశాసనసభలయందును సంఘసంబంధమగు సమస్యలు చర్చింపఁబడి హాని కలుగఁజేయుచున్నవి. ఈసంస్కరణములు స్వపరిపాలనమునకు దారిని జూపుటకు మాఱుగా కొట్లాటలకు మార్గమును గల్పించినవి.

---

## 13 అధ్యాయము.

---

### సంస్కరణములు.

1919 వ సంవత్సరపు సంస్కరణములు భారతీయులకున్నతపదవులను అత్యంతాధికారము నొసఁగెనని మేయమ్మ వ్రాసినది. ఇందు సత్యమెంత గలదో పరికించి చూచెదముగాక.

భారత ప్రభుత్వమువారు, బ్రిటిషు కేబినెటునకును ఇండియా కార్యదర్శిగారికిని బాధ్యులై యున్నారు. వీరు పార్లమెంటునకును, పార్లమెంటువారు ఇండియాదేశము విషయమున నేమియు నెఱుంగని బ్రిటీషుప్రజలకును బాధ్యులై యున్నారు. ఈసంస్కరణములప్రకారము భారతప్రభుత్వమువారు బ్రిటిషు



నియోజకవర్గమునకు బాధ్యులై యున్నారు కాని. భారతదేశ నియోజకవర్గమునకు కాదు. భారతశాసనసభలో ప్రభుత్వమున కెదుటిపక్షమువారిలో నధిక సభ్యులు ఎన్నుకొనఁబడువారుగా నున్నారు. ప్రభుత్వపక్షమునం దెక్కువసభ్యు లుండకున్నను ఇచ్చట జనరలు ఎలెక్షను ఇంగ్లండునందువలె, జరుగఁబడదు. ఎప్పుడైనను లీకమిటీరిపోర్టు, నిర్బంధన శాసనములు మున్నగువాని నీశాసనసభవారు ఖండించుచు తీర్మానించినను అట్టి తీర్మానములను వైస్రాయిగారు బుట్టదాఖలుచేయుదురు. రాజప్రతినిధిగారికి 'సర్టిఫయి' చేయుటకు అధికారముగలదు. ఇటువంటి తీర్మానముల నాతఁడు సర్టిఫయి చేయుచుండును. ఇంగ్లండురాజుగారికి 'వీటో' చేయుట కధికారమున్నట్లు రాజప్రతినిధిగారికి సర్టిఫై చేయుట కధికారము కలదు. కాని, ఇంగ్లండురాజుగారు తమవీటో యధికారము నెప్పుడును వినియోగించకపోయినను రాజప్రతినిధిగారు తఱచుగ నట్లుచేయుచుందురు. ఇఁక నిజమగు అధికారము ఈభారతశాసనసభ కెచ్చటఁ గలదు? రాష్ట్రీయశాసనసభలకు చాల అధికారమీయఁబడె నని అమెరికాదేశపు అబలామణి వ్రాసినది. రాష్ట్రీయ శాసనసభలందు మంత్రుల కెట్టి యధికారములు గలవో ఆపదవులందు కొంతకాల మున్నటువంటి మంత్రులే మడ్డిమాన్ కమిటీవారి యెదుట సాక్ష్యము నిచ్చిరి. వీరియధికారమం దుంచిన శాఖలలో నభివృద్ధిని జూపుటకు వీరికి తగిన ధనమును ప్రభుత్వమువా రొసఁగరు. ఆర్థికశాఖపై వీరి కధికారము లేదు. అదియునుగాక ప్రజలకు ముఖ్యముగా

సంబంధించిన శాఖలగు లా, పోలీసు, జస్టిసు మున్నగు శాఖలపై నీమంత్రులు మాటాడుటకైనను హక్కు లేదు.

ఉన్నతపదవులనుగూర్చి మేయమ్మ వ్రాసినవిషయమును ఇంచుక విచారించెదము. సామ్రాజ్యసభలో భారతీయ ప్రతినిధి గలఁడని కాఁబోలు నీమెయూహ. అయినను ఆప్రతినిధి నెవరు నియమించెదరు? భారతప్రభుత్వమువారు గాని ప్రజలు గారు. ఈసామ్రాజ్యసభయందును ప్రజలకు సరియైన ప్రాతినిధ్యము లేదు. అధమము భారతశాసనసభవారిచేత నెన్నుకొనఁబడునట్లు చేసినను ఈప్రాతినిధ్య మొకతీరున నుండఁ గలదు.

బ్రిటీషువారి యనుగ్రహము, ఆదరువు ఇండియాయందుఁ గలదని మేమయ్మ వ్రాసినది. ఆమె వ్రాసినదాని కర్థ మేమి? బహుశః 1929 సంవత్సరపు కమిషనుగుఱించియో యగును. ఈకమిషనువారైన నేమి చేయుదురు? హైందవులు స్వరాజ్యమున కర్హులా కారా యనుప్రశ్నను పరీక్షింతురు. ఇట్టిపరీక్ష హైందవుల కెంతమాత్రము నిష్టము లేదు. విద్యార్థులకు జరుపఁబడు పరీక్షవంటిపరీక్ష కెంతమాత్రము హైందవులొప్పుకొనరు. బ్రిటీషువారు చేయవలసినది పరీక్షగాదు. కల్నలు వెడ్జివుడ్డుగారు చెప్పినప్రకారము ఐర్లాండుతో నెట్లు సంధి చేసికొని యాసమస్య నెట్లు పరిష్కరించెనో అట్లే ఇంగ్లండు ఇండియాతో నీసమస్యను పరిష్కరించుకొనుట న్యాయ్యము.



"తొందరపడి సంస్కరణములను విస్తరింపఁ జేయఁగూడదు. ఏమన నవి స్వదేశసంస్థానములకు హానికరములగును" అని మేయమ్మ వ్రాసినది. స్వదేశ సంస్థానములు హిందూదేశ స్వాతంత్ర్యోద్యమమునకు వ్యతిరేకముగ పనిచేయుచున్నవని చూపించుటకు మేయోకన్యగారిట్లు వ్రాసినారే కాని నిజముగా నట్లే జరుగుచున్నయెడల నాసంస్థానములతో సంబంధము కలుగఁజేసికొనకుండ అఖిలభారతకాంగ్రెసువారుండ నేరరు.

ఏవియో లేనిపోని సాకులను గల్పించి బ్రిటీషుప్రభుత్వమువారు భారతదేశపు స్వపరిపాలనాధికారమున కొడంబడక కాలాతీత మొనరించుచో నీరెండు దేశములకును చాల హాని గలుగుట తథ్యము. హైందవులలో చాలమంది రాజీపడుట కిచ్ఛగింతురు. బ్రిటీషువారు అందులకు ప్రయత్నములు సల్పుట ఉత్తమము. అట్లు గానిచో గాంధీమహాత్ముఁడు తనయసహాయోద్యమ శంఖమును ఇంకొకసారి మిన్నుముట్టునట్లు పూరించును. ఈసారి యీయుద్యమ మాహాత్మ్యము జగద్విదితము కాఁగలదు. గాంధిమహాత్ముఁడు సరియగు సమయమునకై యెదురుచూచుచున్నాఁడు.

## 14 అధ్యాయము.

---

### బ్రిటీషువారు నిష్క్రమించినచో?

మహమ్మదీయులు బ్రిటిషువారి నిష్క్రమణము కొఱకు వేచియున్నా రనియు, వీరు హిందూదేశ నాట్యరంగ స్థలమునుండి నిష్క్రమించినవెంటనే హైందవులను మచ్చునకైనను లేకుండ నఱికి పాఱవైచెద రనియును మేయమ్మగారు వ్రాసిరి. మహమ్మదీయులకు పశ్చిమోత్తరపరగణాలు బలవత్తరమగు ఉనికిపట్టనియు, వారికి సాహాయ్యము చేయుటకు వెనుక నాఫ్ఘను స్థానమువారు మహమ్మదీయులే యున్నా రనియు వీరును వారు నేకమై హైందవుల నఱఁచివైచి తమ ప్రభుత్వమును పూర్వమువలెనే భారతదేశమున నెలకొల్పెద రనియుఁగూడ నీకన్య వ్రాసినది. అఫ్ఘనిస్థానపు అమీరు గారు నిజముగా భారతదేశపు మహమ్మదీయులను పురికొల్పి వారికి సాహాయ్య మొసఁగుటకు సిద్ధముగ నుండుటయే నిజమైనచో హైందవులు బ్రిటీషుప్రభుత్వమునకు వ్యతిరేకులై యుండుట కంత అజ్ఞానులు కారని యెల్లరును ముఖ్యముగా మేయోకన్యవంటివారును దెలిసికొన వలసియున్నది.

కాని మహమ్మదీయులు చాల రాజభక్తు లనియు, బ్రిటీషుప్రభుత్వమే యుండవలె నని కోరుచున్నా రనియు, సంస్కరణములను గూడ వీరు గోరుట లేదనియు మేయమ్మ వ్రాసినది. ఇట్టివ్రాఁతలు ఆమెకు నిజమని తోఁచిన తోఁచ



వచ్చును గాని ఇతరుల కొక కట్టుకథవలెఁ గాన్పించు ననుట తథ్యము. నిజముగా భారతదేశపు మహమ్మదీయులే హైందవుల నఱఁచివేసి తమప్రభుత్వమును నెలకొల్ప కోరికగలవారైనచో వీరు బ్రిటీషుప్రభుత్వ విధ్వంసమునకు మాఱుగా నీప్రభుత్వమే శాశ్వతముగ నుండునట్లు గోరుచున్నా రనుట యెట్టియుసందర్భమో ఆలోచింపుఁడు. హిందూదేశమున మహమ్మదీయ ప్రభుత్వమును స్థాపించుటకు బ్రిటీషుప్రభుత్వమును మహమ్మదీయులు మొదట నాశనము గావింపవలసి యుండును. అట్లుగాక వీరు రాజభక్తులై యుండి బ్రిటీషుప్రభుత్వమునే శాశ్వతముగా నుండఁగోరుచున్నా రని యీమె వ్రాసినది. ఈమెవ్రాఁతలలో నొకదాని కింకొకటి పొందక అసందర్భముగా నున్నవి. ఈమె ఒకబురుదగుంటలోఁ బడినదని స్పష్టపడు చున్నది.

"హిందూ స్వరాజ్యోద్యమమే ఫలమును గాంచుచో, ఆంగ్లేయులు ఓడనెక్కి పోవుచో హిందూదేశ మంతయు భయంకరమగు రుధిర ప్రవాహములందు కొట్టుకొని పోఁగల" దని మేయమ్మ వ్రాసినది. రోమనులు బ్రిటను దేశమునుండి వెడలిపోయినప్పుడు ఇంగ్లండులో నిట్లు జరిగినది, గాని పశుప్రాయులగు అప్పటి ఇంగ్లండు ప్రజలు కొట్టుకొనినట్లు జ్ఞానవంతులగు నట్టియు, అహింసామార్గము నవలంబించినట్టియు నిప్పటి హైందవులు అట్టి ఘోరకృత్యములను గావించి తమ దేశమున కపకీర్తిని దేఁజాలరు.

---

## 15. అధ్యాయము.

---

### రాజులు - ప్రజలు.

భారతదేశమును గుఱించి యేమియుఁ దెలియనివారు మేయమ్మగ్రంథమును పఠించినయెడల నీదేశమందు స్వదేశ సంస్థానాధిపతులును బ్రిటీషు ఇండియాప్రజలును బద్ధవైరులుగ నున్నారనియు, ఒకరితో నొకరు ఆయుధపాణులై యాహవమొనర్ప సిద్ధముగ నున్నారనియును తలఁచెదరు. రాజకీయవేత్తలీసంస్థానాధీశులను, సంస్థానాధీశులు రాజకీయవేత్తలను అనుమానించుచు శత్రుత్వముతో చూచుకొనుచున్నారనికూడ మేయమ్మ వ్రాసినది. బ్రిటీషువారీ దేశమును వీడి తమదేశమునకుఁ బోవ సంసిద్ధముగ నున్నారనియు, వారిస్థానముల నీసంస్థానాధీశులాక్రమించెదరనియు లోకమునకు వెల్లడిచేయుటయే మేయమ్మ యుద్దేశము. కాని సంస్థానాధీశులకును బ్రిటీషుప్రభుత్వమువారికిని మధ్యను ప్రేమాభిమానములు గలవని మేయమ్మ చెప్పెను.

గ్రేటుబ్రిటనుతో సరిసమానముగు వైశాల్యముగల హైదరాబాదు సంస్థానమును పాలించెడు నైజాముగారును, బరోడాగయిక్వారుగారును, మైసూరు, నాభా మున్నగు మహారాజులును బ్రిటిషు ఇండియారాజకీయవేత్తల యొక్క ఆదర్శములకు తమసమ్మతిని దెలుపుచు, బ్రిటీషుఇండియాతో పాటు తమసంస్థానాభివృద్ధినిగూడఁ గోరుచున్నారు. ఈరాజ



కీయవేత్తలను శత్రుభావముతో చూచుటకుమాఱుగ వారిని తమప్రధానసచివులుగ నియమించుటకుఁగూడ సంస్థానాధీశులు ఇచ్ఛగించుచున్నారు. సురేంద్రనాథ బెనర్జీగారు వంగరాష్ట్రమునకు కిరీటములేని రాజు. వీరిని గయక్వారుగారు తమ ప్రధానమంత్రిగ నుండఁగోరిరి. కాని అంతకుపూర్వమే వంగరాష్ట్రమున తమకార్యక్రమము నేర్పాటు చేసికొనియుండుటవలన బెనర్జీగారు బరోడాప్రధానమంత్రిత్వమును వహింపఁజాలకపోయిరి. వంగరాష్ట్రపు ఉద్యమమున ప్రధానులుగ నుండిన అరవిందఘోషుగారు బరోడాసంస్థానమందు విద్యాశాఖయందు విద్యాధికారిగ చాలకాలము పనిచేసిరి. మహాత్మాగాంధిగారిని మైసూరుమహారాజావారు అతిథిగ రావలసినదని ఆహ్వానించిరి. నైజాముగారు తమసంస్థానోద్యోగములు భారతీయులవశము చేసి పాశ్చాత్యులను తొలఁగించుట కుద్దేశించిరి. ఈవిషయమై రాజప్రతినిధిగారికిని వీరికిని చాలమట్టునకు సంఘర్షణముకూడ జరిగెను. నాభామహారాజు రిపుదమనసింగుగారు సంస్థానాధీశులలో నాదర్శప్రాయులు. వీరు బ్రిటీషు ఇండియాప్రజలకును సంస్థానాధీశులకును శత్రుత్వము గలదని యెవ్వరైన కల్లబొల్లిమాటలను జెప్పినను విశ్వసింపరు. వీరిపరిపాలనాశక్తిసామర్థ్యములను కనుఁగొని ప్రభుత్వమువారు పూర్వపు-ఇంపీరియల్ శాసనసభ కొకసభ్యునిగా నితనిని పేర్కొని నియమించిరి. వీరు అప్పుడు గోకేలుగారితో సహవాసము చేసి, వారియాదర్శముల నన్నిటిని గ్రహించి జాతీయపక్షపాతి యయ్యెను. ఇట్లుండ భారతప్రభుత్వము

వారిచెడ్డచిట్టాలలో నీతనిపే రెక్కినది. కొంతకాల మైన పిమ్మట నీతనిని రీడింగుప్రభువుకాలమున సింహాసనభ్రష్టునిగాఁ జేసిరి. రిపుదమనసింగుగారు గాని, మరియే యితర సంస్థానాధీశులుగాని చక్రవర్తిగారియెడల భక్తిహీనులుగ నెప్పుడును ఉండలేదు. వీరలు ఐరోపామహాసంగ్రామమందుఁ గావించినసాహాయ్యము ఇంతింతయని కొనియాడ నలవికాదు. అదియే వీరికి చక్రవర్తిగారికుటుంబము నెడలఁగలిగెడుభక్తికి తార్కాణము. వీరికి బ్రిటీషు ఇండియాప్రభుత్వపరిపాలనా విధానము ఇష్టములేదుగాని బ్రిటీషువారు ముల్లెమూటలు గట్టుకొని భారతదేశమునుండి వెడలిపోవలెనని వీరియుద్దేశముమాత్రము కాదు.

---

## 16వ అధ్యాయము.

---

### ఇ త రు ల దృ క్ప థ ము.

భారతదేశమును గుఱించి తెలిసికొన్నకొందఱు ఆంగ్లేయులు పురుషులు స్త్రీలుగూడ ఆదేశమునుగుఱించి మంచియభిప్రాయములను వెల్లడించుట భారతీయుల కెల్లరకును సంతృప్తికరముగా నున్నది. సర్. జాన్ మైనార్డుగారు మేయమ్మగ్రంథమును గూర్చి "నిరాడంబరులు, ప్రేమపూరితులు, శ్రమదమాదుల కాస్థానభూతులునగు భారతదేశప్రజలనుగుఱించి యిట్లు వర్ణించుట కర్ణకఠోరముగ నున్నది" అని వ్రాసిరి.



హైందవులలో ననేకులు సుఖవ్యాధులవలన పీడింపఁబడుచున్నా రనుసంగతి అబద్ధమని అచ్చట నివసించు నేవైద్యుఁడైనను చెప్పఁగలఁడనికూడ వ్రాసిరి. మేయమ్మవ్రాసిన భారతీయుల దురభ్యాసములనుగుఱించి యొక ఆంగ్లేయుఁ డిట్లు వ్రాసెను. "నాకు భారతీయులలో చదువుకొనిన వారిలో చాలమంది స్నేహితులు కలరు. వీరు ప్రతియుదయమునను స్నానము గావింతురు. అట్లు చేయనిదీ భుజింపరు. భోజనాత్పూర్వము అనంతరమందుఁగూడ చేతులు నోరు కడుగుకొందురు. ఇ వన్నియు యూరపియన్లుకూడ నేర్చుకొనఁదగువిషయములు. అంతేకాని మేయోకన్య చెప్పినదురాచారములు వీరియందుఁ గాన్పింపవు. బాల్యవివాహములు నేనెఱిఁగినంతవఱకెచ్చటను జరుగలేదు. నాస్నేహితుఁడొకఁడు 12వ ఏఁటనే వివాహము చేసికొనినను 18 ఏండ్లు వచ్చువఱకును తనభార్యమోమునే చూడలేదు. అచ్చటచ్చట నీయాచార మున్నను క్రమేపి యంతరించుచున్నట్లే యూహింపవలెను" అని యతఁడు వ్రాసెను.

మదరాసు వై. ఎమ్. సి. ఏ. జనరలుకార్యదర్శియు, అమెరికాదేశస్థుఁడు నగు డి. ఎఫ్. మేక్లెండుగారిట్లు వ్రాసిరి. "నాదేశపుస్త్రీయొకతె భారతీయులగుఱించి యింతయన్యాయముగాను, ఇంతకార్పణ్యముతోను ఒకగ్రంథమును వ్రాయుట మిక్కిలి అగౌరవకరమగు కార్యము. ఈమెవ్రాఁతలలో ననేకము దృష్టాంతపూర్వకముగా ఋజువుచేయఁబడుటకు సాధ్యములుకావు. నేను ఈదేశమున 1915 సంవత్సరమునుం

డి నివసించుచు భారతీయులతో కలసిమెలసి తిరుగుచున్నాను. ఈమేయమ్మవ్రాసిన వన్నియు నబద్ధములేయని నేను చెప్పఁగలను. అమెరికానుగుఱించికాని పాశ్చాత్యదేశములలో దేనినైనగుఱించికాని భారతీయులును ఇట్టిగ్రంథమును వ్రాయవచ్చును. అప్పుడు పాశ్చాత్యులును అట్టిగ్రంథమును ఖండింపవచ్చును.

సర్. రెజినాల్డుక్రేడకు ఐ. సి. ఎస్. (రిటైర్డు) గారు ఇట్లు వ్రాసిరి. "మేయమ్మ మిక్కిలి దూష్యమగు పటమును వ్రాసి కనుపఱిచినది. ఆపటము మిక్కిలి దూష్యమగుటకు కారణము ఆమె భరింపరాని దూషణములను వ్రాయుటయే. మేయమ్మవ్రాసినవిషయములే నిజమైన వగుచో నీభారతీయజాతియు, భారతనాగరకతయు నెన్నియో వేలయేండ్లక్రిందటనే కంటికి కానరాకుండ నూరుపేరులు లేక విధ్వంసమైయుండెడిది. అందుకుమాఱుగా హిందూమత, హిందూసంఘములపద్ధతి యాచారములు నింతవఱకు బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవమతములయొక్క ప్రచారమునకు లోనుగాక ఆసంఘముయొక్క వ్యక్తిత్వము నింతవఱకును కాపాడఁగలిగినవి. హైందవులయొక్క జాయింటుకుటుంబపద్ధతి మిక్కిలి ప్రసిద్ధమైనది. అది కుటుంబప్రేమను నిర్మలత్వమును, స్వార్థత్యాగమును వృద్ధిపఱుచుచున్న దని హైందవుల నెఱిఁగినవారు ఋజువుచేయఁగలరు."

కలకత్తాలో యూరపియనువారపత్రికయగు క్యాపిటలులో డిచ్చరు అనుపేర పేట్లవట్ గారు ఆపత్రికాసంపాద



కులు "భారతమాత" నుగుఱించి యిట్లు విమర్శించిరి. "మంచిచెల్లుబడిగల పుస్తకములలో ప్రస్తుతకాలమున పదింటతొమ్మిది మంచివికావనియు, అమెరికాదేశపుస్త్రీ గ్రంథకర్త్రి యొక్క బుద్ధికౌటిల్యమును వెల్లడిచేసె ననియు, అమానుషమైన దూషణములు తనగ్రంథమున వ్రాయుకోరికతో నీమె ఆసుపత్రులకే పోయి రోగులను చూచుచువచ్చె ననియు చదువరులనమ్మకమును దృఢపఱుచుచున్నది. ఈగ్రంథమున విద్యాపాండిత్యములు గానరావు. పత్రికానిర్వాహణ మనియనినచో నిది బహు నిందితమైన పత్రికానిర్వాహణము. భారతస్వాతంత్ర్యోద్యమసమయమున దానికి విరుద్ధమగు ప్రచారమును సలుపుటయందును, ఈగ్రంథము సంపూర్ణమగు సంక్షోభమును కలిగించుచున్న దగుటచేతను ఈపుస్తకములు వేఁడివేఁడిదోసెలవలె వేగముగ అమ్ముడుపోయెను"

మేజర్ గ్రిహాంపోలుగారు న్యూరీడరుపత్రికలో నిట్లు మేయమ్మపుస్తకమునుగూర్చి వ్రాసిరి. "మేయమ్మ హిందూసంఘమునందుఁగల దోషములనే గ్రహించి వారి యాదార్శ్యములను వదలివేసె" ననియు, "యౌవనస్త్రీలు పురుషులకు భయపడి బహిరంగముగా తిరుగలే" రని ఈమెవ్రాసినవ్రాఁత ఉత్త అబద్ధమనియు, బ్రిటీషుదీవులందు ఆసుపత్రులను కనుఁగొని యిట్లే బ్రిటనునుగుఱించికూడ ఈమెవ్రాయఁగల దనియు, వ్రాసిరి. ఈమె యీగ్రంథమును వ్రాయుసమయమందు అవినీతికరములగు అమెరికాదేశపుసినీమాఫిల్ములను ఇండియాకు దిగుమతికాకుండ శాసనమును భారతప్రభుత్వము

వారు ఏర్పాటుచేయుట ఎంతయు బాగుగా నున్నది. అని కూడ గ్రిహమ్‌పోలుగారు వ్రాసిరి.

డాక్టరు అనిబిసెంటుగారిట్లు వ్రాసిరి. "నేను 1893 సంవత్సరమునుండి భారతదేశమున నివసించుచుంటిని. నన్ను అచటిప్రజలు తమదానినిగానే భావించి మిగుల సన్మానించుచున్నారు. మేయమ్మవర్ణించిన బూటకపువర్ణనము లాదేశమున నాకెచ్చటను గాన్పింపలేదు. భారతీయ స్త్రీపురుషులతోఁ గలిసి నేను బాల్యవివాహముల నంతరింపఁజేయుటకు చాలవఱకు పనిచేసితిని. ఆదేశమున వివాహమనునది ప్రధానమువంటిది. భార్య రజస్వల యగువఱకు భార్యాభర్త లిరువురును సంగమింపరు. మానవప్రపంచమున నిదివఱకు సృజియింపఁబడనటువంటిదియు, మిక్కిలి యందమగునట్టిదియు నగు బ్రాహ్మణులవస్త్రధారణము నీమె ఎట్లు దూషించుచు వ్రాసినదో గ్రాహ్యము కాకున్నది"

సర్. ఎ. సి. ఛటర్జీ, సర్. తేజ్ బహదూర్ సప్రూ, సర్ చిమన్లాల్ సెతల్వాడ్, సచ్చిదానందసిన్హా, సర్. ఎమ్. ఎమ్. భావనాగ్రి, డ్యూబ్, కమాల్, ఇండియన్ సెక్రటరీ కౌన్సిలుసభ్యులందఱును, సర్ మహమ్మద్ రఫీకు, ఎస్. ఎన్. మల్లికు, డాక్టరు పరంజిపాయిగార్లు మేయమ్మగ్రంథమునకిట్లు జవాబు నొసఁగిరి. వీరందఱు నీకాలమున లండనులో నున్నారు. అచ్చటనే యీజాబును వ్రాసి పత్రికలకుఁ బంపిరి.

"1925-26 సంవత్సరములందు శీతకాలమున భారతదేశమున సంచారము సలిపి 'భారతమాత' యనుపేరుగల



యొక గ్రంథమును మిస్ కేథరైను మేయో యను అమెరికాదేశపుస్త్రీ వ్రాసి ప్రకటించినట్లు మాకు తెలిసినది. భారతనాగరకతను, భారతీయుల శీలమును దూషించు నిట్టి గ్రంథమును మే మిదివఱ కెన్నడైనను చదివియుండలేదు. ఆమె భారతదేశమునందు నలుగురివలెఁ దిరుగవచ్చును. తన భావములను వెల్లడిచేయవచ్చును, కాని ఏకొలఁది మాసములో మాదేశమందు సంచరించి ఆసుపత్రులలోనుండు రోగులను చూచియు, క్రిమినలుకోర్టుల రిపోర్టులనుబట్టియు, వార్తాపత్రికలయందలి మందులప్రకటనలను కనుఁగొనియు, చిరకాలమునుండి ప్రసిద్ధికెక్కిన భారతజాతియొక్క గుణశీలముల నీమె దూషించుట మేము భరింపఁజాలక యిట్లు ఖండింప నవసరము గలిగెను. ముప్పదిరెండుకోట్ల భారతీయులు నసత్యవాదు లనియు బలహీను లనియు అవినీతిపరు లనియు నీమె వ్రాసినది. భారతీయు లెవరైన యూరపునందుఁగాని అమెరికాయందుఁగాని ఈమెవలెనే ఏకొలఁదిమాసములో సంచారమును సలిపి ఆసుపత్రులయందుఁగల రోగులను, క్రిమినలు కేసులు మున్నగువాని నాధారముగఁ జేసికొని యిట్టి గ్రంథమును వ్రాసినను ఆతనినిగూడ నిట్లే ఖండించుట ధర్మము. ఇటువంటివారిని జ్ఞానులు వివేకులు నగువారు గమనించనే గమనించఁగూడదు. గతయేబఁది యేండ్లనుండియు సంఘాభివృద్ధికిని, దేశాభివృద్ధికి నెట్లు భారతీయులు పాటుపడుచున్నారో ఆప్రయత్నము లేవియును మేయమ్మకు ఈదేశమునఁ గాన్పించుటయే లేదు. వానిని చూచుట కీమె కన్ను

లందుపోరలు క్రమ్మినవి. అదియునుగాక భారతీయనాయకు
లతో సంప్రతించి సంగతులను వివరముగాఁ గనుఁగొనుటకుఁ
గూడ నీమెకు సమయము దొరకినది కాదుకాఁబోలు! ఈమె
గ్రంథమందు ప్రతిపత్రమునందును గల అసత్యములను ఖండిం
చుట కిది తావుగాదు. బ్రిటీషు వార్తాపత్రికలును, బ్రిటీషు
ప్రజలును ఈగ్రంథమును కొనియాడకున్నచో మేమిట్లు
ఖండించుటకు అవసరమే కలుగఁగూడదు.''

అని వీరు వ్రాసిన యీఖండనమును ప్రచురించవలసిన
దని లండనులోనుండు నొకవార్తాపత్రికకు పంపఁగా నాపత్రి
కా సంపాదకుఁడు దీనిని ప్రచురించలేదు. దీనికిఁగల కారణము
సర్వజనవిదితమే.

---

## 17 అధ్యాయము.

---

### ఉల్లి-ఉల్లియే - మల్లి-మల్లియే.

మేయోకన్య తనగ్రంథమందు ఉల్లి - ఉల్లియనియు
మల్లి-మల్లి యనియె వర్ణించితి నని చెప్పినది. మనము ఆలా
గుననే చెప్పెదము. పంజాబునుండి బొంబాయివఱకును,
మదరాసునుండి సంయుక్తరాష్ట్రముల వఱకును ఈమె సంచ
రించితి నని వ్రాసికొనెను. చీనానుండి పెరువఱకునుగూడ
నీమె సంచరించుచు ఆసుపత్రులనే చూచుచు మానవ
ప్రపంచము నంతటిని దూషించుచు నొక పుస్తకమును
వ్రాయవచ్చును. తరువాత ఉల్లి-ఉల్లియే, మల్లి మల్లి



యే అని వ్రాసితినని కూడ ఈమె చెప్పవచ్చును. తా
ను ఆసుపత్రులకుఁ జనుట పరిశోధన (రిసెర్చి) నిమిత్త
మని యీమె చెప్పుచున్నది. హాక్స్లేవంటి శాస్త్రజ్ఞుల కీస
మాచారము తెలిసినచో తమసమాధులందే వారలగుండి
య లవియఁ గలవు. ఈమెయొక్క పరిశోధన శాస్త్రసమ్మత
ముగా నున్నదట! శాస్త్ర మనఁగా నిజమగు జ్ఞానము, కావు
న జ్ఞానపూరితములగు నీమె వ్రాఁతలుకూడ నిజమైనవట!
ఆహా! ఏమితర్కము! (లాజికు)? ఏమి! తెలివి తేటలు!

---

### ముగింపు.

"నాగ్రంథమం దన్నియు నిజమైన సంగతులనే వ్రాసి
తిని, వానిని ఖండించుట బహుసులభమే యగును కాని అబ
ద్ధములని ఋజువుచేయుట దుస్సాధము'' అని మేయమ్మ వ్రా
సినది. ఈగ్రంథమును గుఱించి మేమును అట్లే యందుము.

గైఫాక్సు అను నతఁడు బ్రిటీషుపార్లమెంటు సభవా
రిని మండఁబెట్టుటకు ప్రయత్నించె నని మనము చరిత్రయం
దు చదివియున్నారము. ఒకరీతిగా మేయమ్మకూడ నట్లే చే
సినది. బ్రిటీషు చక్రవర్తియెడల భారతీయు లనుపమానమ
గు రాజభక్తిని గలిగియున్నారు. భారతదేశము అమెరికాసం
యుక్త రాష్ట్రములవలె సామ్రాజ్యమునుండి చీలిపోయి వేఱ
గుటకు ప్రయత్నించుట లేదు. బ్రిటీషుసామ్రాజ్యము నందుఁ
గల కెనడాదేశము వలె సరిసమానపు హక్కులను, స్వపరిపా

లనమును గలిగియుండుటయే భారతీయుల యాదర్శము. వీరియాదర్శము సఫలీకృతము కాఁగల దని దూరదృష్టిగల బ్రిటీషు రాజకీయ వేత్తలు ఎన్నోయేండ్ల క్రిందటనే చెప్పియున్నారు. మెకాలెగారీవిషయమున నీక్రిందివిధముగా వ్రాసిరి. "మన పరిపాలనమున భారతీయు లభివృద్ధిని గాంచవచ్చును. ప్రజలకు మనము మంచి పరిపాలనా విధానమందు విద్యగఱపఁగలము. పాశ్చాత్య పరిపాలనా సంస్థలను కొంతకాలము గడచిన పిమ్మట కోరఁగలరు. అటువంటి దినము వచ్చునో లేదో నేను చెప్పలేను. కాని ఆసుదినమును ఎప్పటికిని రాకుండఁ జేయుట నా కిష్టపడదు. అట్లుచేయుటకు నేను ప్రయత్నింపను. అట్టిదిన మెప్పుడు వచ్చినను ఆదినమే ఇంగ్లండు చరిత్రలో బహుసుదిన మని పరిగణింపఁ బడఁగలదు''

ప్రాచ్యులు ప్రాచ్యులే పాశ్చాత్యులు పాశ్చాత్యులే యని మేయమ్మ వ్రాసినది గాని ప్రాక్పశ్చిమ వాసుల సమ్మేళనమే ప్రాపంచికసౌఖ్యమును కలుగఁ జేయఁగలదు.

సమాప్తము

---

## దీనబంధు, సి. ఎఫ్. ఆండ్రూసుగారి ప్రత్యుత్తరము

---

### గాంధిమహాత్ముని ఉపోద్ఘాతము.

---

(సంతాపముతోడను, సంశయముతోడను ఈదిగువ ప్రకరణమునకు నేను తావొసంగితిని. ఇంకను మరికొన్నిగూడ ప్రకటింపఁబడును. మేయోకన్య కిదివఱకే చాల ప్రత్యుత్తరము లియ్యఁబడెనేమో యను సంశయముగూడ నాకుఁగలదు. మేయోకన్య మోపిన నిందలను చదివినవారు వాని కిదివఱకు ప్రకటింపఁబడిన ప్రత్యుత్తరములను, ఇపుడు ప్రకటింపఁబడుచున్న ప్రత్యుత్తరములనుగూడ చదువుచున్నారను నమ్మకము నాకున్నచో దీనబంధు, ఆండ్రూసుగారి ప్రత్యుత్తరమును ప్రకటించుటకు నేనింతగా సంశయించియుండియుండను. ఈప్రత్యుత్తరము లాపాఠకులకు చేరవనియు, అందువలన వానివిలువ చాల తగ్గుచున్న దనియు నేను తలంచుచున్నాను. మేయోకన్య హానికరమగు సిద్ధాంతమును వెల్లడించుచున్నది. ఏజాతియును ప్రపంచమునకు హానికరముగా నుండఁజాలదు. భారతదేశ మెంతమాత్రమును ప్రపంచమునకు హానికరముకాదు. మేయోవంటి గ్రంథకర్తలే హానికరులు. కేవలము ప్రత్యుత్తరములవలన నవి యెంత పవిత్రములుగను సమర్థములుగను ఉండినను గూడ తగినపని జరుగునని నేను తలంపను. అసత్యములను పలుకువారిని వ్రాయువారిని కేవలము సత్యమును పలుకుటవలనను వ్రాయుటవలనను నిరోధింపఁజాలమనియే నా అభిప్రాయము. ఇంతకంటె భిన్నమును ఉదారమునునగు పని జరిగిననే కాని హానికరమగు నీ ప్రచారమును నిరోధింపఁజాలము. కాని దీనబంధు, ఆండ్రూసుగారివంటి వారివ్రాఁతలకంటె శ్రేష్ఠమగు సాధన మేదియును నాకింకను గోచరింపలేదు. ఎట్లుయుండియూ విమర్శకమను నభిప్రాయమునందు ఆండ్రూసుగారును నేనును ఏకీభవించుటవలనను ఇట్టివ్రాఁతల కింకను అవకాశము కలదని ఆండ్రూసుగారు గట్టిగా నమ్ముచుండుటవలనను నేను కాదనఁజాలకపోతిని. మరియును మేయోకన్య గ్రంథమును చదివిన వారిలో నొకరైన నీ ప్రత్యుత్తరములను చదివి తమ దురభిప్రాయములను

మార్చుకొనఁగలిగినచో నదియును కొంతలాభమే యని ఆండ్రూసుగారివలె నేనును నమ్ముచున్నాను.)

---

## ఆండ్రూసుగారి ప్రత్యుత్తరము

మేయోకన్య గ్రంథమునకు ప్రత్యుత్తరము నియ్యవలెనని కొన్నాళులో ఆలుయిండియా ట్రేడుయూనియను కాంగ్రెసువా రేకగ్రీవముగా నన్నుకోరిరి. దీనినిగూర్చినవార్త ఇంగ్లాండు, అమెరికా దేశములలో విస్తారముగా వ్యాపించినది. ఈ ప్రత్యుత్తరము మొదట ఎంగుయిండియాలోనే ప్రకటింపఁబడవలెనని నేను ముఖ్యముగా కోరుచుంటిని. అప్రతిక ధోరణి కనుగుణమగు శైలిలోనే నేను వ్రాయుటకు యత్నించుచుంటిని. నాకు కార్యభారము మిక్కుటముగా నుండుటచే నాప్రత్యుత్తరమునే నుద్దేశించినంత పటిష్ఠముగా నుండుటకు తగిన విశ్రాంతి నాకు లభింపనందులకు నేను మిగుల చింతించుచున్నాను. ఇటుపైనైన నింతలో నట్టి విశ్రాంతి నాకు లభించునట్టి అవకాశ మేదియును గోచరింపకపోవుటచే ఈప్రత్యుత్తరమునే ప్రకటింపవలెనని సంపాదకులను నేను వేఁడుకొంటిని. ఇతర దేశములలోనైనచో నేను కాపీరైటు హక్కులను బడయఁగోరెదను గాని భారతదేశమునందు నేనట్టి హక్కులను బడయఁగోరను.

మేయోకన్య గ్రంథము ప్రకటింపంబడిన వెంటనే ఆమెకుఁగల సారస్వతజ్ఞానమునుగూర్చిన విషయములు కొన్ని వెల్లడియైనవి. యుద్ధము ముగియఁగానే ప్రచారముకొఱ కొక గ్రంథమును వ్రాయుటకామెను నియమించిరనికూడ వెల్లడియైనది. "భయద్వీపము"లను పేరుతో ఫిలిప్పైను దీవులనుగూర్చి ఆమెవ్రాసిన రెండవగ్రంథమునందుఁగూడ నిట్టిపద్ధతినే అవలంబించినది. తన యౌవనదశలో కలకత్తాలో సుప్రసిద్ధఆంగ్లపత్రికా సంపాదకుఁడుగా నుండిన ఎస్. కే. రాటిక్లిఫుగారు మేయోకన్యనుగూర్చి వ్రాసిన వాక్యము లీ సందర్భమున చాల ముఖ్యమైనవిగాన వాని నీదిగువను పూర్తిగా వివరించుచున్నాను.

"రెండేండ్లక్రితము ఫిలిప్పైను దీవులనుగూర్చి ప్రచారముకొఱకు మేయోకన్య వ్రాసిన గ్రంథమును నేను చదివితిని. ఇఁకనీమె భారతదేశ



మునకుఁగూడ నిర్భయముగా వెళ్లి ఫిలిప్పైను దీవులనుగూర్చిన భయద్వీపములను గ్రంథమున నెట్టి ఫలితమును మరల స్థాపించెనో అట్టి ఫలితమునే స్థిరపఱుచుచు భారతదేశమునుగూర్చికూడ తప్పక యొక గ్రంథమును వ్రాయఁగలదని నాకపుడే తట్టినది. అమెరికావారు ఫిలిప్పైను దీవులపై నధికారమును వదలఁగూడదు. వారు వదలినచో ఆదీవుల న్యాయవాదులును వడ్డీ వ్యాపారముచేయు షాహుకారులును అచటి సామాన్యజనులను బ్రతికియుండఁగానే వీపు చర్మములను ఒలిపించెదరు అను ఫలితమును ఫిలిప్పైను దీవులనుగూర్చి యామె తేల్చినది. భారతదేశమునందుఁగూడ మేయోకన్య యట్టిఫలితమునే తేల్చఁగలదని నాకు గట్టినమ్మక మపుడే కలిగినది. భారతదేశీయులమధ్యను కొంతకాలము నివసించినపిమ్మట నొక అమెరికాఖండవాసిగాని యైరోపాఖండవాసిగాని యెట్టి భావములను సహజముగా వెల్లడించునో అట్టిభావములనే వెల్లడించుచు నేను ముగింపఁదలఁచితిని. నేను భారతదేశమునందు అయిదేండ్లుంటిని. నాపనినిబట్టి అన్నిరకముల భారతీయులను కలిసికొనుటకు నాకు అత్యధికమగు నవకాశము లభించినది. భారతీయులలో పెక్కుమంది నాకు మిత్రులు కలరు. నేను వారియిండ్లలోనికి పోయి చూచియుంటిని. గ్రామములలోను నగరములలోను కూలిపనిచేయువారి స్థితిని నేను గమనించితిని. మేయోకన్య వివిధదేశములందలి అత్యధిక సంఖ్యాకులగు పాఠకులకు సమకూర్చిన వర్ణనమును నే నదివఱకు నామనసులో కుదుర్చుకొనిన భావములను పోల్చిచూడఁగా నాకు విచారమును విభ్రమమునుకూడ కలిగెను"

అని రాటిక్లిఫుగారు వ్రాసిరి. ఆయన పత్రికా సంపాదకుఁడుగా చిరకాలము భారతదేశమునందుండి అధికమగు ననుభవమును గడించెను. చాలకాలము భారతదేశమునందుండి భారతీయుల స్థితిగతులను అంతర్యమును బాగుగా గ్రహింపఁగలిగిన అమెరికావారికిని, ఐరోపావారికిని ఎట్టి యభిప్రాయములు సహజముగా కలుగునో అట్టి అభిప్రాయములనే వెల్లడించుచున్నానని ఆయన వ్రాసెను.

ఈప్రత్యేక విధమగు ప్రచారమునుగూర్చి చెప్పవలసిన దింతమాత్రమే కాదు. మొదటినుండియు నిగూఢముకానిదియు నిర్ధారణయైనదియు నగు రాజకీయ సంకల్పమొకటి దీనికి మూలకమయ్యేయున్నది. తెల్లజాతి

ఆధిక్యమును ప్రాజాపత్యమును నిరంతరమును గట్టిగా ప్రతిపాదించుచుండు వారి భావములనే మేయోకన్య స్పష్టముగా వెల్లడించినది. ఈ భావము ప్రబలముగానున్న దనుటకనేక సూచన లీ గ్రంథమున కలవు. ఈ ప్రాజాపత్యము నంతరించునేమో యను నాందోళనము గూడ నామె స్పష్టపఱచియుండెను.

ఫిలిప్పైనుదీవులవారికి స్వాతంత్ర్యము లభింపఁబడకుండ చేయుటకు భయద్వీపము అను గ్రంథము నామె వ్రాసినది. ఐరోపామహాసంగ్రామము ముగిసిన క్రొత్తరోజులలో నమెరికాసంయుక్తరాష్ట్రములందు ప్రజలధికమగు నౌదార్యమును వెల్లడించుచు ఫిలిప్పైను దీవులకు స్వాతంత్ర్యము నియ్యవలెనని యత్నించుచున్న మంచితరుణమున మేయోకన్య సైంధవుని వలె నడ్డుపడి ఫిలిప్పైనుదీవులలోని ప్రజలు దుర్నీతిపరులని తెలుపుచు నా గ్రంథమును వ్రాసి ప్రకటించినది.

మరల నిపుడు రాయలుకమీషను భారతదేశమునకు రానున్న గొప్పతరుణమున నీ గ్రంథమును వ్రాసి ప్రకటించినది. తాను రాజకీయములనుగూర్చి యేమియును వ్రాయనని ఆ గ్రంథములోనే నిర్ధారణగా తెలుపుచుండియు ఆదినుండి అంతమువఱకును బ్రిటిషుసామ్రాజ్యవాదమునే బలపఱచుచు వ్రాసియుండెను. ఆమె తనవాదమును సిద్ధపరచిన పద్ధతివలననే ఆమెసంకల్పము విదితమైనది. మొదటి మూఁడుపుటలలోను భారతదేశమునందలి సాంఘిక మతవిషయములగు లోపముల నామె వెల్లడించినది. ఈరీతిగా రంగమును సిద్ధపఱచినపిమ్మట బ్రిటిషుపరిపాలన ముండితీరవలెనని బాహాటముగా ప్రచారముచేయుట కనుకూలమగునట్లు తక్కినభాగమునంతను పూర్తిచేసినది.

ఉచితముగా పంచిపెట్టుటకే భారతమాత యనుపేరుగల యీ గ్రంథముయొక్క ప్రతుల నధికముగా కొనిరని తెలిసినది. ఇండియా ఐరోపా దేశములమధ్య రాకపోకలు చేయునట్టి స్టీమర్లలోనుండు గ్రంథాలయములలోను, స్టీమరు ఉద్యోగుల గదులలోను ఈ గ్రంథములు కనఁబడఁగలవు. ఆంగ్లదేశమున పార్లమెంటు రెండుసభల (ప్రభువులు-ప్రజలు) సభ్యుల కందఱికిని ఈ గ్రంథము లుచితముగా పంపఁబడెను. మూఁడుప్రతులు తన కుచితముగా పంపఁబడెనని పార్లమెంటు సభ్యుఁడగు వొక



కార్మికపక్షనాయకుఁడు స్పష్టముగా తెలిపెను. అమెరికాదేశమునందుఁగూడ నిటులే ప్రతులు విస్తారముగా పంచిపెట్టఁబడెను. ఈరీతిగా నీ గ్రంథమునకు పెక్కుకూర్పులు జరిగినను గ్రంథములన్నియు అమ్మివేయఁబడినవి. ఇతరదేశములందుఁగూడ నీవిషవాయు విటులే వ్యాపించినది. ఇండియా మెట్రోపాలిటను (క్రైస్తవమతాధికారి) దక్షిణాఫ్రికాలో నీ గ్రంథమును బహిరంగముగా నిరసించెను. ఆస్ట్రేలియా కెనడా దేశములందుఁగూడ భారతదేశమునుగూర్చి బాగుగాను న్యాయముగాను తెలిసికొనియున్న బాధ్యతగలవారీ గ్రంథమును నిరసించిరి. భారతీయులందఱు నీ గ్రంథము నేకగ్రీవముగా నిరసించిరి. స్త్రీలును పురుషులునుగూడ సమానముగానే దీనిని బహిష్కరించిరి. నాయకులగువారు, ఈ హానికిని, అన్యాయమునకును అధికమగు సంతాపమును జెంది దీనిని నిరసించుచు గ్రంథములనుగూడ వ్రాసి ప్రకటించిరి.

ఆసియాఖండము పాశ్చాత్యదేశమువంక కింకను అభివృద్ధినొందునను భయమును, ఆసియాఖండముపట్ల ప్రతికూలభావమును పాశ్చాత్యులకు మొదటినుండియు కలవు. కావున ఆసియాఖండము ఉపద్రవకరమనుభీతి నిట్టి ఆందోళనకరములగు గ్రంథములవలన వృద్ధినొందించుట కడు సులభము. మేయోకన్య మనఃపూర్వకముగా నీభీతిని ప్రబలఁజేసినది. భారతీయులకు కలిగిన బాధలను తొలఁగింపవలెనను నుదారభావముతో స్వార్థవిరహితముగ సంస్కరణమునకు పూనుకొనినదానివలె నటించుచు అతితీవ్రములగు జాతిద్వేషములను ప్రేరేపించుటకు కారణమైన యీ గ్రంథము నామె వ్రాసినది. స్వపరిపాలనమునకు భారతదేశము కేవలము అనర్హము, అది ప్రమాదకరము. ప్రపంచమునకు భారతదేశము హానికరము అను భావములను అమెరికాదేశమువారికిని, ఇంగ్లాండుదేశము వారికిని బాగుగా కలుగఁజేయుటకే ఆమె యీ గ్రంథమును వ్రాసినది.

పాశ్చాత్యదేశములందున్న భారతశత్రువు లీనూతనజాతిద్వేషకర సామగ్రిని శక్తివంచనలేకుండ వినియోగించిరి. అందువలన ఆసియాఖండవాసుల పట్లఁగల ద్వేషము మరింత ప్రబలినది. తాను పక్షపాతములేకుండ వ్రాసితినని మేయోకన్య యిప్పటికిని నుడువుచునేయుండుటచేత ఆమె పూర్వోత్తరమంతయు నిచట సాకల్యముగా వివరింపవలసివచ్చినది. ఆమె

కు భారతదేశముపట్లఁగల ప్రతికూలభావమును వెల్లడింపవలసివచ్చినది. ఈ గ్రంథము ప్రకటింపఁబడినదిమొదలు ఆమెదోషములను అసత్యములను చాల మంది గ్రంథకర్తలు వెల్లడించుచునే యున్నారు. ఎవరివాక్యముల నామె తన గ్రంథమున నుదాహరించెనో వారందఱును ఆమెవ్రాసినవ్రాఁత లసత్యములని ప్రకటించియేయున్నారు. ఆమెవ్రాసిన అబద్ధములను వారు స్పష్టముగా చూపించిరి. ఒక శీతకాలమున కొన్ని నెలలుమాత్రమే భారతదేశమున సంచారముచేసి అనామకులు తెలిపిన విషయముల నన్నిటిని చేర్చి వ్రాసినగ్రంథమునందు తప్పుడువ్రాఁతలు తప్ప మరేముండఁగలవు?

గ్రంథాంతమున తన గ్రంథమునుగూర్చి "మిత్రుని గాయములు విశ్వాసయుతములు" అనునొక సామెతనామె యుదాహరించినది. ఆమె నిజముగ భారతదేశీయులకు మేలునే కోరుచున్నయెడల మొదట తనసద్భావమును నిదర్శనపూర్వకముగా వెల్లడించిన పిమ్మట నీగ్రంథమును వ్రాసియుండఁదగును. మొదట భారతీయులతోపాటు కష్టముల ననుభవించుట కామె నేర్చుకొనియుండవలసినది. అట్లు చేయకుండ చేతులార నిట్టి గాయములను కలిగించుట కామె సాహసించి యుండఁగూడదు. స్వతంత్ర దేశములనుండి భారతదేశమునకు రానున్న నిక్కపు మిత్రులెవరును భారతీయుల స్వాతంత్ర్యముపట్ల సానుభూతినైనను కనీసపక్షము వెల్లడింపకుండ దేశమున నడుగిడనొల్లరు. కాని బ్రిటిషుపరిపాలనమునకు లోఁబడియుండవలె నననదియే మేయోకన్య సద్భావముతో చేయునట్టి ఉపదేశమైయున్నది. తాను వ్రేలెత్తిచూపించిన సాంఘికలోపము లన్నియును విదేశీయపరిపాలనమున వృద్ధినొందుచున్నవని ఆమె గ్రహింపనొల్లకుండనున్నది. (యంగుయిండియా. 17-5-28)

## రెండవ లేఖ

జగద్విఖ్యాతులును అకలంకచరిత్రులును సర్వజనపూజ్యులు నగు, టాగోరు, గాంధిగార్ల పేర్లను ఈమె భారతదేశమును నిరసించుటకు చాల సార్లు తన గ్రంథమున పేర్కొనినది.

"అహమదాబాదునగరమునందే యొకనామమాత్రమగు గోరక్షణశాల యున్నది- దాని నాపేరున పిలుచుటకుఁగూడ దాని కెట్టి అర్హతయును లేదు. ఇటులుండ గాంధిగారు హాయిగా సబర్మతిలో సౌఖ్యమున



సంతోషప్రదమునగు తన ఆశ్రమమునఁగూర్చుండి గోరక్షణనుగూర్చి యేమేమో వ్రాయుచుండును" అని యీమె వ్రాసినది. భారతీయులలో అత్యంత నీతిసంపన్ను లనఁబడువారుగూడ నొకరీతిని తెలుపుచు మరియొకరీతిని చేయుచుందురని చదువరులకు తోఁపింపఁజేయుటకే యీమె యిట్లు వ్రాసినది. టాగోరుగారుసంఘసంస్కరణమునుగూర్చియొకవిధముగాబోధించుచు మరియొక్కవిధముగా నడుచుకొనుచుందు రని యీమె మరింత ద్వేషపూర్వకముగా వ్రాసినది. ఈమెగ్రంథమునం దీభాగము మిక్కిలి అధమముగా నున్నది గాన మౌనముతో దీనిని నిరసించుట చాలదు. దీనివలన నీమెస్వభావమును పద్ధతియును వెల్లడియగుచున్నవి గాన ముందుగా దీనిని గూర్చియే వ్రాయవలసియున్నది.

---

## టాగోరుగారు

మొదట నేను టాగోరుగారినిగూర్చి వ్రాసెదను. 15 ఏండ్లనుండి నే నాయనయాశ్రమమునందు నివసించుచున్నాను. దినదినమును ఆయన సాహచర్యలాభమును నేను బడయుచుంటిని. పాశ్చాత్యులలో ఆయన హృదయరహస్యములను నాకంటె బాగుగా నెఱుఁగఁగలవా రెవ్వరును లేరు. ఈమెవ్రాసిన సాంఘికానర్థములను టాగోరుగారు నిరసించినంత కఠినముగా మరేభారతీయ నాయకుఁడునుగూడ నిరసించియుండలేదు. అందులకు భారతీయులే పెక్కుసారులు టాగోరుగారి నధిక్షేపించి యుండిరి. ఆయన కిపుడు దాదాపు డెబ్బదియేండ్లున్నవి. ఆయనకు ప్రాజ్ఞతవచ్చినదిమొదలు నేఁటివఱకును సంఘ సంస్కరణమును గూర్చి వ్రాయువారలలో అగ్రగణ్యుఁడుగానే యుండును. దీనికి ప్రతిక్రియను దేశీయులే చేయనర్హులని టాగోరుగారు నిరంతరమును వ్రాయుచుండుటచే ఆయన పలుకుబడి గూడ తగ్గినది. శాంతినికేతనమునందు టాగోరుగారు కట్టించిన పాఠశాలలో బాలురు బాలికలును కలసిమెలసియుండియే స్వేచ్ఛగా విద్య నభ్యసించుచున్నారు. బాల్యవివాహములను నిర్బంధవైధవ్యమును ఘోషాపద్ధతిని అస్పృశ్యతను టాగోరుగా రెల్లప్పుడును నిరసించుచునే యుందురు. వైద్యము, పారిశుద్ధ్యము, వ్యాధినిరోధము మున్నగువానినిగూర్చి నవీనపద్ధ

తులే ఆయన ఎల్లప్పుడును ప్రోత్సాహపఱుచుచుండును. వీనికొఱకు తన ఆదాయమునంతను ప్రతివత్సరమును టాగోరుగారు వ్యయపఱుచుచుందురు. పిత్రార్జితమునుగూడ వీనికొఱకే వ్యయపఱిచెను. ఇట్టి టాగోరుగారిని ఈమె యత్యధికముగ ప్రశంసించుట న్యాయమైయుండ నన్యాయముగ నామె యీరీతిని నిరసించినది.

టాగోరుగారు శిశువుల పెండ్లిండ్లను సమర్థింతురని రెండుచోట్ల నుదాహరించినది. హైందవుల వివాహధర్మమునుగూర్చి టాగోరుగా రొసంగిన యుపన్యాసమునందలి కొన్ని వాక్యములను పూర్వాపరసందర్భము లేకుండ ప్రమాణముగ పేర్కొనినది. ఐరోపాఖండమునకు వెళ్లినపుడు నవీనపద్ధతులను భారతదేశమునం దున్నపుడు కేవలపూర్వాచారమును టాగోరుగా రవలంబించుచుందురని మిసు మేయో వ్రాసినది. ఆయన చెప్పెడుదానిని శిలాక్షరముగా నాచరించుచుండును. అతఁడు జంకులేని సంస్కర్త అని టాగోరుగారికీర్తిని స్వభావమును ఆమె బాగుగా తెలిసికొనియున్నచో ఆమె గ్రహింపఁగలిగెడిది. వంగభాష నామె చదువఁగలిగియుండినచో మహాకవి సాంఘిక దురాచారములను మిక్కిలి కఠినముగ విమర్శించునను విషయము ఆమెకు తెలిసియుండును. ఆమె శాంతినికేతనమునందు కొంతకాలము నివసింపఁగలిగినచో భారతపుత్రులలో నగ్రగణ్యుఁడగువాని కొకనికి దారుణమగు నన్యాయము తా నొనరించితి నని ఆమె గుర్తించియుండఁగలదు.

టాగోరుగారికి ఆయుర్వేదవైద్యమునం దభిమానము మెండు. పాశ్చాత్యవైద్య నవీనపద్ధతుల నాతఁడు నిరసించునని యీమె వ్రాయుట మరింత నీచము. ఇందుల కామె కెట్టి ఆధారమును టాగోరుగారి గ్రంథములలో లభింపనందున తానే యొకదానిని కల్పించినది. “ఆయుర్వేదశాస్త్రమునకు పాశ్చాత్యవైద్యశాస్త్రము లేవియు నీడుగావని రవీంద్రనాథకవివంటివా రనుచుందురు” అని యీమె “టాగోరు వాక్యములు” అను శీర్షిక క్రింద వ్రాసెను. ఇది కేవలము కల్పితము. ఈ యభిప్రాయ మాయన కెంతమాత్రమునులేదు. ఏ గ్రంథమునందును ఆయన వ్రాసియుండలేదు. ఆయన పాశ్చాత్యవైద్యమునందు చాల గౌరవముకలవాఁడు. దాని నాయన పెక్కుసారులు వెల్లడించెను. పాశ్చాత్యవైద్యశాస్త్ర మాయనకు చాల



బాగుగా తెలియును. ఆయనకుమారుఁడు అమెరికాలో పాశ్చాత్య నవీన వైద్యశాస్త్రమునే చదువుచున్నాఁడు. పాశ్చాత్య వైద్య పారిశుద్ధ్య విధానములు ప్రపంచమున ప్రజల దురవస్థ నత్యధికముగ తొలఁగించెనని ఆయన తెలుపుచుండును. పాశ్చాత్యవిషయములలో ఆయన మిక్కిలి హెచ్చుగ నీ రెండుశాస్త్రములనే ఆదరించుచుండును.

---

## గాంధిగారు

గాంధిగారినిగూర్చి కూడ ఆమె యిటులే యిందుల కేమియును తీసిపోనిరీతిని అసత్యములను ప్రకటించినది. ఆయనవాక్యములలో కొన్నిటి కామె గాంధిగారిని ప్రశంసించిన మాట నిజమె కాని గాంధిగారిని నిరసించుటయే ఆమె ప్రధాన సంకల్పము. పూనానగరమున గాంధిగారికి శస్త్రముచేసిన డాక్టరునకును గాంధిగారికిని గల మైత్రినిగూర్చి ఆమె వ్రాసిన వ్రాఁతయంతటిపాడు వ్రాఁత మరేదియును కనుపడదు. ఇంత కర్కశమగు వర్ణన మామె గ్రంథమున మరేదియును కనఁబడదు. ఆరోజులలో నేను గాంధిగారియొద్దనే యుంటిని. ఆమె వ్రాసిన దంతయును కల్లయే. గాంధిగారును డాక్టరును ఎన్నఁడును అనియుండని మాటలను వా రని నట్లామె వ్రాసినది. రెల్లీ తిబ్బికాలేజీలో భారతీయపాశ్చాత్య వైద్యవిధానములు రెండును సమముగా బోధింపఁబడుచున్నవి. అచట ప్రారంభోత్సవసమయమున మహాత్ముఁ డొసంగినయుపన్యాసమును చదివినచో పాశ్చాత్య వైద్యశాస్త్రవిషయమున గాంధిగారిభావములు వేఱనియు మేయోకన్య వ్రాసినది వేఱనియును స్పష్టముకాఁగలదు.

ప్రపంచమునం దఖిలదేశములవారిచేత నత్యధికముగ గౌరవింపఁబడుచున్న భారతమహానాయకులగు గాంధి రవీంద్రులను మేయోకన్య యిట్లు దూషించుటయే కాక వారివలె విఖ్యాతులు గాని యితరభారతప్రముఖుల వాక్యములనుగూడ నీమె తన గ్రంథమున విపరీతముగా నుదాహరించియున్నది. లాహోరులో నివసించుచున్న కే. ఎమ్. బోసుకన్య యేప్రాణికినిగూడ నెన్నఁడును ఎట్టి హానియును చేయఁజాలదు. ఆమెతో మేయోకన్య వెనుక సంభాషించెను. ఆసంభాషణను వ్రాసి బోసుకన్యకు చూపకుండనే

అంతయును తారుమారుగా తనగ్రంథమున ప్రకటించినదని బోసుకన్య నాకు వ్రాసినది.

వివిధజాతులలో సోదరభావమును సమత్వమును పెంపొందవలెనని నపరస్పరము నిట్టి మామూలుమర్యాదలను పాటించు టత్యవసరము గాన మేయోకన్యదురుద్దేశమునకు మరియొక నిదర్శనమును గూడ నే నిచట చూపఁదలఁచితిని. ఆగ్రాకు సమీపమున దయాలుబాగు అనుచోట రాధాస్వామిమతమను మతప్రతిష్ఠాపన మున్నది. ఆయనకు 2000 మందిశిష్యులు కలరు. ఎవరో ఆమతాధిపతిపేర నొక శిఫార్సు ఉత్తరము నియ్యఁగా మేయోకన్య అచటి కేఁగెను. మతాధిపతి ఆమెను బాగుగ నాదరించి గౌరవించెను. ఆయాశ్రమమునకు నే నిటీవల వెళ్లి చూచివచ్చితిని. పరిశుభ్రతకును పారిశుద్ధ్యమునకును ఆదర్శప్రాయముగా నున్నది. బాలికలకు బాగుగా విద్యనేర్పి యుక్తవయస్సు వచ్చినపిమ్మట నే వారికి వివాహము చేయుచున్నారు. ప్రసవసమయమున స్త్రీలకు సకలసదుపాయములను చేయుట కచట నొక వైద్యశాలకలదు. అచట ఘోషాపద్ధతి అస్పృశ్యత వర్ణవిభేదము మున్నగున వేవియును లేవు. ఆయాశ్రమము భారతీయులవలననే లాభకరముగ పరిపాలింపఁబడుచున్నది. మేయోకన్యవెల్లడించిన పాశ్చాత్యాదర్శములను సరిగా నెఱవేర్చుటలో ఆయాశ్రమమునకు సాటియగునది మరేదియును గూడఁ గనఁబడదు.

దయాలుబాగులో ఆమెకోరిన ఆరోగ్యములను గూర్చినయేర్పాటులు మిక్కిలి శ్రేష్ఠముగా నున్నవి. ఇటులున్నను గూడ నాయాశ్రమమును గుఱించి ప్రశంసాపూర్వకమగు నొక్క వాక్యమునైనను ఆమె వ్రాయలేదు. విషయముల పట్టికలో నీ యాశ్రమముపేరే లేదు. అచట నీతికే ప్రాధాన్యమియ్యఁబడెను గాని మతమునకు ప్రాధాన్య మీయఁబడలేదు. ఇట్టి సుగుణములెన్నియో యుండఁగా వీనినిగూర్చి యేమియును వ్రాయకపోవుటయేగాక ఆవులపట్ల క్రూరత్వమను విషయమునుగూర్చి ఆమెకును మతాధిపతికిని జరిగిన సంభాషణలో పూర్వాపరసందర్భము లేకుండ నొక వాక్యము నామె యెత్తి మతాధిపతియభిప్రాయమునకు కేవలము విపరీతమగు నర్థమును తన కనుకూలమగునట్లు కల్పించి ఆమె తన గ్రంథమున వ్రాసినది.



ఇట్టి యసత్యముల నత్యధికముగ నామె తన గ్రంథమున వ్రాయుటచే భారతీయ ప్రముఖులలో పెక్కుమందికి ఏవగింపు తీవ్రముగా కలిగినది. దీనివలన భిన్నదేశములవారికి సద్భావము పెంపొందించుటకు ప్రబల నిరోధ మేర్పడినది. ఈయనర్థమింతలో తొలఁగుటకెట్టి యవకాశమును కనఁబడదు. ఇటుపైని పాశ్చాత్యదేశములనుండి యెవ రెట్టి సద్భావముతో భారతభూమికి వచ్చినను వారు మిగుల సజ్జనులైనను మైత్రిని వృద్ధినొందించుటకే వారు వచ్చియున్నను మేయోకన్యవలన వంచితులైన భారతీయులిఁక నెవ్వరికినిగూడ మనఃపూర్వకముగ స్వాగతమియ్యఁజాలరు. ఎవ్వరిని విశ్వసింపఁజాలరు. ఎల్లవారును ధారాళముగా భారతీయులతో కలసిమెలసి యుండుటకు ప్రబలతమమగు నిరోధమును మేయోకన్యతన అవజ్ఞతవలననే కలుగఁజేసినది. మరి పెక్కు వత్సరములకుఁ గాని యీఅవిశ్వాసము తొలఁగదు. ప్రాక్పశ్చిమ దేశములవారికి సోదరభావ మభివృద్ధి నొందుటకు పరస్పరపరిచయ మధికముగ నుండవలసిన ఆవశ్యక మధికముగా నున్న ప్రస్తుత సమయమునందే యిట్టి కృతఘ్నత నీమె చూపుట మరింతహానికరమైనది. భారతదేశమునందు శాంతినికేతనమే నాకు నివాసస్థలము. మేయోకన్య తనగ్రంథమున టాగోరుగారిని నిరసించుచు వ్రాసినది. దానిని చదువుటవలన ఆశ్రమవాసుల కందఱికిని అధికమగు సంతాపము కలిగినది. ఈమధ్య మరియొక స్త్రీ తానాశ్రమమును చూడఁగోరెదనని టాగోరుగారికి తంతివార్త నంపినది. ఈమెగూడ వార్తాపత్రికలకు వ్యాసములను వ్రాయుచుండును. ఈవార్త ఆశ్రమవాసులకు తెలియఁగానే యీమెగూడ మేయోకన్యవలెనే చేయునేమో గాన నీమెతో సంభాషించుట కంగీకరింపవలదని ఆశ్రమవాసు లందఱును టాగోరుగారిని వేఁడుకొనిరి. టాగోరుగారత్యంత విశాలహృదయులు. ఎవరివిషయమునను ఆయన కెట్టి అవిశ్వాసమును లేదుగాన ఆయన అందులకంగీకరింపలేదు. ఈ స్త్రీ శాంతినికేతనమునకు వచ్చినది. "మేయోకన్య గ్రంథమును ప్రకటించుటవలన నాసంచారమునకు చాల నిరోధము కలిగినది. భారతీయులు మనఃపూర్వకముగ నాకు స్వాగతమొసంగఁజాలకున్నారు. వారు ధారాళముగ నాతో మాటలాడుటకు జంకుచున్నారు" అని ఆమె నాతో చెప్పినది. ఇట్టి యవజ్ఞతలు చాలసారులు జరిగినచో అమూల్యమగు పరస్పర విశ్వాసము తొలఁగిపోవుట నిశ్చ

యము. విదేశములనుండి భారతదేశమునకు మైత్రినిగోరివచ్చు వారెవరును తమకు కనఁబడినలోపముల నన్నిటిని అతిశయోక్తులతో వెల్లడించుటకును గుణముల నన్నిటిని కప్పిపుచ్చుటకును ఎంతమాత్రమును ప్రయత్నింపరు. ఇట్లుచేయువారు హానిని కలిగింపఁగోరువారేయని స్పష్టముగ తెలుపవచ్చును. మేయోకన్య గ్రంథము వెలువడఁగనే భారతదేశమునం దన్నిపక్షముల వారునుగూడ దానిని కఠినముగ విమర్శించిరి. ఈ గ్రంథమును సద్భావముతోనే వ్రాసితినని ఆమె తనగ్రంథమున వ్రాసియుండినను క్రియలో నది అసత్యమని దీనివలననే స్పష్టమగుచున్నది.

ప్రపంచమునందు కార్మికులందఱును సూర్యోదయము మొదలు సూర్యాస్తమయమువఱకును కర్మాగారములలోను పొలములలోను కష్టపడి పనిచేయవలసియుండుటచే నీమెగ్రంథమును వారెవ్వరును చదువఁజాలరు. వారు దీనినిగూర్చి యితరులవలననే తెలిసికోవలసియుండును. భారతదేశమునకు ప్రతికూలములగు విషయములు అతిశీఘ్రముగ విదేశములలో వ్యాపింపఁజేయఁబడుచున్నవి. ఈగ్రంథమున చాలపుటలున్నవి. విషయములు చాల హెచ్చుగ నున్నవి. నమ్మఁదగిన ప్రమాణములు కలవు అని తెలుపఁబడెను. భారతీయులు అనాగరకులు సాంఘికముగ వెనుకఁబడియున్నారు. వారింతటి అనాగరక స్థితిలోనున్నారని ప్రపంచవాసు లిదివఱ కెన్నఁడును దలఁచియుండలేదు. వారు నీతిబాహ్యులు. వారిలో స్త్రీపురుషసంబంధము కడు నీచముగ నున్నదని తెలుపఁబడెను.

స్వార్థపరులు అనుచితపద్ధతుల ననుసరించి యిట్టి అసత్య ప్రచారమును చేయుచున్నారనుటకు స్పష్టమగు నిదర్శనముకలదు. ఈగ్రంథము ప్రకటింపఁబడిన పిమ్మట బ్రిటను దేశమునందు కార్మికపక్షమువారికి భారతీయుల విషయమునం దిదివఱకున్న భావములలో కొద్దిగ మార్పుకలిగినది. ఇదివఱకున్న సద్భావము కొంతవఱకు తగ్గినది. ఇపుడు వారు భారతీయుల పద్ధతులను కఠినముగ విమర్శింప నారంభించిరి. ఈ గ్రంథము విరివిగ వ్యాపింపఁజేయఁబడుటచే బ్రిటను భారతదేశములకు విభేదము అధికమైనది.

## మూఁడవ లేఖ.

భారతీయులపై నీమె మోపిన నేరములలో వ్యభిచారము లేక విషయలోలత యనునదియే మిక్కిలి గొప్పనేరము. దీనిని గూర్చి యీమె చాల



సారులు వ్రాసినది. దీనివలన దారిద్ర్యము దుస్థితిజాతిక్షయముకూడకలుగుచున్నవని యీమె వ్రాసినది. ఆమె మిక్కిలి స్పష్టముగా వ్రాసియుండుటచే వానిని మరల నిచట వివరించు టనవసరమే గాని వానిని నేనుఖండింపఁబూనితిని గాన అందుకొఱకు వాని నిచట వివరింపవలసివచ్చినది. అది అనివార్యమగుట వలననే విధిలేక నేను వాని నిచట వివరించుచున్నాను. ఆమె వ్రాసిన వానిలో కొన్ని కేవలము ఆమెకు మానసికముగ కలిగిన దుష్టానుమానములే. వాని కెట్టి ఆధారమును లేదు. ఇతరుల ప్రోత్సాహముననామె యటులు వ్రాసినదేమో! బురదను విస్తారముగా విసరినచో కొంచెమైన నంటుకొనక మానదను లోకోక్తి కలదుగాన కడు సంగ్రహముగానే వానినిట వివరించెదను.

"అవివాహితలగు కన్యకలు తలిదండ్రుల చెంత నున్ననుగూడ వారితరులగు పురుషులవలన వశపఱుచుకొనఁబడుదురను భీతి తలిదండ్రుల కెల్లప్పుడును కలుగుచునేయుండును." అని ఆమె వ్రాసినది. ఇది మిక్కిలి అసత్యమగు అపనింద. దీనికి స్థిరమగు నాధార మేదియును లేదు. "యువకులలో 25-30 ఏండ్లమధ్య వయసువారిలో 10 మందికి 7-8 మంది వ్యభిచారమువలన శరీరమును పాడుచేసికొని యెందుకును కొఱగానివారగుచుందురు. వారు వ్యభిచారమువలన అనఁగా అధికమగు స్త్రీలోలతవలన నపుంసకులును దుర్బలులునగుదురు." అని ఆమె మరియొక దారుణమగుఅపనిందను మోపినది. "భారతదేశమున స్త్రీలును పురుషులును యావన్మందియును గూడ సుఖవ్యాధులతో నిండియున్నారు." అను మరియొకనింద మోపినది "భారతదేశమున చాలవఱకు యువతులందఱును 8.14 యేండ్లమధ్యనే బిడ్డను కనుచుందురు" అనునది మరియొక నింద. కడపటినింద నిరాధారమని లెక్కలవలన సులభముగనే ఋజువుచేయవచ్చును.

"భారతదేశమున ప్రతియింటను యువతులును యువకులును మానవులు చేయరాని అసహజములగు దుర్నీతికార్యములను చేయుచుందురు." అని ఆమె చాలమోటుగానే వ్రాసినది. కాని యిది చాల అవాచ్యముగ నుండుటవలనను దీనికి వినికిడితప్ప ఆమెకెట్టి ఆధారమును లేకపోవుటవలనను దానిని నేను వదలివేసితిని.

వీనియన్నిటికిని సమాధానమిచ్చుచున్నాను. ఇతరదేశముల యువ

జనులతో పోల్చిచూచినచో భారతదేశమునందలి యువజనులు నిరుపమాన
మగు నీతిని మితత్వమును కలిగియున్నారనియే నేను స్వానుభవమువలన
చెప్పఁగలను. కళాశాలలలో చదువువారితోను గ్రామములలో నివసిం
చువారితోను గూడ నేను నిరంతరమును కలసిమెలసి యుండువాఁడనగుటచే
బాగుగ నాలోచించియే నిష్కర్షగ నేనిట్లు నిర్భయముగ వ్రాసితిని.
కావున నిది ముఖ్యముగ నమ్మఁదగదని తెలుపుచున్నాను. సత్యస్థితిని తెలిసి
కొనుటకు నాకుఁగల అవకాశములు మరెవ్వరికినుండవు. భారతదేశమున
ప్రస్తుతసమయమున ప్రజలజీవితములో నేవిషయములలో చాలహానికర
ములగు మార్పులు కలిగినవో వానినిగూర్చి దాఁపరికములేకుండసమగ్రముగ
నేను ముందుముందీ లేఖలలో వ్రాయఁదలఁచియే ఉన్నాను. ఈ దురాచార
ములుకొన్ని అత్యధికమగు హానిని కలిగించుచున్నవి. నేను నాజీవితమునం
తను సత్యనిరతియందే కడపుచున్నాను కావున స్త్రీలోలతను గూర్చి
మాత్రము యితరదేశములయువజనులతోపోల్చి చూచినచో భారతీయ
యువజనులు అత్యధికముగ ఇంద్రియనిగ్రహమును నీతిబలమును కలిగి
యున్నారని తెలుపుట నాకు ముఖ్యకర్తవ్యమై యున్నది:

ఈ విషయములను బాగుగ తెలిసికొనుటకు మేయోకన్యకు కలి
గిన అవకాశములకంటె వేయిరెట్లధికముగ నాకవకాశములు కలుగఁజేయఁ
బడెను. భారతీయుల విశ్వాసమునకు పాత్రులైన వారితో వారు మన
సిచ్చి మాటలాడెదరు. అట్టి ఇష్టాగోష్ఠి సంభాషణలలో తమ సాంఘికపద్ధ
తులలోఁ గల లోపముల నన్నిటిని వారు స్పష్టముగ వెల్లడించెదరు. ఈవిష
యమున భారతీయులకు మరేదేశమువారునుగూడ సాటికాఁజాలరు. వారి
విశ్వాసమునకును ప్రేమకును పాత్రులగువారిని వారు ఆత్మీయులవలెనె
చూచెదరు.

కావున మేయోకన్య వ్రాసిన రహస్యకరములగు నీ నైతికసమస్య
లనుగూర్చి ఆమెగ్రహింపవలెననినను సాధ్యముకాని ఆంతరంగిక విషయము
లనుస్వయముగ నేను ముఖాముఖిని గ్రహింపఁగలిగియున్నాను. కావున ఆ
మెవ్రాసిననీచతమవాక్యములను చదువుటవలన నాకత్యధికముగ ఆగ్రహము
కలుగుట తటస్థించినది. ఇతరజాతులవారితో పోల్చిచూచిన కుటుంబవిష
యములలో భారతీయులలోపములు మిక్కిలి తక్కువగనుండునపుడును



వారు చాల నీతిబలమును ఇంద్రియనిగ్రహశక్తిని కలిగియుండఁగ నపుడును
ఆమె యిట్టిదారుణములను అసత్యములను వారి రహస్యగృహకృత్యములను
గూర్చివ్రాయుట చాల నీచము.

భారతీయులకు వీర్యశక్తి మిక్కిలి హెచ్చుగానున్నదని చరిత్రకా
రులందఱునుగూడ వ్రాసియున్నారు. ప్రపంచమున మేధాశక్తిలోను శరీర
దార్ఢ్యములోను భారతీయులు నిరుపమానులనిగూడ వారువ్రాసిరి. భార
తదేశమునందలి అధికోష్ణము శరీరదార్ఢ్యమునకు ప్రతికూలముగ నుండినను
గూడ భారతీయు లిట్టి ఆధిక్యమును బడయఁగలుగుచున్నారు. శాశ్వతయౌ
వనమును బడయఁదగిన రహస్యసాధనము నేవారు పడయఁగలిగిరనితోఁచుచు
న్నది. నిజముగ నత్యధికమగు నిట్టి దుర్వ్యసనమునకు గురియైన వారెవ్వరు
ను గూడ నిట్టిశక్తులను బడయఁజాలరను విషయమందఱెఱిగినదే. భారతీ
యులు నిజముగావిషయవివశులేయైనచో నింతకాలము వారు నిరుపమానము
లగు మానసిక శారీరకశక్తుల నెటులు పడయఁగలిగియుందురు? అట్టి దుర్వ్య
సనములకు గురియైనబాబిలోనుకును, రోముకును ఎట్టిగతి పట్టినదో అట్టి
గతి భారతీయులకుఁ గూడ పట్టవలసినదే గదా? గ్రామములలో నివసించు
వారు మరీ నీతిమంతులు. వారి వీర్యశక్తి చాలహెచ్చుగా నుండుటకు
ముఖ్యముగా గ్రామనివాసమే కారణమని ముందు మీకు తెలియఁగలదు.

మేయోకన్య మోపినట్టి దారుణ నిందలను ఖండించుటకు బలవదా
ధారములుకాని లెక్కలను ప్రకటించుట నా కెంతమాత్రము ఇష్టములేదు.
అటులు లెక్కలను మాత్రమే చూపి మిన్నకున్నచో నమ్మఁదగిన పర్యవసా
న మేదియును కలుగదు. కావుననే నేను స్వానుభవమునుగూర్చి యింత
దూరము వ్రాయవలసివచ్చినది. నేనుగూడ లెక్కలను కొన్నిటినివ్రాయక
తప్పదు గాని వానిని చాలకొద్దిగానే వ్రాయుటకు ప్రయత్నించెదను.

సాధారణముగా కార్మికులకు విస్తారముగ తీరిక యుండదు. దీర్ఘ
వ్యాసములను లెక్కలను వారుశ్రద్ధగాను, సాంతముగాను చదువఁజాలరు.
తమకు విశ్వాసపాత్రులగువారు తెలిపెడు స్వానుభవములను వారధికము
గా విశ్వసించెదరు. నాకు మానవసేవయే ముఖ్యకర్తవ్యమగుటచే ప్రత్యక్ష
స్వానుభవమువలన కలిగినరీతిగ మరిదేనివలనను గట్టినమ్మకము కలుగదని
నాకు బాగుగా తెలియును. ప్రస్తుతము భారతజాతికంతకునుగూడ కళంక

మాపాదింపఁబడియుండుటచే నీ విషమస్థితిలో యోగ్యులగువారికి మేయోకన్యగ్రంథమువలన కలిగిన మానసికాందోళనమును తొలఁగించుటకు స్వానుభవమును స్పష్టముగా వెల్లడించుటయే ఉత్తమపద్ధతియని నిశ్చయించితిని.

---

## నాల్గవ లేఖ.

భారతదేశీయుల కుటుంబజీవనమును సరిగా తెలియఁజేయుటకు మేయోకన్య వ్రాసిన అసత్యపువ్రాఁతలను ఖండించినంతమాత్రమున చాలదు. నిర్ధారణగా కొన్నివిషయములనుగూడ వివరింప వలసియున్నది. పాశ్చాత్యదేశములవారీయథార్థవర్ణనమునే ముఖ్యముగా తెలిసికొనఁ గోరుచుందురు. భారతదేశమున ప్రజలలో 100-కి 90 మంది గ్రామములలోనే నివసించుచున్నారు. కాని నగరములలో నివసించుటలేదు. వారు చిన్నచిన్న కుటీరములలోనే నివసించుచున్నారుగాని దివ్యభవనములలో నివసించుటలేదు. పెద్దపట్టణములు చాల తక్కువ. వానిలో చాలవఱకు క్రొత్తగా నిర్మింపఁబడినవే. జానపదులలో హెచ్చుమంది పట్టణములకు చాల దూరముగనే యుందురు. వారికి రైలుమార్గములు కడుదూరముగానుండును. కొన్ని గ్రామములు జనపదములతో నెట్టి సంబంధమును లేకుండఁగూడ నున్నవి.

ఈజానపదులే అన్నివిధములను ప్రాచీనకాలమునందును ఇపుడును గూడ మూలాధారముగా నుండియున్నారు. భారతమాతస్వరూపమును నిజముగా నీగ్రామములలోనే చూడవలెను గాని కలకత్తా బొంబాయి మున్నగు నగరములందు కాదు. ఈగ్రామసంఘములకు ప్రత్యేకలక్షణమును ప్రత్యేకస్వత్వమునుగూడ నున్నవి. వానిఅంతర్యరహస్యమును కనుఁగొనవలె నని చాల జాగరూకతతోను ఆసక్తితోను తెలిసికొనవలెను.

భారతదేశమును గూర్చిన ముఖ్యతమమగు నీయంశమును మేయోకన్యగూడ తొలుదొలుతనే గ్రహింపఁగలిగినది.

“గ్రామములు- గ్రామములు- గ్రామములు- భారతదేశమున నిజమైన జనస్థానము లివియే. విశాలమగు భారతభూమి యందంతటను ఈగ్రామములు చెదరియున్నవి. ఒక గ్రామమునకును మరియొకగ్రామమునకును పెక్కుమైళ్ళదూరము కనఁబడుచుండును. ప్రతిగ్రామమునను ఇండ్లు చాల



కొద్దిగానే యుండును. అవి మట్టిగోడలు గల గుడిసెలు. వారు మొదట నొకగోతిని త్రవ్వి ఆమట్టితో దానిచుట్టును ఇండ్లను కట్టెదరు. ఆగోతిలో కొంతనిలువ మురికినీ రుండును. ఆనీళ్లలోనే గ్రామస్థు లందఱును స్నానముచేయుదురు. బట్ట లుదుకుదురు. ఆనీళ్లనే త్రాగుదురు. ఇట్టిగ్రామములలోనే 100 కి 90 మంది నివసించు చుందురు.” అని ఆమె తనగ్రంథమున నొకచోట వ్రాసినది.

భారతదేశమునందు వ్యవసాయమే ప్రధానమగు వృత్తియను ముఖ్యాంశమును మేయోకన్య గ్రహింపఁ గలిగిన దని దీనింబట్టియే మనము తెలిసికొనఁ గలుగుచున్నాము. ఈవిషయము నామె గ్రహించినపిమ్మటఁ గూడ స్త్రీపురుష సంబంధమగు సమస్యనుగూర్చి ఆమె ఒకదానితరువాత నొకటిగా విపరీతకల్పనలు చేయుట కేవలము నిర్హేతుకమే యగుచున్నది. ఆకల్పనలు గ్రామముల విషయమున నిజము కాఁజాలవు.

భారతదేశమునందు గ్రామములే మిక్కిలి హెచ్చుగా నున్న వని మనము గ్రహింపఁ గలిగినచో నైతిక సమస్యలను గ్రామములలోని స్థితిగతులనుబట్టియే నిర్ణయింపవలెనుగాని పట్టణములలోని స్థితిగతులనుబట్టి నిర్ణయింపఁగూడ దను విషయముగూడ నిర్ధారణ యగును. గ్రామములలోని నైతికస్థితి అతినీచముగా నున్నచో భారతదేశమునందలి నైతికస్థితి కడునీచముగా నున్న దనియే చెప్పవలసియుండును. గ్రామములలోని నైతికస్థితి యిప్పటికిని బాగుగానేయున్నచో భాగతదేశపు నైతికస్థితి యిపుడుగూడ చాల బాగుగానే యున్నదని చెప్పవలసియుండును. క్రొత్తగా నిర్మింపఁబడిన పట్టణములలోను, యంత్రశాలలు గలప్రదేశములలోను తొలఁగింపఁబడవలసిన దురాచారములును, దురభ్యాసములును చాల నుండవచ్చునుగాని గ్రామములలోమాత్రము ప్రజలు చాల నీతియుతులుగా నున్నారనియును వ్యభిచారదోష మచట నంత ప్రబలముగా లేదనియును గూడ నేను నమ్ముచున్నాను.

భారతదేశమునం దేడులక్షల గ్రామము లున్నవి. ప్రతిగ్రామమునకును ప్రత్యేక లక్షణ మున్నది. అట్టిచో నొకవిదేశీయుడు యావజ్జీవమును ఆదేశమున నివసించుచుండిననేకాని ముఖ్యవిషయములను తానిప్పటికి గ్రహింపఁ గలిగితి నని చెప్పఁదగినంత అనుభవ మతనికి కలుగదు. భారతీయుల

ఆచారములను గ్రహించుట చాలకష్టమగుటచే దీర్ఘకాల మచ్చట నివసించుచున్న వారికిఁగూడ మొదట తాము స్థిరపఱచుకొనిన అభిప్రాయములను మార్చుకొనవలసియే వచ్చుచుండును.

కొన్ని ముఖ్యలక్షణములుమాత్రము స్పష్టముగ గోచరించుచుండును. దౌర్జన్యసంబంధములగు నేరములు భారతదేశమునందు జరుగుచున్నంత తక్కువగ మరేదేశమునందునుగూడ జరుగవు. దౌర్జన్యమునకు ప్రబలమగు విషయసౌఖ్యలాలసతయే ముఖ్య మని అందఱు నంగీకరించియే యున్నారు. దీనినిబట్టియైనను మేయోకన్య కొంత నిదానింపఁదగినది. నేరములు చాల తక్కువ. దక్షిణమున తాటికల్లును త్రాగుప్రాంతములందుతప్ప మరెచటను మద్యపానమే లేదు. చైనాలో చాలామంది నల్లమందునిషా చేయుదురు. భారతదేశమున పట్టణములలో మిక్కిలి కొద్దిమంది తప్ప మరెవరును నల్లమందు నిషాచేయరు. హెచ్చుమంది ఆహారముకొఱకు జంతువులను చంపరు. వరిబియ్యము ప్రధానాహారము. ఇతరములయిన ముతక ధాన్యములను మరికొన్నిటినిగూడ తిందురు. చాలమంది నిరుపేదలుగనే ఉన్నారు. అత్యవసరము లగువానినిమాత్రమే డబ్బిచ్చి కొందురు. వారికి కోరికలు మిక్కిలి తక్కువ. విషయభోగములలో మునుగుటకును దీనికిని ఎంత భేద మున్నదో గమనింపుఁడు.

గ్రామములలో నివసించువారు చాల ఓరిమినిగలిగి యుందురు. మిక్కిలి కష్టపడి పనిచేయుచుందురు. వారికి ప్రత్యేకమగు మతవిజ్ఞానము కలదు. అది ఆధ్యాత్మికవిషయములలోఁ జాల పైమెట్టునకు పోవుచుండును. సులభములగు పదములలో పరమగంభీరములగు భావములు వెల్లడింపఁబడుచుండును. కవిత నల్లువారిలో చాలమంది గ్రామవాసులే.

సర్వభోగములను పరిత్యజించినవారును మిక్కిలి ఆకర్షకములగు రూపములుగలవారు నగుమహనీయులు స్త్రీలును పురుషులునుగూడ నచట ఆదర్శప్రాయులయి నివసించుచుందురు. వారు చిరస్మరణీయు లగుచుందురు. చిత్రకళలు, గానము, వాఙ్మయము, శిల్పము, మున్నగువానిలో నిపుణు లగువా రందఱును ఎల్లప్పుడును గ్రామములనుండియే వెలువడుచుందురు. కడుబీదలగువారిలోనుండియు నిమ్నజాతులలోనుండియును గూడ ప్రజ్ఞాధనులు జన్మించి తమవిజ్ఞానము, ధర్మవర్తనము, భక్తి మున్నగువాటివలన



కీర్తికాయు లగుచుందురు. నేఁటికిని అట్టిసజ్జనులు కనుపడుచునే యుందురు. భారతదేశమునం దంతటనుగూడ ఇట్టివారిని నేను చూచియున్నాను. "ఓ మోక్షనాథా! ఓ సకలలోకాధిపతి! ఓ జగత్పితా! నీవిట్టి విషయములను లౌకికజ్ఞానముగల పండితమ్మన్యులకు చూపింపవు. అమాయికులకుమాత్రమే చూపించుచుందువు. అదియే సరియనినీకుతోఁచినది. కాన నీకు వందనములు" అని యేసుక్రీస్తు పలికిన వాక్యములందుఁగల సత్యమును నేనీరీతిగా గ్రహింపఁగలిగితిని.

భారతదేశమున గ్రామములలో నివసించువారికిలోకజ్ఞానమధికముగ లేకపోవచ్చును గాని వారికి మానవసహజమగు నింగితము సమగ్రముగానె యున్నది. వారిదారిని వారు చూచి వివేకమునే కలిగియుందురు. భారతదేశమునందు శ్రేష్ఠమైనపద్ధతులన్నియును వంశపారంపర్యముగా తలిదండ్రులవలన బిడ్డలకును గురువులవలన శిష్యులకును బోధింపఁబడి అనుశ్రుతముగానే అనాదికాలమునుండియును వాడుకలోనికి వచ్చియున్నవి. వారు అన్ని కాలములలోను శీతవాతాతపములకు తమశరీరముల నర్పించిఆరుబయటనే తిరుగుచుందురు. వారు బట్టలనుగూడ హెచ్చుగ ధరింపరు. కుటుంబసంబంధములగు నీతినియమములు కఠినముగ ననుసరింతురు. ఒక గ్రామమున నుండువా రంద ఱొకపెద్దకుటుంబముగనే ఉందురు. దానికంతకును మూలాధారమైనదియును ఇంద్రియనిగ్రహణమున కత్యధికమగు ప్రాముఖ్యము నిచ్చినదియు నగు మత ధర్మాచరణము విధియైయున్నది.

ఈ మతనిష్ఠ బహుపురాతనకాలమునుండియు అనఁగా అనేకశతాబ్దులనుండియు వచ్చుచున్నది. ఇది అత్యధికమగు ప్రాబల్యమును కలిగియున్నది. ఇది ఆంతరంగిక జీవితమును పరిపాలించు గొప్పశక్తి. దీనికి సాటియగునది మరేదియును లేదు. మతవిధులు కఠినములైనను ప్రజలందరును వాని నత్యంతవిధేయతతో నెరవేర్చుచుందురు. భోజనము చేయుట పానీయములను త్రాగుట వివాహములు మున్నగు సకలవిషయములును తమ విధుల ననుసరించియే జరుగుచుండును. కావుననే స్త్రీపురుష సంబంధము నియమబద్ధముగ నున్నది. ప్రజలు ఇచ్చకు వచ్చినట్లు మెలంగఁజాలకున్నారు. అతిబాల్యవివాహములు అనుచితములైనను ఇంద్రియవికారము నడఁచివేయఁదగినకఠిననియమములే మిక్కిలి హెచ్చుగనున్నవి.

ఈ లక్షణములు మొత్తముమీఁద భారతదేశమునందలి గ్రామములన్నిటికినిగూడ వర్తించును. కాని ఒకరాష్ట్రములోనిపద్ధతికిని మరియొకరాష్ట్రములోనిపద్ధతికిని అత్యధికమగు భేదముగూడ కనఁబడుచుండును.

ఉత్కళము మున్నగు రాష్ట్రములలోని గ్రామము లన్నిటిలోను చలిజ్వరములు, వఱదలు, కఱవులు మున్నగువానివలన ప్రజలు దుర్భరదారిద్ర్యమును దైన్యమునుగూడ ననుభవించుచుందురు. పంజాబు గుజరాతు రాష్ట్రములలోని ప్రజలు దార్ఢ్యమును ఉత్సాహమునుకలిగి స్వతంత్రులుగ నుందురు. వారెట్టి భోగములను అనుభవింపరు. సోమరులుగ నుండరు. కష్టపడి పనిచేసెదరు. ఆరోగ్యకరములగు నాహారములనే తినుచుందురు. దక్షిణదేశమున ఉష్ణ మధికముగ నుండును. ఆహారము పుష్టికరముగా నుండదు. కాని వారిలో ఆధ్యాత్మికమగు నుత్సాహ మత్యధికముగ నున్నది. అది నిరుపయోగ మగునంత హెచ్చుగఁగూడ నున్నది. వంగరాష్ట్రమున నిప్పటికిని గ్రామములలో మేధావంతులునుకళాప్రపూర్ణులును హెచ్చుగ కనఁబడుచుందురు. అందువలననే అచట సారస్వత మిపుడు వికాసమును బడయుచున్నది. సింధురాష్ట్రము ఎడారిప్రాంతమైనను అచట ప్రాచీనకాలమునుండియు వేదాంతరహస్యములతోఁ గూడినకవిత్వము ప్రబలముగా నున్నది. అచట హిందూ మహమ్మదీయ సాధువులు భక్తిని మగ్నులగుటలో నేకీభవించుచున్నారు. అన్ని గ్రామములలోను పురాణేతిహాసాదులను వినుటయందును, గేయములను పాడుటయందును, సంగీతమును వినుటయందును, పజలకందరికిని ఆసక్తి చాల హెచ్చుగా కనఁబడుచుండును. గ్రామములలోనిభావములు నవీనశాస్త్రపరిశోధనలకునిలువజాలవు. అవి సారస్వతలక్షణములకు భంగకరములుగాఁగూడ నుండును. కాని, తక్కిన అన్నిదేశములందుకంటెను భారతదేశమునందు జీవాత్మ పరమాత్మలనుగూర్చియును జీవితమురహస్యమునుగూర్చియును మోక్షమును గూర్చియును ముముక్షువులు ఇంద్రియ నిగ్రహణముకొరకు చేయవలసిన అంతరంగ బహిరంగసాధనలను గూర్చియును తెలుసుకొనిన స్త్రీలును పురుషులును చాల హెచ్చుగా కనబడుచుందురు. మోక్షముకొరకు సర్వమును తృణప్రాయముగా పరిత్యజింపగలవారి సంఖ్యగూడ చాల హెచ్చుగా నున్నది.

దీనినిబట్టి భారతీయులకు మనోనిగ్రహశక్తియును కఠిననియమముల



ననుసరింపఁగలశక్తియును మిక్కిలి హెచ్చుగానున్నదని స్పష్టము కాఁగలదు. ఆహారవిహారములను పరిత్యజించుటలో భారతదేశీయులకుఁగల వైరాగ్యమునందును, త్యాగశక్తియందును పాశ్చాత్యుల కెవ్వరికిని సమాప్రాంశమైన లేదని నేనుచెప్పఁగలను. నేను వాంఛలను చాలవరకు త్యజింపఁగలిగినను వారికోరికలతో పోల్చిచూచినపుడు నాకోరికలు చాల హెచ్చుగానే కనఁబడుచుండును. అందులకు వారిని జూచి నేను సిగ్గుపడుచుండును. భారతదేశమున నిమ్నజాతు లనఁబడువారు లక్షలకొలఁదిగా నున్నారు. వారిజీవనస్థితి యింకను కఠినతరముగా నున్నది. వారిలో పురుషులు చాలమంది ఒకగోచీనిమాత్రమే పెట్టుకొందురు. ఎల్లప్పుడును ఆరుబయటనే యుందురు. కావున నచట సూర్యకాంతి మంచిగాలితో కలసి వారికితగులుచుండును. దానివలననే వారికి పుష్టియును ఉష్ణమును సమృద్ధిగా లభించుచుండును. ఈగొప్పలాభమే లేనిచో కేవలము నిస్సారమగు నాహారము నత్యల్పముగా తినఁజాలునట్టి యీనిమ్నజాతులలో హెచ్చుమంది జీవించుటయే అసంభవము. వారి శరీరస్థితినిగురించి నేను కేవలము యథార్థమునే తెలిపితినిగాని అతిశయోక్తుల నేమియును తెలుపలేదు. వారి మానసికఆధ్యాత్మిక విషయమునుగూర్చి గూడ నేను విపరీతముగ నేమియును వ్రాయలేదు. భారతదేశమును బాగుగా నెరిగినవా రెవరును దీనిని కాదనఁజాలరు. కావున భారతదేశమునందు దారిద్ర్యమువలన వ్యభిచారము చాల హెచ్చుగా నున్నదనువ్రాఁత అసత్య మని నేను రూఢిగా తెలుపఁగలను.

---

## అయిదవ లేఖ.

"భారతదేశమునం దంతటను నే నొంటరిగా పెక్కుసారులు సంచారము చేసితిని. అనేకగ్రామములను చూచితిని. గ్రామవాసుల కష్టసుఖములలో పాలుగొంటిని. వారు నన్ను విశ్వసించినటులు మరేయాంగ్లేయుని గూడ విశ్వసించియుండలేదు. వారిపద్ధతులలో అతివ్యాప్తి యేమియును లేదు. వారు విషయలోలురు కారు.

హోలీపండుగ మున్నగునవి వచ్చినపుడు బహు అరుదుగా నొకటి

రెండురోజులు కొందరు విచ్చలవిడిగ చరింతురుగాని వెంటనే మరల మామూలుపద్ధతికి వచ్చెదరు. వివాహములలో మాత్రము భారతీయు లమితముగ ధనమును వ్యయమొనరింతురు. అందువలన ఒక కుటుంబమున ఒక వివాహ మొకవత్సరమున జరిగినచో కొన్నియేండ్లవరకును వారి కాఋణ బాధ తీరదు. ఎల్లప్పుడును వారు ఉత్సాహరహితులుగానే యుందురుగాన వివాహసమయములం దిటు లానందించుట క్షంతవ్యమే యని నాయభిప్రాయము. ఈ విషయములను చదివినపిమ్మట భారతీయులు కేవలము విషయలోలురని మేయోకన్య వ్రాసినవ్రాఁత అసత్యమనిస్పష్టము గాకమానదు. ధనవంతు లగుయువకులలో 10 మందిలో 8 మంది అనఁగా 100-కి 80 మంది అతివ్యాప్తివలన 25, 30 యేండ్లమధ్యనే నపుంసకు లగుచున్నారని ఆమె వ్రాసినవ్రాఁత అసత్యమని నేను వేరుగా తెలుప నవసరములేదు. 100-కి 90 మంది మంచిఆరోగ్యము ననుభవించుచున్నారని నేను చెప్పఁగలను. అనేకధనవంతుల కుటుంబములతో నా కధికమగుపరిచయము కలదు. ఆంగ్లదేశమున గ్రామములలో నివసించుచున్నవారి సంఖ్యకంటె పట్టణములలో నివసించుచున్న వారిసంఖ్యయే చాల హెచ్చుగా నున్నది. భారతదేశమున గ్రామములలో నివసించుచున్న వారిసంఖ్యయే అత్యధికము గ్రామములు పెక్కుశతాబులనుండియు నిలిచియున్నవి. పట్టణములు నవీనములు. కావున పట్టణములలోని ప్రజల వర్తనమునుబట్టి భారతదేశమునందలి ప్రజలవర్తనమును నిర్ణయించుట పాడికాదు.

భారతదేశమున 100-కి 75 మంది హైందవులు. వారందరును పూర్వాచారపరాయణులు. గృహ పరిశ్రమలలో నేఁతపరిశ్రమయే ముఖ్యతమము. విదేశపు మిల్లుబట్టలు విస్తారముగ వచ్చుటవలన గృహపరిశ్రమ లంతరించినవి.

వైష్ణవులబొట్టు దుర్నీతిని సూచించునన్న విషయమును మే మెవ్వరము నెరుఁగము. ఇది కేవలము కల్పితము. నే నెరుగను గాంధిగా రెరుగరు. ఆబొట్టును చూచుటవలన నెవరికిని దుర్బుద్ధులు కలుగవు. ఈబొట్టులను ధరించినవారు చాల భక్తితో భగవంతుని పూజించుట నే నెరుగుదును. భారతదేశమున దేవదాసీ లున్నమాట నిజము. ఇది దురాచారమే. ఇది ఇప్పటికిని రూపుమాయలేదు కాని వీరుగూడ స్వసంఘమును సంస్క-



రింపఁగోరుచున్నారు. వారు నాపట్ల సోదరభావముతో నాకడకు వచ్చి తమసంఘము నుద్ధరింపవలెనని కోరిరి. తమ చిన్నబిడ్డలకుఁగూడ తమకుఁ గలిగినదుస్స్థితి కలుగకుండఁ జేయఁగోరిరి. పెక్కు గంటలసేపు నేను సంతాపకరమును కళంకితమునగు వారిచరిత్రమును వారిమధ్యను కూర్చుండివింటిని. నే నీవిషయములను పత్రికలలో ప్రకటించినపుడు హైందవు లెవ్వరునుగూడ నావాక్యములను నిరసింపలేదు. చాలమంది నావాక్యములను గూర్చి ప్రశంసనుగూడ చేసిరి. ఈదురాచారమును రూపుమాపుటకు జరుపఁబడిన పెక్కుసభలకు నే నధ్యక్షుడనుగఁ గూడ నుంటిని.

గాంధిగారు హైందవుఁడై ఈదురాచారము లామోదించుదేవాలయములకు వెళ్లుటగూడ మానివేసిరి. అట్టి దేవాలయములలో దయ్యముండును (సైతాను) కాని దైవ ముండ దని గాంధిగా రనిరి. ఈవిమర్శనందరు నామోదించిరి. ఇట్టిదురాచారములు కొన్ని యిప్పటికిని శేషించియున్నను అవి నామమాత్రముగనే యున్నవి. వానిని బలపరుచువా రెవ్వరును లేరు. కొన్ని ఆర్థికసౌకర్యములను కలిగించినచో నివి వెంటనే పూర్తిగ అంతరించిపోవును. గ్రామములలో కాలక్రమమున నెట్టిదురాచారములు చేరినను సంఘవృక్షశాఖలపై నెట్టివిషవల్లు లల్లుకొనినను వృక్షముయొక్క తల్లివేరు చెక్కుచెదరలేదు. దానికి పురుగు పట్టలేదు. నే నిట్లు ప్రత్యక్షానుభవమువలననె తెలుపుచున్నాను. గ్రామములలో విషయలోలత యున్నచో నది అత్యల్పముగనే యుండును.

ఇట్టిదుర్నీతిని నే నెంతమాత్రమును సహింపజాలను. కాని, నా కే గ్రామమునందునుకూడ నట్టి రోఁత కలుగవలసిన ఆవశ్యకము కలుగలేదు.

భారతదేశమునందలి స్త్రీలకుఁగల వినయమును లజ్జయును అడఁకువయును మరేదేశమునందునుగూడ కనఁబడ వని నేను గట్టిగ చెప్పఁగలను. నేను మతగురువు నగుటచే ఘోషాస్త్రీలనుగూడ నిరాటంకముగ చూడఁగలిగితిని. ఘోషాపద్ధతి పట్టణములలోనే కాని గ్రామములలో లేదు. ఆదేశమున స్త్రీలను అమ్మా (తల్లి) అనికాని అక్కా (సోదరీ) అనికాని పిలిచెదరు. పెద్దవారైనచో అమ్మాయీ (పుత్రిక) అనిపిలిచెదరు. పరిచయములేని స్త్రీలను గూడ నిట్లు మర్యాదగానే పిలిచెదరు. నవుకరులు యజమానురాండ్ర నిటులే పిలిచెదరు. ఈపదములు సార్థకములు కాని నిర-

రక్షకములు కావు. ఏలయనఁగా స్త్రీలు తల్లులవలెను అక్కచెల్లెండ్రవలెను కడు వాత్సల్యముతో నందరిని ఆదరించుచుందు రనుట నిశ్చయము.

‘‘అచటి స్త్రీలు సంభాషణలలో సంభోగవిషయములనే ముచ్చటించుచుందురు. అట్టి పాటలనే యెల్లపుడును పాడుచుందు’’రని మేయోకన్య వ్రాసిన వ్రాఁత కేవల మసత్యము.

ఇట్టి యీమె వ్రాఁత లన్నియును సత్యములే యని పాశ్చాత్యులు నమ్ముచున్నారు. అవి వట్టి-అసత్యము లని నేను ప్రకటించుచున్నాను. పాశ్చాత్యులలో హెచ్చుమంది యామె వ్రాసినవిషయములన్నియును నిజమని నమ్మి భారతీయులను నిరసింపసాగినచో ముందు ఈ రెండుజాతుల సామరస్యమునకును విస్తారముగ భంగము కలుగకమానదు.

## ఆఱవ లేఖ

ఆంగ్లదేశమువంటి శీతలదేశములందు యువతులు 16 యేండ్లకు ఋతుమతు లగుదురు కాని భారతదేశమువంటిఉష్ణదేశములలో 13 యేండ్లకే పుష్పవతు లగుదురు. బ్రిటనుదేశమునందు 16-17 యేండ్లయువతుల కెట్టివయౌవనమును సంపూర్ణవికాసమును సర్వాంగసౌష్ఠవమును కలుగునో అట్టిసౌష్ఠవవికాసములు కెన్యాదేశమున 10-11 ఏండ్ల యీడుననే బాలికలకు కలుగును. వయసు తెలియనివారికి వారు నిండుప్రాయపు స్త్రీలవలెనే కనఁబడుదురు అని “కెన్యాఖ్రంవిదిను” అనుగ్రంథమున వ్రాయబడెను. ఈకారణమున నిపుడు అమెరికా-ఐరోపాఖండములలో యువతులకు నిర్ణయింపఁబడినవివాహోచితప్రాయము భారతదేశమునందలికన్యలకు పనికిరాదు. పాశ్చాత్యదేశములలో స్త్రీలకు నిర్ణయింపఁబడిన వివాహోచితప్రాయము చాల హెచ్చుగనున్నది. ఇంకను శీఘ్రముగనే వివాహములు జరుగఁదగు నని గూడ పలువురు ధీమంతు లభిప్రాయపడుచున్నారు.

భారతదేశమునందు సరియైనప్రాయము రాకముందును పాశ్చాత్యదేశములందు ప్రాయము ముదిరిన పిమ్మటను వివాహములు జరుగుచున్నవి. ఇందులకు ప్రత్యేకకారణములు కలవు, కాని రెండుదేశములవారునుగూడ సరియైనకాలమున వివాహములను చేయుటలే దనియే చెప్పఁదగును.

పాశ్చాత్యదేశములలో కొంతమంది స్త్రీలు 30 యేండ్ల వయసులోను ముప్పదేండ్లు దాటినపిమ్మటనుగూడ తఱచుగా పెండ్లి చేసికొనుచుందురు.



ఇది కేవలము అనుచితమే యగును. పాశ్చాత్యదేశములలో ఎక్కువమంది స్త్రీలకు తగినసంబంధములు దొరకక వారు యావజ్జీవమును అవివాహితలుగానే యుందురు. ఇదియును అసహజమే, భారతదేశమున 12-14 ఏండ్లమధ్య వివాహముచేసెదరు. ఇదిగూడ అనుచితమే. భర్తలను గోల్పోయిన స్త్రీలలో చాలమంది కొంతకాలము కాఁపురము చేసినవారును రజస్వలలు కాకముందే భర్తలను గోల్పోయినబాలికలునుగూడ మరల వివాహముచేసికొనరు. అదియును అసహజమె. ఈరీతిగా భారతదేశమునందును పాశ్చాత్యదేశములందునుగూడ వివాహపద్ధతిలో చాల లోపము లుండగా నొకరి నొకరు నిందించుకొనుట చాల అధమము.

రెండుదేశములలోను సంస్కరణ మిపుడు జరుగవలెను. అది జరుగగలదు. సవివేకమగుసానుభూతి యవసరము గాని అవివేకముతోగూడిన నింద వాంఛనీయము కాదు. పాశ్చాత్యదేశములలో వివాహవిచ్ఛేదాభియోగములు చాల హెచ్చుగా నున్నవి. నైతికస్థితి అధ్వాన్నముగా నున్నది. ఇందులకు పాశ్చాత్యులచేతనే వ్రాయఁబడిన నిస్సంశయములగు లిఖితనిదర్శనములు చాలఁగలవు. వీనినుండి భారతీయులు విషయములను గ్రహించి పాశ్చాత్యులను నిరసించుచు గ్రంథములను ప్రకటింపవచ్చును. కాని వారు చాలమర్యాదయును వివేకమును గలవా రగుటచేత నితరులమనస్సు నొప్పించుట కంగీకరింపఁజాలక అట్టిగ్రంథములను వేనినిగూడ వ్రాసియుండలేదు. భారతదేశమున భార్య జీవించియుండఁగా మరల ఒక్కతెనుగాని పెక్కుమందినిగాని వివాహము చేసికొనునట్టి పద్ధతికలదు గాని దీనినిగూర్చి సరిగా నెరుగనివారు దురభిప్రాయులగుచున్నారు. కొంతమంది సంస్థానాధిపతులు మున్నగువారు సంతానము లేకో భోగపరత్వమువలననో అట్లు చేయుచుండుటవలననే దేశమునందు బహుభార్యాత్వముచాల హెచ్చుగా నున్నదని పెక్కుమంది పాశ్చాత్యులు దురభిప్రాయపడుచున్నారు. ఈ దురభిప్రాయము మిక్కుటమగుటచే దానిని తొలగించుట చాల కష్టముగా నున్నదని దక్షిణాఫ్రికాలో నాకు కలిగిన అనుభవమును బట్టి నేను చెప్పఁగలను.

జనాభాలెక్కలకంటె మన కీవిషయమున నమ్మదగిననిదర్శనము వేరొకటి ఉండదు. ‘‘భారతదేశమునందు హైందవులు మహమ్మదీయులు

మున్నగువారిలో 100 కి 98 మంది ఒక్కస్త్రీనే వివాహము చేసికొనుచున్నారు" అని జనాభాలెక్కలలో నున్నది. ఇపుడు విద్య విస్తారముగా వ్యాపించుచుండుటచే బహుభార్యాత్వ మింకను తగ్గిపోవుచున్నది. కాని నేఁటికిని ఈపద్ధతిని దేశీయులు నిరసింపకుండుట కడు శోచనీయము. కాని భారతదేశమునందు హెచ్చుమంది పురుషులు పెక్కుమందిభార్యలను గలిగియుందు రని తలఁచుట మిక్కిలి గొప్పపొరపాటు. స్వరాజ్యాధికారము లభించినచో టర్కీలో కెమలుపాషాగారు చేసినట్లె భారతీయులు గూడ త్వరలోనే బహుభార్యాత్వము నడఁచివేయఁగల రనుట నిశ్చయము.

ఇపుడైనను భారతదేశమున రాజులు మహారాజులు మున్నగువారిలో మాత్రమే యీపద్ధతి హెచ్చుగనున్నది. పూర్వకాలమున నైరోపాఖండమునఁగూడ రాజకుటుంబములవారు పెక్కుమందిభార్యలను కలిగియుండెడువా రని చరిత్రలవలన తెలియుచునేయున్నదికాన యిందులకు భారతీయులనే నిందించుట న్యాయముకాదు. భారతప్రజలలో రాజులపట్ల నొకవిధమగుగౌరవభావ మింకను తొలఁగలేదు. అది పూర్తిగా తొలఁగినచో ఈపద్ధతి అంతరింపఁగలదు.

భారతదేశమున వివాహవిచ్ఛేదపద్ధతి యెన్నఁడునులేదు. ఆభావమే వారికి దుస్సహముగ నుండును. ఇఁకముందు దాంపత్యసుఖము బొత్తుగ లేనివారివిషయమున వివాహబంధమును రద్దుచేయుటకు శాసనములు జరిగిన జరుగవచ్చును. మహమ్మదీయులలో వివాహవిచ్ఛేదపద్ధతి కలదుకాని చాల కొద్దిమందిమాత్రమే దీని నవలంబించెదరు. మహమ్మదీయమతమును కొన్ని శతాబ్దములకుపూర్వమే అవలంబించిన హైందవులు సైతము ఈపద్ధతినంగీకరించుటలేదు. వితంతువులు వివాహము చేసికొనఁగూడదనుపద్ధతిమాత్రము హైందవులలో నున్నది. కాని యిది మతసంబంధము కాదని యీశ్వరచంద్ర విద్యాసాగరుని కాలమునుండియు స్పష్టమగుచున్నది. కాని మతగురువులు దీని నామోదించుటచే దీనివలన చాల హాని కలుగుచున్నది. భారతదేశమున వివాహసమయమున భార్యాభర్తలకు సంభోగముజరుగదు. వివాహకాలమున కన్యాప్రదానము మాత్రమే జరుగును. అటు లయ్యును గూడ నట్టిబాలవితంతువులుగూడ వివాహము చేసికొనఁగూడదను పద్ధతి చాల కఠినముగ నేయున్నది. ఇది చాల అనర్థకముగా నున్నదికాన దీనిని



తొలగింపవలెను. ఇపుడు చాలమంది బాలవితంతువులకు వివాహములు జరుగుచున్నవి. గాంధిగారును రవీంద్రనాథ్‌గారునుగూడ విధవావివాహములను మిక్కిలి హెచ్చుగ ప్రోత్సాహపరుచుచున్నారు, కాని ఈపద్ధతి యింకను బాగుగా వ్యాపించుటలేదు.

హిందూవితంతువులందరును ఒక్కరీతిగనే ఉండరు. కుటుంబస్థితిగతులను బట్టి వారికష్టసుఖములు మారుచుండును. కొంతమంది వితంతువులు చాల కష్టముల ననుభవించుచుందురు. భార్య చనిపోయినచో పురుషుడు ముదుకఁడైనను గూడ వెంటనే ఒకచిన్నపిల్లను పెండ్లియాడుటకు సంఘ మనుమతించుచున్నది. కాని భారతదేశమునందును చీనాదేశమునందును ప్రాధాన్యము కుటుంబమునకు కాని వ్యక్తికి కాదనువిషయమును జ్ఞాపక ముంచుకొనవలెను.

భారతదేశమున అకలంకచరిత్రలుగా నుండు వితంతువులను ప్రజలందరును మిక్కిలి హెచ్చుగా గౌరవించుచుందురు. ఇదియే ముఖ్యవిశేషము. మధ్యయుగమున భర్త చనిపోఁగానే భార్యను భర్తతోఁగూడ సజీవముగా కాల్చివేయుపద్ధతి ఉండెను. దీనిని సహగమనమందురు. నూరేండ్లక్రితము రాజా రామమోహనరాయలును బెంటింకు ప్రభువును కలసి దీనిని రూపుమాపిరి. ప్రజలుగూడ వారికి తోడ్పడిరి. అపుడు దేశమునం దెట్టివిప్లవమును జరుగలేదు. కాని సహగమనము శ్రేష్ఠతమమగుపతివ్రతాధర్మమని ప్రిన్సిపలురుద్రగారు (డిల్లీ) నా కెరిగించిరి. ఇతడాస్తికుడగు క్రైస్తవుడు. నందలాలుబోసువ్రాసిన సతియనుచిత్రము నన్నధికముగానాకర్షించినది. రోమనుకాథలిక్కులు నన్సు అనఁబడు విరాగిణుల నెట్లు గౌరవింతురో భారతీయు లంతకంటె హెచ్చుగానే సచ్చరిత్రలగు వితంతువులను గౌరవించుచుందురు. ఇది నేను ప్రత్యక్షముగ చూచిన విషయము. వెనుక నొకకాలమున వర్ణాశ్రమధర్మము చాలమేలు చేసినది. కాని యిపుడది నిరుపయోగమైనది. ఇపుడు స్త్రీలకును పురుషులకును పరస్పరసమానగౌరవము నేర్పరుప వలెను. నేను గ్రామములలో హైందవులకుటుంబములలో నొక బంధువువలెనే కలసిమెలసి ఉంటినిగాన నీరహస్యములన్నియును నే నెరుగుదును కాని మేయోకన్య కట్టి-అవకాశము లభింపనందున ఆమె సరిగ గ్రహింపఁజాలదు.

## ఏడవ లేఖ—అతిబాల్యవివాహములు

ఈమె తన గ్రంథమునందు అతిబాల్యవివాహములనుగూర్చియే మిక్కిలి పట్టుదలతో వ్రాసినది. ఇందువలననే భారతీయులు క్షీణదశకు వచ్చుచున్నారని ఆమె దృఢాభిప్రాయము.

"చదువురానట్టియు వివేకములేనట్టియు నేపనియును చేతఁగానట్టియు ఆరోగ్యవిధు లేమియును తెలియనట్టియు బాలికలకు మిక్కిలి చిన్నవయసులోనే పెండ్లిచేసెదరు. 12 ఏండ్లువచ్చుసరికి పడుచు అనఁబడు ఆచిన్నపిల్ల గర్భవతియై బిడ్డను కనును. భారతదేశమున బాలికలు రజస్వలలైనపిమ్మట తొమ్మిదినెలలకే ప్రసవించుట సామాన్యము. 8 యేండ్లు మొదలు 14 యేండ్లలోగానే వారు బిడ్డలను కందురు. ఎనిమిదియేండ్లవయసులో బిడ్డల కనువారు సాధారణముగా నెవ్వరు నుండరుగాని అసలే ఉండ దన వీలులేదు. కాని 14 ఎండ్ల వయసులో బిడ్డలనుకనుట సర్వసాధారణమే" అని ఆమె వ్రాసినది.

ఈసిద్ధాంతము స్థిరమనునమ్మకముతో నీదురాచారమును రూపుమాపనందుల కామె భారతీయు లందరునుగూడ ఇంగితజ్ఞానశూన్యులే అని వ్రాసినది. "సంఘసంస్కర్తలు ముఖస్తుతుల నొనరించుచుందురు లేదా మౌనమును దాల్చెదరు. కాని భారతదేశీయులప్రాణశక్తి నెయ్యది హరించుచున్నదో ఆఘోరదురాచారమును బాగుగా వెల్లడించునట్టిదేశబాంధవులు వారిలో నొక్కరునుగూడ కనఁబడరు" అని ఆమె వ్రాసినది.

ఈవ్రాఁతలను పూర్తిగ నిరసించుచు ఈగ్రంథము వెలువడినపిమ్మట పెక్కుమంది వ్రాసియున్నారు. జనాభాలెక్కలు తన కాధార మని ఆమె తెలిపెనుగాని వానినైనను ఆమె సరిగా గమనించినట్లు కనుపడదు. ఇట్లు మిక్కిలి చిన్నవయసున బిడ్డలగనుట చాల అరుదని సప్రమాణముగా పెక్కుమందిడాక్టరులు వ్రాసియున్నారు.

చెన్నపురిలో స్త్రీలు ప్రసవించుట కేర్పరుపబడినవైద్యశాలలో తొలిసారి గర్భవతులైనవారు 2312 మంది ప్రసవించిరి. వీరిలో సుమారు 1980 మంది 17 ఏండ్లవయసును అంతకంటె హెచ్చువయసుకలవారే. ఇతర రాష్ట్రము లన్నిటిలోను తొలిచూలువారు 4,300 మందిలోను 13 మందిమాత్రమే 15 ఏండ్లలోపువారు. హెచ్చుమంది 18 ఏండ్లవారుగానే



ఉన్నారు. అని ప్రమాణికులగువారు పలువురు వ్రాసియున్నారు. అతిబాల్యవివాహములు మిక్కిలి అరుదుగా జరుగుచుండును.

భారతదేశమున ప్రతి 1000 మంది స్త్రీలకు 501 మంది 15 వ యేఁటఁగూడ అవివాహితలుగనే ఉందురు అని 1921లో జరిగిన జనాభా లెక్కలలో నున్నది. ఇదియే కట్టకడపట జరిగినజనాభా. దీనిపిమ్మట మరల ఇంకను జనాభా జరిగిఉండలేదు. ఇది భారతదేశమున కంతటికిని సంబంధించినజనాభానివేదిక. వివాహములు చేయఁబడు బాలికలవయసు క్రమముగా హెచ్చింపబడుచున్నట్లు ప్రతి జనాభారిపోర్టునుగూడ తెలుపుచునే యున్నది. 1928 లో 1000 మందిలో 15 వ యేఁడు వచ్చినను వివాహము గానివారు 650 మందిగూడ నుందురు.

"భారత దేశమునందు వివాహమైనవెంటనే భర్త భార్యతో సంభోగించుట జరుగదు. బాలిక రజస్వల కాకముందే వివాహము జరుగును. జరిగినను బాలికరజస్వలయగువరకును పుట్టినింటనే యుండును. రజస్వలయైనపిమ్మట పునస్సంధానము జరుగును. అపుడే భార్యాభర్తలకు దాంపత్యసంబంధ మేర్పడునుగాని అంతవరకునుయేర్పడదు. వివాహమైనపిమ్మటపదకొండుయేండ్లవరకునుగూడ కొంతమంది బాలికలకు పునస్సంధానము జరుగదు. వివాహమైనమూఁడేండ్లలోపుగా నెవ్వరికినిగూడపునస్సంధానముజరుగదు" అనిభారతదేశమున ప్రభుత్వోద్యోగిగానుండిన సర్ డెనిజలుయిబ్బెట్సనుగారు వ్రాసిరి. ప్రాచీనాంగ్లేయోద్యోగులలో నితఁడు గొప్పప్రామాణికుఁడుగాన నెవరును సంశయింపవీలులేదు.

భారతీయులలో ముఖ్యముగా హైందవులలో వివాహమనఁగా మరల మార్చవీలులేకుండ వధూవరులను నిర్ణయించుట మాత్రమేగాని మరేమియును కాదు. వివాహము కాఁగానే వధూవరులు కలుసుకొనరు. అథమము మరియొకవత్సరమైనఁ గడచినఁగాని పునస్సంధానము జరుగదు. కొంతమంది అయిదేండ్లవరకునుగూడ పునస్సంధానమును జరుపరని 1921 లో భారతదేశమునందలి సంయుక్తరాష్ట్రముల జనాభానివేదికలో కమీషనరువ్రాసెను. భారతదేశమునందు వర్ణములసంఖ్య చాల హెచ్చుగానున్నది. ఇపుడు భిన్నశాఖలతో గూడ చేరి 1000 వర్ణములవరకును గూడనున్నవి. ఒకవర్ణమువారు మరియొకవర్ణమువారితోను ఒకశాఖవారు మరియొకశాఖ

వారితోను సంబంధము జరుపుట కంగీకరింపరు. కావున సవర్ణులలో సంబంధములను కుదుర్చవలసియున్నది. ఆకారణమున తగినవధూవరులు లభించుట చాలకష్టముగానుండును. అందువలన కన్యాదాతలు ఆలస్యము చేయుట కంగీకరింపరు. తగినసంబంధము దొరకఁగానే తమకుమార్తెలకు చిన్నతనమునందేవివాహములనుచేసివేయుచుందురు. వివాహముకాకముందు బాలిక రజస్వలయైనచో నది గొప్ప అవమానముగా వారు భావింతురు. అట్టికుటుంబములను కులమువారు వెలివేయుదురు. అతిబాల్యవివాహములను రద్దుపరచవలెనని వివేకముకల వా రందరునుగూడ కోరుచునేయున్నారు. ఇందులకు స్త్రీలలో విద్య బాగుగా వ్యాపించుటయును ఇతరవర్ణముల వారితో సంబంధములను జరుపుట యొకటియును ముఖ్యసాధనములై యున్నవి.

ఇటులనుటవలన భారతదేశమున వివాహపద్ధతిలో లోపమేమియు లేదని నా అభిప్రాయము కాదు. అతిబాల్యమునందే కొంతమంది భార్యలతో సంభోగించుట, చిన్నపిల్లలను ముసలివాండ్ర కిచ్చి పెండ్లిచేయుట మున్నగుదురాచారములు పూర్తిగా అంతరించలేదు. కాని సంస్కరణము ప్రారంభమైనది. సంఘసంస్కర్త లందరును వీనిని తీవ్రముగా నిరసించుచునే యున్నారు. ఇటీవల నొక సంస్కర్తయే యిట్టి వివాహమును కావింపఁగా తీవ్రమగు నాందోళనము గలిగినది.

“పాశ్చాత్యదేశములందుకంటె భారతదేశమున ప్రసవములు సులభముగనే జరుగును. తొలిచూలివారుగూడ చాలమంది సులువుగానే ప్రసవమగుచుందురు, అని నే ననుభవమువలన చెప్పఁగలను. కాని కొద్దిమంది చాల కష్టపడుటయును గలదు. పల్లెటూళ్లలో వారికష్టములను తగ్గింపగల వైద్యసాధనములు లభింపకపోవుటవలన వారిస్థితి జాలికరముగనేయుండును” అని సుప్రసిద్ధుఁడగు నొకపాశ్చాత్యవైద్యుఁడు నా కెరిగించెను.

సుఖజాడ్యములు(వెనీరియల్సు) గ్రామములలోనే హెచ్చుగానున్నవిగాని మొత్తముమీద ఈవ్యాధులు కలవారు మిక్కిలి కొద్దిమందియే యుందురు. ఉగాండాలో నమిరంబీ వైద్యశాలలోనున్న డాక్టరుకుక్కుగారచటి అనుభవమును నాకు వ్రాసియిచ్చిరి. అచటనున్న దేశీయులతోను పాశ్చాత్యులతోను పోల్చిచూడగ నచటి భారతీయులలోనె సుఖవ్యాధులు



కలవారు చాల తక్కువగా నున్నారని అతఁడు తెలిపెను. అచటనున్న భారతీయులు కుటుంబముల నచటికి తీసుకొని వెళ్లకపోయినను వారి నీతివర్తనము చాల బాగుగా నున్నదనియే అతఁ డనెను.

భారతదేశమున గ్రామములలో నివసించు స్త్రీలు చాల బలమును ఉత్సాహమును ఉల్లాసమును కలిగియుందురు. వారు ప్రతిదినమును కష్టపడి పనిచేయుచుందురు. వారిని ధనలోపము మాత్రమే పీడించుచున్నది. వారికి చాలినంత ఆహారము లభించుట లేదు. వారివేతనములను వృద్ధినొందింపవలెను.

నేఁడు భారతదేశమునందు గొప్పమార్పు ప్రారంభమైనది. అట్టిమార్పు కలుగనున్నపుడు స్థితిగతులు చాల ఆందోళనకరములుగా నుండుట సహజము. ఇట్టిసమయమున సాంఘికదురాచారములను రూపుమాపుటకు గాంధిగారివంటి సర్వజనపూజ్యుఁడు సమర్థుఁడగును. శాసనసభలలో చట్టములను చేసినంతమాత్రమున నెట్టిప్రయోజనమును కలుగదు. పెక్కుమార్గములఁగూడ గాంధిగారు భారతీయులమనసుల కెక్కునట్లు చేయుచున్న నీతిబోధనల కధికారబలము, భౌతికసంపద మున్నగుబాహ్యశక్తు లేవియు నవసరము లేదనికూడ నేను స్పష్టముగా తెలుపుచున్నాను. దీనినిగూర్చియే నేను నిరంతరమును గ్రామములలోనివారికి తెలుపుచుందును. గాంధిగారిపట్ల దేశీయుల కందరికి నిట్టి గాఢభక్తివిశ్వాసములు కలుగుటకు గాంధిగారినీతివర్తనమే ముఖ్యకారణ మని అందరును నా కెరిగించుచుందురు. సద్గుణపరంపర లన్నియును గాంధిగారియందు మూర్తీభవించె ననియే ప్రజలు భావించుచున్నారు.

మేయోకన్యగ్రంథములో సంస్కరణములనుగూర్చి యిట్టి అంతరంగికోద్యమములనుగూర్చిన వాక్య మొక్కటిగూడ నాకు కనఁబడలేదు. ఆమె వీనిని గ్రహించియు బుద్ధిపూర్వకముగా వదలె ననియే ఆమెచేసినప్రచారమునుబట్టి చెప్పవలసియుండినను నే నట్లు చెప్పను. ఆమె చాల తొందరగా సంచారము చేయుటవలనను ఇట్టి విషయములను తెలుపఁదగినవారి నామె చూచియుండకపోవుటవలనను వీని నామె గ్రహింపఁజాలకపోయె ననియే నేను తలఁచెదను. ఏకారణమైన నేమి ఆగ్రంథమును నిరసించుటకింతకంటె గొప్పకారణము మరేదియు నవసరములేదు. విరోపాఖండమున

అస్సేసిసెయింటు ఫ్రాన్సిసు కాలమున నుండినయొకగ్రంథకర్త అప్పటి చరిత్రనుగూర్చి యొకగ్రంథమును వ్రాయుచు ఫ్రాన్సిసుఉద్యమ మొక్కటే అపుడు జరిగిన ఘనకార్యమని వ్రాసినచో నాగ్రంథమున కట్టిలోపము కలుగునో అట్టిలోపమే యిపుడు మేయోకన్యగ్రంథమునకుగూడ కలిగినది. మేయోకన్య పేర్కొనిన సాంఘికదురాచారము లన్నియునుగూడ గాంధిగారిసంఘసంస్కరణవిధానమునందు చేరియే యున్నవి. వానిని తొలగించుటకు ప్రతివిషయమునను వేలకొలఁదిమంది యైచ్ఛికముగనే పూనుకొని పనిచేయుచున్నారు. అసహాయోద్యమ మిపు డితరులవశ మైనమాట నిజమే గాని గ్రామములలో గాంధిగారిపలుకుబడి అత్యధికముగా వెనుకటికంటె నిపుడే నైతికముగా వ్యాపించుచున్నమాటయును నిజమే. గాంధిగారు దేశసంచారము చేయుచున్నపుడు చాలసారులు నే నాయనతోఁగూడ నుంటిని. నైతికమగు నాయనపలుకుబడి యిపుడు నిరుపమానముగను అత్యధికముగను ఉన్నదని నేనునిస్సంశయముగా తెలుపఁగలుగుదును. మేయోకన్యవ్రాసినట్లు గాంధిగా రెన్నఁడును తనసౌఖ్యకరమగు నాశ్రమమునందు మిన్నక కూర్చుండువాఁడు కాఁడు. చాల కష్టమును శ్రమలును కలుగుచుండినను గూడ పాటింపకుండ గాంధిగారు నిరంతరమును సంచారము చేయుచునేయుందురు. ప్రయాణసౌకర్యములు లేనిగ్రామములకు కాలినడకనుగూడ గాంధిగారు పోవుచుందురు. అస్పృశ్యులు నివసించు తావులకే గాంధిగారు ముఖ్యముగా వెళ్లుచుందురు. వారిమధ్యనే వసించుచుందురు. గాంధిగారి ఉపదేశములను సరిగా గ్రహించిన శిష్యులు వేలకొలదిఁగా చాలదీక్షతో సంస్కరణోద్యమమును సాగించుచున్నారు. సాధారణముగా పెక్కు శతాబ్దములకైనను చక్కఁబడఁజాలనియీసమస్యలీకారణమున కడు శీఘ్రముగానే ఒక్కపూరుషాంతరముచే చక్కఁబడుచున్నవి. గొప్ప సాంఘికపరివర్తనమునకుఁ దగినట్టి మార్పిపుడు మాకన్నులయెదుట నద్భుతముగా జరుగుచున్నది. అస్పృశ్యతాదోషము, పాపకరమగు దేవాలయ వ్యభిచారము, అతిబాల్యవివాహానర్థము, అక్రమమగు ఘోషాపద్ధతి, చిన్నపిల్లలకు సైతము అన్యాయముగ నిర్బంధవైధవ్యమును విధించుట మున్నగు సాంఘికదురాచారము లన్నియునుగూడ కడుశీఘ్రముగనే నిర్మూలింపఁబడుచున్నవి. పూర్వాచారపరత్వమునకుచేయు ఆచార



ములు పైకి చూచుటకు ఇనుపగోడవలెనే గంభీరముగా కనఁబడునుగాని పూర్వాచారపరత్వమునందలిలోపలి కోటగోడ యిపుడు సంస్కర్తల వశమైనది. ఈనూతనసంస్కరణములు భారతీయులవలననే మనఃపూర్వకముగా జరుపఁబడుచుండుటచే ఇవి చిరస్థాయిగా నుండఁగలవు.

ఈరీతిగా నూతనశక్తు లన్నికడలను పనిచేయుచుండఁగా నీవిషయమునుగూర్చి మేయోకన్య యేమియును వ్రాయకపోవుటవలననే ఆమె యీవిషయముల నన్నిటిని భారతదేశమునందు అత్యల్పసంఖ్యాకులగు ఆంగ్లేయులనుండిమాత్రమే గ్రహించిన దని స్పష్టమగుచున్నది. ఆమె భారతీయుల నడిగి తెలుసుకొనియుండలేదు. "వంగరాష్ట్రమున ఒకరూపాయగాని ఒక కన్యగాని లేదు. అస్పృశ్యులు వేల్సుయువరాజును పూజించిరి. అసహాయోద్యమము విఫలమైనది." మున్నగు నామెవ్రాసిన విషయములనుబట్టియే యీ కుట్ర వెల్లడియగుచున్నది. మామూలుగా ఆంగ్లేయులక్లబ్బులలో వినఁబడు విషయములనే ఆమె మరింత కల్పనతో వ్రాసినది. భారతీయులకు పూజ్యతములగు నాయకుల నీతివర్తనమును కుటుంబజీవనమును ఈమెయిట్లు నిరంతరము నీగ్రంథములను రచించుటచే నీగ్రంథాభాసములను విమర్శింపవలసి వచ్చినదిగాని లేనిచో వట్టికల్లలపుట్టయగు దీనిని భారతీయు లొకకొరమాలిన పాత్రముగా భావించి విసరిపాఱవేసియే యుందురు. ఈమెయిట్లు చేయుటవలన నిది బుద్ధిపూర్వకముగ భారతీయుల నవమానపరుచుటకు వ్రాయఁబడినదేగాని అనాలోచితముగా వ్రాయఁబడినది కాదని యూహించుట కవకాశ మేర్పడినది.

ఆరేబియానైట్సు అనుదుర్నీతియుతమగు గ్రంథమును పాశ్చాత్యులు చాల ఆసక్తితో చదువుచుందురు. అదిగూడ ప్రాగ్దేశములనుగూర్చి వ్రాయఁబడిన అనుచితమగు నొక గ్రంథమే యగుటచే తానుగూడ నట్లు స్త్రీపురుషసంబంధములను దుర్నీతులతో నీగ్రంథమున నింపినచో చాలమందిపాశ్చాత్యులు తనగ్రంథమును చదివెదరని యీమె గ్రహింపఁగలిగినది.

విట్రలుద్రావకము తాను స్పృశించినవస్తువులనన్నిటిని నిప్పువలెనే దహించును. మేయోకన్యగ్రంథముగూడ విట్రలుద్రావకమువంటిదే యని దానిని సాకల్యముగా చదివినభారతీయు లందరునుగూడ గ్రహింపగలిగిరి. ఈ గ్రంథము దహించి భస్మ మొనర్చును గాని లోపములను తొలఁగించి

సంఘటన మొనరింపఁజాలదు. ఇది నిరుపయోగమగు భాగమునుమాత్రమే దహించియున్నచో మన మీయామెకు కృతజ్ఞులమైయే యుందుముగాని యిది అట్లు చేయదు. ఆవగింజంతయైన మిగులకుండ పూర్తిగ నేదహించుచున్నది. ఈ అనర్థకములఁ దొలఁగుటకు నెట్టి సాధనములను ఆమె చూపించఁగలిగి యుండలేదుగాని బ్రిటిషుపరిపాలన మీదేశమున శాశ్వతముగ నుండవలెనని మాత్రమే తెలిపినది. హిందూమతమువట్టి పనికిమాలినమత మనియు దాని యం దొక్క సుగుణమైనను లేదనియును ఆమె వ్రాయుటవలననే భారతీయుల కత్యధికమగు నాగ్రహము కలుగుటకు కారణమైనది. కాశీలోని దేవాలయములు మురికిగానున్న వనియును కలకత్తా కాళీఘట్టమున కాళి కాలయమున అక్రమములు జరుగుచుండుననియు నామె వ్రాసిన విషపు వ్రాఁతలు హైందవులహృదయములకు విషాస్త్రములై నాటినవి.

మొదట శస్త్రములు కావించి పిమ్మట దానిపైని ద్రావకమును వ్రాసిన వైద్యుఁడు కనికరమును నైపుణ్యమును కలిగినవాఁడైనచో ఆగాయము మానునుగాని యీమె అట్టిదిగాదు. ఈమె ద్వేషపూరితయగు వైరి యగుటచే గాయమును కలిగించుటయే ఆమె సంకల్పముగాని దానిని కుదుర్చుట ఆమెసంకల్పము కాదు. ఆమెసానుభూతితో హిందూమతచరిత్రను సాంతముగ తెలుసుకొనె ననుట కీగ్రంథమున నొక్క నిదర్శనమైన లేదు. భారతజీవితమునకు హిందూమతమే చిరతరమును దృఢతమమునగు పునాదియైయున్నది. కావున హిందూమతమును తృణీకరించుచు భారతదేశమును గూర్చి గ్రంథమును వ్రాయఁబూనుట హామ్లెటుపాత్రలేకుండ హామ్లెటు నాటకమును ప్రదర్శించుటయే యగును.

## ఎనిమిదవ లేఖ

అస్పృశ్యతను తొలగింపవలెనను గాఢమైన విశ్వాసము ప్రజలలో కలిగిననే భారతదేశమున కార్మికోద్యమము నిలువఁబడును. లేనిచో నది అంతరించును. కార్మికోద్యమమునందు వర్ణవివక్షయును ధనవంతులు బీదలునను భేదములును లేవు. రవీంద్రమహాకవి, మహాత్ముఁడు, లాలాజీ, శ్రద్ధానందజీ, మాళవ్యాజీ మున్నగువారితోపాటు కార్మికసంఘమువారుగూడ అస్పృశ్యతను పూర్తిగా తొలగింపవలెననియే ఆశించుచున్నారు. బహుప్రాచీనమును కడు సంకుచితభావయుతము నగు నాగరకతవలన నేర్పడిన



నష్టకరములగు పద్ధతులలో నేటివరకును అంతరింపకుండనున్న వానిలో అస్పృశ్యత యొకటి గాన దీనిని వెంటనే అంతరింపఁజేయవలెను. కార్మిక సంఘము (ట్రేడుయూనియనులు) అన్నిటిలోను అస్పృశ్యులను ధారాళముగా చేర్చుకొనుచున్నారు. ఇతరకార్మికులు అస్పృశ్యుల నన్నివిధముల తమతో సమానులుగానే చూచుచున్నారు. భారతదేశమునందు నేఁడు విద్యాధికులందరు నిట్టి అభిప్రాయములనే కలిగియున్నారు.

అస్పృశ్యతాసమస్యను రాజకీయముగా నుపయోగించుటకు విద్యాధికులు మిక్కిలి ప్రతికూలురై యున్నారు. ఈ విషయమున మేయోకన్య గొప్పముఖ్యాపరాధులలో నొక్కతెయై యున్నది. వేల్సు యువరాజు ఢిల్లీకివచ్చుటను అపుడు అస్పృశ్యులు యువరాజును పూజించుటనుగూర్చి యీమె వర్ణన అసహ్యకరమగునతిశయోక్తులతో నిండియున్నది. ఇదియంతయును ఆమె కల్పనయేగాని నిజముగా జరిగినదికాదు. యువరాజు వచ్చినవెంటనే నేను ఢిల్లీకివెళ్లితినిగాన నిజస్థితినిసరిగా తెలుసుకొనఁగల్గితిని. ఆమె వర్ణించినరీతిని సార్వభౌమకుమారు నెవ్వరును పూజించియుండలేదు. ప్రశంసనీయములు కానట్టి పన్నాగములు చేయఁబడుటచే యిరుగుపొరుగు గ్రామములప్రజలు చాలమంది అపుడు ఢిల్లీకి వచ్చుట తటస్థించినది.

సామ్రాజ్యజాదమున అస్పృశ్యులను పణముగా నొడ్డుట అతినీచమగు పన్నుగడ. దాని నీమె తనగ్రంథమున పేర్కొనుటవలన నిజమగు సంఘసంస్కరణమునకు హానియే కలుగును. రోమనులకాలమునుండియు వచ్చుచున్న మిత్రభేదతంత్రమునందిదిగూడ నొకభాగమే. ప్రతిసామ్రాజ్యవిధానమునకు నిది కళంకమే యగుచున్నది. దీనిలోగుట్టునంతను అస్పృశ్యులే క్రమ్మముగా గ్రహింపఁగలుగుచున్నారు. ఎవరు తమ్మును వంచించుటలేదని వారికి నమ్మకము కలుగునో వారినే అస్పృశ్యు లనుసరించెదరు.

అస్పృశ్యత అన్యాయమగు పద్ధతియే కాని యిది యితరదేశము లందుఁగూడ లేకపోలేదు. ఇంకొకపేరుతో మాత్ర మున్నది. జయింపఁబడినప్రజలను విజేత లితరదేశము లన్నిటిలోను గూడ నిటులే నీచముగా చూచుచున్నారు. అమెరికా సంయుక్తరాష్ట్రములలోను దక్షిణాఫ్రికాలోను పాశ్చాత్యులు కానివారి నందరిని నీగ్రోలు, రెండుయిండియనులు,

ఆసియాఖండవాసులు ప్రత్యేకస్థలములలో నేయుంచఁబడుచున్నారుగాని తమతో సమముగా గౌరవించి ఆదరించుటలేదు. జపానులో నిప్పటికిని అస్పృశ్యత తొలఁగలేదు. మధ్య దక్షిణ-అమెరికాలలో బానిసతనము పూర్తిగా నున్నది. మధ్య తూర్పు ఆఫ్రికాలలో ఇష్టములేనివారిని అధికారబలమున పట్టితెచ్చి వెట్టిచాకిరీ చేయించుచున్నారు. ఇవన్నియు అస్పృశ్యతలోనే చేరును. దీనిని తొలగించుటకే ప్రపంచమునందంతటను కార్మికోద్యమము పూనుకొనెను.

భారతదేశమునం దిపుడు అస్పృశ్యులనఁబడుచున్నవారు ప్రాచీనకాలమునందు పెక్కుశతాబ్దములకు పూర్వము దాడివచ్చినవారిచే జయింపబడినవారిసంతతివారే. అమెరికాలో నిపు డున్నటులే ఆరోజులలో భారతదేశమునందుఁగూడ జాతిద్వేష ముండెడిది. ఇపు డది అంతరించినది. ఈసంఘర్షణము పెక్కువందలయేండ్లనుండి జరుగుచున్నది గాన నొక్కరోజులో నంతరింపదు కాని దీనిని రూపుమాపుటకు అనఁగా ఒకజాతి నింకొకజాతివారును ఒకవర్ణము నింకొకవర్ణమువారును అడగద్రొక్కు పద్ధతి నంతరింపఁజేయుటకే భారతదేశమునందలి విద్యాధికులు పూనుకొనియున్నారని భారతకార్మికులు నిస్సంశయముగా ప్రపంచమునకు వెల్లడింపఁగలరు. అస్పృశ్యతను కార్మికు లెన్నడును సమర్థింపరుగాని యిట్టితప్పనే చేయుచున్న పాశ్చాత్యదేశములవారు భారతీయుల నిందులకు విపరీతముగా నిరసించుట పాడి గాదని తెలుపుచున్నారు. దక్షిణాఫ్రికా మున్నగుదేశములలో పాశ్చాత్యులు గాని భారతీయులు మున్నగు నితరదేశముల కార్మికులనుగూడ పాశ్చాత్యకార్మికులతో సమముగా గౌరవించున ట్లచటిపాశ్చాత్యకార్మికసంఘములవారు చూడవలెననియు సమానమగు పనికి సమానమగు జీతము, అందరికిని సమానమగు జీతములపద్ధతి మున్నగువాని నేర్పరుపవలెననియు కోరుచున్నారు.

భారతదేశములో అస్పృశ్యత మున్నగుసాంఘిక దురాచారములను తొలగించు టెటులు?

భారతదేశము ప్రధానముగ శాంతియుతమగుదేశము. ప్రజ లెపుడును శాంతిని లోకకల్యాణమునే ముఖ్యముగా కోరుచుందురు. అపుడపుడు తాత్కాలికోద్రేకమువలన జనసమూహములు మతకలహములు



మున్నగు నుద్రేకములకు గడంగుట లేకపోలేదుగాని గ్రామములలో అధికసంఖ్యాకులు హైందవులును మహమ్మదీయులునుగూడ శాంతముగా జీవింపవలెననియే కోరెదరు.

భారతదేశము మిక్కిలి గొప్పది యగుటచే ప్రజలందరును శాంతప్రియులే అనుట సాహసమే యగును. పంజాబు వాయువ్యసరిహద్దుపరగణా మున్నగుకొన్నిప్రాంతములలో ప్రజలు మొదటినుండియుయుద్ధనిపుణులేగాని వారిసంఖ్యఅత్యల్పము. భారతీయులకు మంచి యుపదేశమును చేయఁగోరువారు వారికాగ్రహము కలుగునట్లుచేయఁగూడదు. తానుశాంతి వైరాగ్యాదులను కలిగియుండి నీతిబలముతో నుపదేశింపవలెను. బోధన అనుష్ఠానపూర్వకముగానుండనిచో భారతీయు లాదరింపరు. ఉపదేశించువానివర్తనమువారుముఖ్యముగా గమనించి అతఁడు వంచకుఁడగునా కాఁడా యని మొదటనిర్ణయించినపిమ్మటనే అతని ఉపదేశముల నన్నిటిని అనుసరించెదరు. ఉపదేశకుఁడునీతివర్తనుఁడై మొదట ప్రజలప్రేమకును గౌరవమునకును పాత్రుఁడైననేగాని స్థిరమగునెట్టిసంస్కరణమును కొనసాగింపఁజాలఁడు.

భారతదేశము పుణ్యభూమి. ప్రజలను పునీతులను చేయుశక్తి దానికి సహజముగనే యున్నది. కావుననే ప్రజలు దైవభక్తి గలిగి శాంతముగా భగవద్ధ్యానము నొనరించుటయం దాసక్తి కలిగియుందురు.

## తొమ్మిదవ లేఖ

"కలకత్తానగరమున కాళికాలయమునందు గొఱ్ఱెలను బలియిచ్చెదరు. నోరులేని జంతువుల చాల బాధ పెట్టుచుందురు" అని యామె వ్రాసినవిషయమును చాల శ్రద్ధగా విమర్శింపవలసియున్నది. అట్టి క్రౌర్యములు జరుగుచునే యుండును. అది యెచట జరిగినను గూడ దేశమునకు గొప్ప అపఖ్యాతియే కలుగును. ఇది మంచిదని యెవరును వాదింపజాలరు. ప్రపంచమందంతటను పశువులపట్ల క్రౌర్యము జరుగుచునేయున్నది. ఇది ముఖ్యముగా నిరసింపదగినదే.

ఇప్పటికిని యేవో కొన్నిదేవాలయములలో జంతువులను బలియిచ్చుచున్నమాట నిజమేగాని దేశమునందు తక్కిన దేవాలయము లన్నిటిలోను ఈదురాచారమును పరిత్యజించి హిందువులు పువ్వులు పండ్లు మున్నగువానినే యిచ్చెదరు. ఇది చాల మంచిపద్ధతి. బౌద్ధులును జయినులును వైష్ణవులు

నుగూడ జీవహింసను నిరసించినందున నిపుడు నూటికి 99 దేవాలయములలో జంతు బలులు జరుగుట లేదు. దేశమునందలి హైందవులలో పెక్కు కోట్ల మంది ఆహారముకొరకుగాని మతకార్యములకొరకు (యజ్ఞములు బలులు మున్నగునవి) గాని యెంతమాత్రమును జీవహింసచేయరు.

కలకత్తాలో కాళికాలయమునజరుగుచున్న జంతుబలులను మిక్కిలి తీవ్రముగా నిరసించుచు రవీంద్రనాథుగారు వంగభాషలో విసర్జన మను పేరుతోను ఆంగ్లభాషలో 'శాక్రిఫైసు' అనుపేరుతోను రెండు నాటకములను వ్రాసిరి. వీనిని కాళీఘట్టమునకు సమీపమునందే ప్రతివత్సరమును ప్రదర్శించుచుందురు. ఈదురాచార మా నాటకములలో నిరసింపఁబడినంత తీవ్రముగా మఱెచటనుగూడ నిరసింపబడలేదు. రవీంద్రకవి వ్రాసిన నాటకము లన్నిటిలోను ఈనాటకములనే దేశీయులు మిక్కిలిగా ప్రేమించెదరు. వీనిని ప్రదర్శించినపుడు నాటకశాలలు ప్రేక్షకులతో క్రిక్కిరిసిపోవును. వీనియందలి నీతిని హా రధికముగా ప్రశంసించెదరు. ప్రజల కీబలులపై నింకను అభిమాన మున్నచో నీ నాటకములను వారిట్లు ప్రశంసించియుండరు. కేవలము అజ్ఞానులగు మూఢు లెవరో మిక్కిలి కొద్దిమందిమాత్రమే యీబలుల నింకను కావించుచున్నారు.

దేశమునందు హైందవులలో హెచ్చుమంది ఆహారముకొఱకు ప్రతిదినమును జంతువులను వధించుట పూర్తిగా మానివేసిరిగదా? యిది ఘనకార్యము కాదా? ఈజంతువులను వధించునట్టి స్లాటరుహౌసులు అసలే లేకుండుట ఘనకార్యము కాదా? ఈవిషయమున మరేదేశమునుగూడ భారతదేశమునకు సరిరాజాలదు. హిందూమతాంతర్భాగముగ నేర్పడిన బౌద్ధమతము సకలజీవులపైనను కనికరమునే ప్రధానముగా బోధించుట వలననే హైందవులలో నిట్టిగొప్పమార్పు విస్తారముగా కలిగినది. కేవలము ఇది నైతికమగు గొప్ప పరివర్తనము. దీనివలననే లక్షలకొలదిమంది మాంసాహారమును పూర్తిగా త్యజించిరి. నోరులేని బీదజంతువులపైని మానవుల కధికమగు కనికరమును కలిగించుచు ఘాతుక మృగధర్మమగు మాంసాశనమును రూపుమాపిన మత మెన్నడును కాఠిన్యముగల మతము కాజాలదు. ఈకారణముననే అహింసాధర్మానుసరణమున భారతదేశము ప్రపంచమునం దగ్రస్థానమును బడయగలిగినది.



బండ్లను తోలువారుమున్నగువారిలో జ్ఞానహీనులు కొందరు బండ్లను లాగుచుండు జంతువులను బాధించుచుందురు. కొందరు గోపాలురు ఆవులపాలను దూడల కొక్కచుక్కయైనను మిగులకుండ పిండివేసెదరు. మఱికొందరు పాషాణహృదయులు బ్రదికియుండగనే గొర్రెలచర్మములను ఒలిచెదరు. ఇది మహాదారుణమే. పాశ్చాత్యదేశములలో వాణిజ్యముచేయు వారు కొందరు హెచ్చులాభమును బడయవలెనను దురాశవలన అతిదారుణములగు పద్ధతులలో జంతువులను వధించుచుందురు. అవియును ఇవియును గూడ రాక్షసకృత్యములే. ప్రపంచమునం దిట్టి ఘోరకృత్యము లంతరించునట్లు వెంటనే వీనిని పూర్తిగా రూపుమాపవలెను. ఇందుల కందరును గూడ పూనుకొనవలెను. కలకత్తా కాళికాలయమునందలి బలులనుబట్టి భారతదేశమంతటను ఇట్టి ఘోరకృత్యములు జరుగుచున్నవని భావించుటెట్లనుచితమో అటులే యిట్టిక్రూరకృత్యములు ప్రపంచమునం దొక్క భారతదేశమునందుమాత్రమే జరుగుచున్నవని తలంచుటగూడ అనుచితమే.

భారతదేశమునందు స్వేచ్ఛగా సంచరించునట్టి ఉడుతలు పక్షులు మున్నగువానికి మనుష్యులనిన నెంతమాత్రమును భయములేదు. ఈవిశేష మొక్క భారతదేశమునందుమాత్రమే కనబడును. ముఖ్యముగా హైందవులలోనే కనబడును. తక్కినదేశములలో నిట్టిభీతివలనకలుగు వ్యథ దుర్భరముగా నెల్లకాలము నుండును. తోఁటలలోను దొడ్లలోను వనములలోను గూడ నీజీవములు మనుష్యుల కతిసమీపమునగూడ కడునిర్భయముగా సంచరించుచుండును. గోడలమీద ప్రాకుచుండును. ఇండ్లలో దూలములమీద వ్రాలుచుండును. నేఁడు ఉదయమున నేను వసారాలో కూర్చుండియుండగా నొకవుడత నాచుట్టును తిరుగసాగెను. నాకాళ్లమీదగూడ నిర్భయముగా ప్రాఁకెను. నేను షికారువెళ్లినపుడు పక్షులు కదలకుండ కలకలనాదము లొనరించుచుండెను. అవి నాకాళ్ల దగ్గరనే వ్రాలుచుండెను. మానవులకును ఇతరప్రాణులకునుఇట్టియన్యోన్యము కలుగుట పెక్కుశతాబ్దముల ఫలితమే. ప్రపంచమునం దిది మిక్కిలి అద్భుతవిషయము. పాశ్చాత్యులుదీనిని చూచితీరవలెను.

సమాప్తము.

# శృంగార గ్రంథమాల

## శృంగార రాధామాధవసంవాదము.

వెలిదిండ్ల వేంకటపతికవిసార్వభౌమప్రణీతము. వెల రు. 2-0-0

"మీ శృంగార రాధామాధవమును ఆమూలాగ్రము పఠించినాను. సవిమర్శముగా కథానుక్రమణికను విలోకింపఁగా కవి కడుంగడు సమర్థుఁడు రసజ్ఞుఁడు అనర్గళధారకలవాఁడు మిక్కిలి మృదుపాకమున రచించునిపుణుఁడు, అనుభవజ్ఞుఁడు. రసమునకై సామెతలను మిక్కిలి యుపయోగించెను. ప్రబంధము సర్వవిధముల మనోహరముగ నున్నది యని నాకుఁ దోఁచినది. మహాకవులగ్రంథములపై నేఁటికవులయభిప్రాయములతోఁ బనియేలేదు. అయినను మీకోరిక ననుసరించి భగవంతుఁడు నాకు తోఁపించినదానిని వ్రాసినాను."

(సం) శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

"శృంగారరాధామాధవసంవాద మనుగ్రంథము నామూలాగ్రముగాఁ జదివితిని. ఇది కేవలశృంగారరసాత్మకగ్రంథము. వర్ణనాదులకంటె వాక్యోపవాక్యములసొంపే దీని కందము తెచ్చినది. ఈవాక్యోపవాక్యములు సరసములుగను, రసికజనహృదయ రంజకములుగను నున్నవి. శైలి లలితము. పాకము ద్రాక్షాపాకము. శృంగారాతిరేకమును పొందుచున్న అచ్చు సర్వాంగ సుందరముగ నున్నది." (సం) జయంతి రామయ్య.

## శృంగార అహల్యా సంక్రందనీయము.

సముఖము వెంకటకృష్ణప్పనాయక ప్రణీతము వెల రు 2-0-0

ఇందు అహల్యాసుందరీపురందరుల సరసశృంగార వచోవిలాసనిచయము లెస్సగ వర్ణింపఁబడినది.

## శృంగార మల్హణచరిత్ర.

ఎడపాటి ఎఱ్ఱనమహాకవిప్రణీతము వెల రు 2-0-0

ఇది వారవనితాతిలక మగు మదనసేనకును బ్రాహ్మణయువకుఁడగు మల్హణునకును సంబంధించినశృంగారరసప్రబంధము. ఇందు వారకాంతల కపటోపాయములు, వణిక్పుంగవుని మోహము అత్యద్భుతముగ నిరూపించి, మదనసేన మల్హణుని వివాహము చేసికొనుట మిగుల సరసముగ వర్ణితము



## శృంగార భల్లాణచరిత్ర.

గంగాధరకవిప్రణీతము. వెల రు 2-0-0

ఇందు, భల్లాణభూపాలుఁడు శివభక్తిపరతంత్రుఁడై తనకుఁ గలిగిన సర్వసంపదను అడిగినవారికి లేదనకుండ నిచ్చుటకు ప్రతిజ్ఞఁబూనియుండగ నొకనాఁడు మహేశ్వరుఁడు జంగమరూపము దాల్చి కామార్తునిభంగి భల్లాణభూపాలునివద్దకు వచ్చి సద్గుణవతియు, రూపవతియు, విద్యావతియు, ఉత్తమజాతిసంభవురాలును, విటునితో కలసియుండని యొకయువతిని ఒసఁగుమని కోరుటయు, అందు కారాజు సమ్మతించి విటవిహీనయగువనితను రప్పించుటకుఁగాను వారవనితానికేతనముల కరుగుటయు, నెచ్చటఁ గాంచినను అట్టివనిత దొరకనందున తన పెద్దభార్య నాజంగమునకొసఁగుటయు, రాజమహిషి శృంగారచేష్టలును, జంగమరూపము దాల్చిన నగజాపతివిలాసములును, మిగుల శృంగారముగ వర్ణింపఁబడినవి.

## శృంగార సావిత్రి

తంజావూరు రఘునాథరాయలప్రణీతము వెల రు. 2-0-0

లోకప్రసిద్ధిం జెందిన సావిత్రీసత్యవంతులచరిత్రమే ఇందు అత్యంతమనోహర శృంగారరసప్రపూరితపదములతో వర్ణింపఁబడినది. సావిత్రిచరిత్ర యెంతభక్తిరసభరితమో, దానికన్న వేయి మడుంగు లధికముగ శృంగారరస భూయిష్ఠమై విరాజిల్లుచున్నది. ఇందుఁగల ప్రతిపదము శృంగారము, ప్రత్యక్షరము శృంగారభాసురము.

## శృంగారము.

ఆంధ్రదేశమున ప్రఖ్యాతిగాంచినకవులచే వ్రాయఁబడిన శృంగారపద్యసముదాయకగ్రంథరాజము. వెల 0-4-0

## శృంగార కాళిదాసుకథలు

ఇందు కాళిదాసుని పూర్వజన్మవృత్తాంతము, కాళికావరప్రసాదము, కాళికాదేవిని దండకరూపచ్ఛందస్సున స్తోత్రముచేయుటయు, శృంగారపురమున కరిగి మదనసేనమహీపతియాస్థానకవిశిరోమణిగ కొలఁదిదినములు గడపి, శృంగారకవి బిరుదాంకితుఁడై మదనసేనమహారాజుతో భోజభూజాని కొలువున కేఁగి శారదను సర్వవిద్యలలో నోడించుటమున్నగు

వవి శృంగారరూపముగ వర్ణింపఁబడినవి. శృంగారకాళిదాసున శృంగార మునకు కొదవయుండు నే? వెల రు 1-0-0

## కృష్ణపక్షము

ఇందు నూతనభావపరంపర వెల్లివిరియుచున్నది. స్వేచ్ఛాగానము స్వచ్ఛసరసభాషాకాశమున ప్రతిధ్వనించుచున్నది. ప్రతిపదము హృద్యము, భావము భావనాతీతము. వెల రు. 1-8-0

## వేటూరి ప్రభాకరశాస్త్రిగారి గ్రంథములు.

శృంగారశ్రీనాథము-శ్రీనాథకవీశ్వరునిచరిత్ర మెల్ల నిందు కరతలామలకముగాఁ జూపఁబడినది. వెల రు 2-0-0

## నీతినిధి. వెల రు 1-4-0

రెండువేలయేండ్లకుముందు భారతీయబ్రాహ్మణునిచే రచితమయి టిబెట్టుభాషలోనికి మాఱినది. అందుండి చైనీభాషలోకి మాఱినది. తుద కాంగ్లములోకి వచ్చి 60-70 ముద్రణములు పొందినది. అందుండి తెలుఁగులోకి వచ్చినది. ఒక్కొక్కవాక్య మొక్కొక్కరత్నము. ఇహపర సంబంధములయిన సర్వశ్రేయస్సులకు సాధనములైన సద్వర్తనములీరు వెల్లనిందున్నవి. వేయేలా? ఆంధ్రులప్రతియింట నుండఁదగిన దనినఁజాలును.

చాటుపద్య మణిమంజరి, ద్వితీయభాగము. 1-6-0

ప్రబంధరత్నావళి. 1-8-0

ప్రతిమానాటకము. 1-0-0

భగవదజ్జుకము. 0-6-0

మధ్యమవ్యాయోగము-కర్ణభారము. 0-8-0

మూన్నాళ్లముచ్చట 0-4-0

దివ్యదర్శనము. 0-6-0

విశ్వాసము- జాలిగొల్పును. విశ్వాసముగల కుక్కకథ, పద్యకృతి. 0-2-0

## కడుపుతీపు

కడుపుతీపు కరుణరసభరితమైన పద్యప్రబంధము. కన్నకడుపుమీఁది.



తీపుచే ప్రాణములఁ గోల్పోయిన సతీమణిచరిత్రము. వెల రు 0-4-0

కపోతకథ - శాంతిపర్వమందలి లుబ్ధక కపోతోపాఖ్యానము ననుసరించి రచింపబడిన హృద్యపద్య ప్రబంధము. 0-4-0

## సప్తపదులు.

మార్గశిరమాసమున వైష్ణవులనుసంధానించు ద్రవిడకృతికితిరుప్పావైకి తెల్గు. భక్తి శృంగార రస భరితము. 0.4-0

స్వధర్మప్రకాశినీపత్రికాధిపప్రకాశిత మతగ్రంథములు.

నిత్యకర్మాష్టకము—సతాత్పర్యము. వెల రు 2-8-0

కాలికో బైండు 3-0-0 లైబ్రరీయడిషన్ 4.0-0

త్రికాలసంధ్యావందనము, డిటో గాయత్రీచిత్రపటశోభితము 0-6-0

స్నానమంత్రములు డిటో 0-3-0

మంత్రపుష్పత్రయము డిటో 0-4-0

మహాసౌరమంత్రములు:. సూర్యనమస్కారములు డిటో 0-8-0

సదాచారము డిటో 2-0-0

ఆబ్దికమంత్రములు. డిటో 1-4-0

తీర్థశ్రాద్ధమహాలయవిధులు 1-12-0

విఘ్నేశ్వరపూజా, పుణ్యాహవాచనములు 0-8-0

సూక్తము, డిటో పురశ్చరణసహితము 0-4-0

గోత్రప్రవరసంగ్రహము, వచనము 0-8-0

కైవల్యనవనీతము. సటీకాతాత్పర్య విశేషార్థము. మొదటిభాగము. 2-8-0

సందేహ నివారణ ప్రకరణము-రెండవభాగము 2-0-0

1, 2 భాగములు కలిపిన బైండు 4-0-0

ముప్పదియిద్దఱు మంత్రులచరిత్ర 0-12-0

ఈశ్వరదర్శనము 1-4-0 కలికో బైండుది 1-8-0

సనాతనధర్మప్రశ్నోత్తరావళి; ప్రథమవాచకము

అత్యావశ్యకమయిన గ్రంథము. 0-4-0

శ్రీ నందిరాజ లక్ష్మీనారాయణ దీక్షితచరిత్రము—పద్యకావ్యము 1-0-0

కలికో 1-8-0 అత్యుత్తమప్రతి 2-0-0

శ్రీవిద్యారత్న సూత్రములు, శ్రీగౌడపాదాచార్య కృతి 0-8-0

| | |
|---|---|
| వేదాధ్యయన సంప్రదాయము | 0-4-0 |
| సుభాషితశతకత్రయము. సతాత్పర్యము | 0-10-0 |
| పాండవగీతలు-టీకాతాత్పర్య ఆంధ్రపద్యసహితము | 0-10-0 |
| యోగాభ్యాసదర్పణము | 0-12-0 |
| డిటో లైబ్రరీయడిషన్ | 1-4-0 |
| నీతిద్విషష్టిక:-ఆచార్యసుందరపాండ్యవిరచితములగు సుభాషిత శ్లోకములు నాగరాక్షరముద్రితము | 0-8-0 |
| స్తోత్రరత్నావళి:-ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యసహితము ౧ భా. | 0-12-0 |

### ఇతరుల గ్రంథములు.

| | |
|---|---|
| నిజమైన కాశీరామేశ్వర మజిలీలకథలు. | 1-0-0 |
| లండను రహస్యము 2 భాగము | 0-12-0 |
| మంగళసూత్రము (నవల) | 1-0-0 |
| అమరన్న (నవల) | 1-0-0 |
| తొలకరి ((హృద్యపద్యములు) | 0-8-0 |
| భార్యను దొంగిలించుట | 0-4-0 |
| గమ్మత్తుచావు | 0-4-0 |
| వేశ్యాంగనా మహాసభ | 0-[illegible] |
| బాలోల్లాస కథావళి | 0-[illegible] |
| నాకాజీవనచరిత్ర | 1-[illegible] |
| ప్రాచీనవిద్యాపీఠచరిత్రము | 1-8- |
| హితోపదేశము, పద్యకావ్యము | 0-4-0 |
| బాలాసహస్రనామస్తోత్రము బాలగ్రహచికిత్సాసహితం | 0-4-0 |
| ఆర్యవిద్యారహస్యము | 1-0-0 |
| ఋగ్వేదసంధ్యాభాష్యము, సస్వరాంధ్రతాత్పర్యము | 1-8-0 |
| ఋగ్వేదాపరప్రకాశిక-సస్వరము | 1-8-0 |
| రమాబాయి (బొంబాయిలో జరిగినకథ) | 0-6-0 |
| కోడండ్ర కుతూహలము-అత్తల అంగలార్పు | 0-3-0 |

### జీవబ్రహ్మైక్యవేదాంత రహస్యము.

రెండవకూర్పు. వేదాంతమునం దభిలాషగలవా రందఱును తప్పక



చదువఁదగినది. యోగాభ్యాసములను గుఱించి దీనిలో విస్తరింపఁబడినది. వేదాంతరహస్యములు, దేవరహస్యములు గలవు. మోక్షసామ్రాజ్యపదవిని బొందుట కిదియే ముఖ్యగ్రంథము. 800 పుటలుగలది. యోగాభ్యాసపటములు 35 గలవు. మంచికాగితములు, మంచి బయండుగలది. వెల 3-0-0.

### ప్రాచీన హిందూదేశ రాజ్యాంగతంత్రము.

సాహిత్యవిశారద కోన వేంకటరాయశర్మగారు రచించినది. ఇందు పూర్వకాలపు శాసనసభలు, మంత్రులు, సైన్యవ్యవస్థ, నాగరకము, రాజు, గ్రామనిర్మాణము, ప్రభుత్వకార్యములు మొదలగువిషయములు పరిశోధించి సోదాహరణముగా వ్రాయబడినవి. వెల 0-12-0.

### స్వాతంత్ర్య లక్షణము.

ఓగేటి వెంకటసుబ్బయ్యశాస్త్రి బి. ఏ. గారు రచించినది. ఇందు మానవస్వాతంత్ర్యము, ఆత్మస్వాతంత్ర్యము, దాస్యనిరసనము, ధర్మావలంబనకరములగు ఉపదేశములు, అసహాయోద్యమమునం దభిమానులగువారి కుపయుక్తములగు ధర్మసూత్రరత్నములును గలవు. వెల 1-0-0.

# ముద్దు కృష్ణ.

దేశకవితావిభూషణ కొండపల్లి జగన్నాథదాసుగారిచే రచింపఁబడిన అయిదంకముల నాటకము. ఇందు భాగవతపద్యములును,కొన్ని పదములనే పాటలుగాను మార్చి బాలబాలికల కుపయోగించునట్లు వ్రాయఁబడినది. వెల 0-4-0

### శృంగార రసాలవాలము.

వెణుతుర్ల వడ్డి కవిప్రణీతము. అలంకారశాస్త్రము. సంస్కృతము చదువని తెలుఁగుపండితులవశ్యము చదువఁదగినమూఁడాశ్వాసముల ప్రాచీన ప్రబంధము. చక్కని శైలి. వెల 1-0-0.

# నారద కలహము.

కథారత్న పండిత సే. కృష్ణస్వామి శర్మగారిచే రచింపఁబడినది.

విషయసూచిక. [వెల 2-0-0







ఇవి మొదలయిన వెన్నో విషయములు గలవు.

## అన్నపూర్ణ

ఇదియొక సాంఘిక నవల. చెన్నపట్టణములో జరిగినకథ. ఇంగ్లీషు స్వాతంత్ర్యముకొఱకు శుద్ధహృదయముతో పాటుపడిన అన్నపూర్ణ నను బ్రాహ్మణయువతి చరిత్ర. ఆమె చదువులోని పట్టుదలచేతను తలిదండ్రులు చనిపోవునప్పుడుకూడ వారిని చూడఁబోలేదు. తాను పెండ్లి చేసికొననని పట్టుపట్టఁగా తండ్రి తనయావదాస్తియు పెండ్లిచేసికొన్నట్లయితే కూఁతున కియ్యవలయుననియు, లేనిచో నెలకు సరిపడు కర్చుమాత్ర మియ్యవలెననియు, వీలువ్రాసి చనిపోయినాఁడు. ఆసొత్తుకోసము ఒక పేదరును దబ్బిచ్చికొని పెండ్లియాడినది. కాని పైకిమాత్రమే దంపతులుగా ఏర్పాటు చేసికొన్నది. పాప మాతఁడీలు ప్రాణము విసిగి దేశాంతరముపోయినాఁడు. ఇంతట అన్నపూర్ణ అమ్మవారుపడి కురూపమునొంది జాబులువ్రాయఁగా మంచివాఁడు కనుక భర్త వచ్చి దాని నాదరించినాఁడు. ఈయాకథయంతయు చదివితీరవలసినదే. ఇపుడు స్త్రీల కింగ్లీషు చెప్పిం

చెడి తలిదండ్రుడు లీనావెలాక్కసారి చదువఁగోరఁబడుచున్నారు.

200. పుటల పెద్దపుస్తకము వెల 1-0

ఈక్రింది 5 పుస్తకములును శ్రీమతి, విద్యాసుందరి, బెంగుళూరి నాగరత్నము వ్రాసి ప్రకటించినవి.

1. ఏమే పిల్లా ఈలాగు మారిపోయినావూ? 0-
2. అయ్యో! నీవూ నామగఁడా? 0-
3. ఏమే ఒకరినుండి ఒకరు-ఇద్దఱము చెడిపోయితిమి? 0-
4. మద్యపానము-త్రాగువారియోగ్యత తెలుపును. 0-
5. శ్రీ త్యాగరాజాష్టోత్తరశతనామములు-ఇందు గణపతి - ఆంజనేయనామములు, త్యాగరాయచరిత్ర గలదు. 0-

లావణ్యమయి:—వంగభాషలోపుట్టిచాలభాషలలోనికి మారి సంస్కృతభాషనుండి తెలుఁగులోనికి వచ్చిన నవల. 0-

రోజాకుమారి—ఒక ఆంగ్లేయ కన్యసాహసౌదార్యము తెలిసికొని ఆశ్చర్యపడుదురు. సీమమిరపకాయ

కుసుమాంజలి:—108 కథలలోని మొదటి రెండుకలు. 0-

త్రిలోకీ జయము:—స్వర్గలోకములో జరిగిన సంఘసంస్క-

ధనాలపోలిసెట్టి పునర్జన్మనాటకం:—ఇదియొక ప్రహసనము. అతిలోభియగు పోలిసెట్టి బ్రదికియుండఁగానే వానిభార్య,బిడ్డలు,చుట్టాలు మొదలయినవారు చచ్చినట్లు రుజువుచేసి వానికి బుద్ధివచ్చులాగున చేసినాడు. నవ్వలేక కడుపు బ్రద్దలగును.

సత్తరువుపద్యాలు:—ఇది 1903లో శ్రీవిజయనగరంధర్మసత్రములో భుజించువిద్యార్థులను బాధపెట్టిన గుమాస్తాపైనిచెప్పినవి 0-



[illegible]చాంగశ్రవణం-ప్రహసనము 0-

[illegible]-గాడిదమీది పద్యాలు 0.

వీరమోగీంద్రశ[illegible]-వేదాంతము. 0.

బాలకృష్ణశతకము-వేదాంతముకందపద్యాలు 0.

[illegible]క్తి జ్ఞాన వైరాగ్య సూచక గీతపద్యాలు 0.

[illegible]ది 5 పుస్తకములుకలిపి బయండుచేసినది 0.

